మ హా క వి

# శ్రీ ఆదిభట్ట నారాయణదాస చరిత్రము



కృ తి క ర్త

శ్రీ యం. వి. ఆర్ కృష్ణశర్మ

కృ తి భ ర్త

శ్రీ కళ్ళా ఈశ్వరరావు

ఓం

# మహాకవి
# ఆదిభట్ట నారాయణదాస
# చరిత్రము


కృతికర్త

వాల్మీకి రామాయణ : భగవద్గీత : కావ్యత్రయాది కావ్యకర్త :

కవికోకిల : మధుర భారతి : విద్వాన్

శ్రీ యం. వి. ఆర్. కృష్ణశర్మ

(ప్రాచీన గ్రంథమండలి సంపాదకుడు - రవికళాశాల తెలుఁగు పండితుడు)


కృతిభర్త

సహృదయసమ్రాట్

మాన్యశ్రీ శ్రీ కర్రా ఈశ్వరరావు

B. Com (Hons) B. L. F. C. A.



మూల్యము 6-50

ప్రథమ ముద్రణము ౧౦౦౦ ప్రతులు
రాక్షస శ్రావణము (1975)

ప్రతులకు :
శ్రీ కర్రా ఈశ్వరరావు
B. Com (Hons) B. L. F. C. A.
చంద్రమౌళినగరు : గుంటూరు.
రవిస్టోర్సు : బ్రాడీపేట, గుంటూరు (4వ లైను.)

వెల్కం ప్రెస్, ప్రైవేట్ లిమిటెడ్ బ్రాడీపేట 2వ లైను గుంటూరు-2.



"తొండమెత్తిన మత్తశుండాల మారము
గ్గినపండ్లు నెమరువేసినది నేడు" —యస్వీ.

*Prof.* **S. V. Joga Rao,** *M. A., Ph. D.*
HEAD OF THE DEPARTMENT OF TELUGU
ANDHRA UNIVERSITY POST GRADUATE CENTRE
( FORMERLY PROFESSOR OF TELUGU
UNIVERSITY OF LENINGRAD U. S. S. R. )

Guntur

6-8-75

# ఆ ము ఖ ము

మహానుభావుల జీవితోదంతములు మానవజాతి పురోగతికి మార్గ దర్శకములు, ఆదిభట్ల నారాయణ దాసుగారు అటువంటి మహానుభావుడు. ఆయన వ్యక్తిత్వము అంత సులువుగా అవగాహన కందునట్టిదికాదు. కళా కౌశలము సరేసరి అది బహుముఖీనము. ప్రగాఢ ప్రతి పత్తితో ఆ మహానుభావుని అర్థము చేసికొనవలెనను పూనికతో ఒక సరస్వతీ పురోహితుడు చేసిన సారస్వత వ్యవసాయము యొక్క ఫలరూపమే యీ గ్రంథము.

శ్రీ యం. వి. ఆర్. కృష్ణశర్మగారితః పూర్వమే కతిపయ కృతిరాజములను వెలార్చి ఆంధ్రజనుల ఆదరాభిమానములకు పాత్రులైన పండితవరేణ్యులు - ఇప్పుడీకృతిలో తమ మధుర రచనా సంవిధానముతో ఒక లోకోత్తర చరితుని జీవితదర్శనము నతి మాత్రమనోజ్ఞముగా ప్రదర్శించిన సుకృతియైనారు. వారి సారస్వతోద్యమము సహృదయోపాదేయముగా సాగి చరితార్థమగునుగాక!

యస్వీ జోగారావు.

# భూమిక

శ్రీ ఆ॥ నా॥ దాసు అన్న సంజ్ఞ శ్రీ మదజ్జాడాదిభట్ట నారాయణ దాసుగారికి మా పితృపాదులొసంగిన నామాంతరము. దానిని వారు ఆ = సుప్రసిద్ధమైన: నా = నాకు గోచరమైన దాసు = జ్ఞానులు. అని నిర్వచించి, ఒక ప్రత్యేక శీర్షికక్రింద విపులముగా దృష్టాంతములతో సమర్థించిరి. శ్రీ దాసుగారు సహస్రమాస జీవియై, (జననము 31—8—64: మరణము. 2—1—45) అద్వైత జ్ఞానసంపన్నులై, ఉపనిషద్ధర్మ ప్రవక్తలై సచ్చిదానంద స్వరూపులై, జీవితమును లీలగా నిర్భయముగా, నిత్యతృప్తితో ఖేదమోదముల కతీతులై గడిపిన మహాభాగులు. భారతదేశమున ముప్పది సంవత్సరముల క్రితమువరకు — బహుముఖ ప్రజ్ఞావంతులై, నిజభక్తి భావనలచే, సహజ సంగీత సాహిత్య సార్వభౌములై, అమృత పూరితగాన ప్రావీణ్యముచే- అనన్య సాధ్యమైన కవితాశక్తిచే, ఆబాలగోపాలమును, పండితపామరులను సామాన్య మానవుని మొదలు మహారాజుల వరకు ఆనంద సముద్రమున నోలలాడించి తన హరికథాకథన ప్రక్రియకు షష్ఠిపూర్తిచేసికొని ప్రసిద్ధిగాంచిన మహనీయులు శ్రీదాసుగారు. నానాశాస్త్ర పురాణవేద పరిచయ భాగ్యమును గలిగినవారై, అష్టాదశ విద్యారహస్యములను కరతలామలకముచేసికొన్నవారై - భక్తిలోత్యాగయ్యగా - కవితాసంపదలో పోతన మహాకవిగా విరాజిల్లి, సర్వతంత్ర స్వతంత్రులై, అహమేవ పండితః అనునట్లుగా అఖండ యశస్సు నార్జించి, సర్వజన మనస్సులను ఆకర్షింపచేసికొని, ఆట, పాట, మీట మాటల మేటిగా, పేరెన్నికగన్న పుణ్యాత్ము డాయన. వారు, నృత్యగీతాది బహువిధ కళలలోనేగాక సంస్కృతాంధ్రాంగ్ల భాషలయందును పర్షియన్ అరబ్బీ, ఉర్దూ, హిందీ భాషలలోను అప్రతిమానప్రజ్ఞా పాటవమును గడించి ప్రతిభావంతులై యష్టభాషా చక్ర

వ_ర్తిగా బేరెన్నికగన్నవారు. తర్క-వ్యాకరణ ధర్మశాస్త్ర మీమాంసాది చతు
ర్దశ విద్యలను కూలంకషముగ జదివి ఆకళింపు జేసికొని సమయానుకూల
ముగ తన ప్రతిభను నాయా విద్యలలో ప్రకటించుకొను నేర్పు గల
విద్వచ్ఛిరోమణి. క్షణశః కణశశ్చైవ విద్యామర్థం చ సాధయేత్ అను
సూ_క్తికి దార్ఘ్యణముగ నొక నిముషము కాలయాపన చేయక తన భావిపురోగ
మనమునకు వినియోగించుకొన్న మహామనీషి. ఉ_త్తమకవితా సంపద పర
దేవతానుగ్రహమున్నగాని సాధ్యముకాదు. నిరంతరదేవీ ధ్యానమగ్నులై,
తనశ_క్తియు_క్తులను లోక విడంబనము చేయక, యాత్మ తృ_ప్తితో నఖండ
ఆత్మవిశ్వాస బలముతో ప్రత్యర్థులను జయించి, సంస్కృతాంధ్రములందు
షుమారు ఏబది గ్రంథములను రచించిన, వాగ్వశీకృతసరస్వతులు. ఇందు
ప్రబంధములు - హరికథలు - శతకములు- అనువాదకావ్యములున్నవి. ఇంక
యెందఱో మహారాజులు, రసజ్ఞులపయి నాలువుగా చెప్పిన పద్యములనేకము
లున్నవి. వారు హరికథా పితామహులై, హరిదాస జగద్గురువులై ఆంధ్ర
దేశములో అతిమనోహరమైన, సర్వకళలతో గూడిన హరికథాకథన
స్రష్టయై, అనేకమందికి ర_క్తిని భు_క్తిని, ము_క్తిని కలుగునట్లు మార్గదర్శకు
లగుటయే కాదు. "గానకవితావధాన నిధానులగు మహత్ములార దయతో
గనుడీ, దీని రచియించి ఈశాధీనంబుగ గృతి నొసంగితిని మోక్షేచ్ఛన్"అని
వ్రాసెడివారు. యదార్థ రామాయణము రచించి తన భార్య కంకిత మిచ్చిరి.
అనేకులు, శ్రీదాసవర్యులను వారి హరికథలను తమకంకిత మిమ్మని
తగిన ప్రతిఫలమును ముట్టచెప్పెద మని ప్రాధేయపడినను దాసుగారు
వారిని అట్టికోరిక తగదని రిక్తాశలతోననిపెడివారు. వారి హరికథ
లను దై_వార్పితముగ కృతిని రచించువారు. సాహిత్యలోకమునకు
గూడ సంస్కృతాంధ్రములలో అంతకృషి చేసినారనుట నిస్సందే
హము, నిర్వివాదాంశము — ఈ సమన్వయ దృష్టితో జూచినపుడు దాసు



గారు కవులేకాదు, మహాకవులనుటకూడ సమంజసము. నూనూగుమీసాల
దొరవయసులో బాటసారి అను వినూత్న ప్రక్రియతోగూడిన, శ్లేషార్థ
ములో ప్రబంధమును - నవరస తరంగిణి అనుపేర షేక్స్పియర్ కాళిదాస
రచనలనన్నిటిని నా మూలగ్రముగ జదివి, వాని సొగసులను నవరసము
లలో విభజించి, ఆంధ్రలోకమున కందించిన గొప్ప మేధావి. అటులనే
తమ అరువదవయేట, పర్షియను అరబ్బీ, ఉర్దూభాషల యొక్క లోతు
పాతులను ఒకమున్షీ సహాయమున సమగ్రముగా, అధ్యయనముచేసి, ఉమర్
ఖయ్యాము వంటి మహాత్మునియొక్క రుబాయితులను, పాశ్చాత్య పండి
తులు వానియొక్క నిజస్వరూపమును తెలిసికొనలేక వారికిష్టము వచ్చిన
చేతనయిన భౌతిక వాదములతో గ్రహించి, వారి భాషలో అనువదించు
కొన్నపుడు వానిని చదివి, ఖేదపడి, ఆరుబాయితుల సరియైన నిజమైన,
త_త్త్వపరమైన, అర్థములు గల కవితతో వాని స్వరూప స్వభావములు,
సంస్కృతాంగ్లాంధ్రములలో తెనిగించిన గొప్ప మేధావి, ధీశాలి శ్రీ నారా
యణ దాసుగారు. అటులనే సరళమైన భాషలో, సహజమైన భ_క్తి భావము
బుట్టిపడ, (అరవయేట విన్నరయ వెరవుదెలిపివై చిరి కన్నవారోప్చనాకు-
ఆనాటినుండి ఆడుచు బాడుచు నీ నామము చాటుచుంటి నలుదెసల - అని
తన వేల్పు వందలో వ్రాసుచ్చినారు) సూర్యనారాయణ, వేల్పువంద, శివ,
ముకుంద సత్యవ్రత, మృత్యుంజయ శతకములు - విష్ణుసహస్రనామములు -
వెన్నుని వేయిపేర్ల వినకరి, వేల్పుమాట, జగజ్జ్యోతి. (తన జగజ్జ్యోతి
అను గ్రంథములో "తెలుగువారలకు దేటతెల్లముగ నన్ని విద్యల తెను
గులో దెలుపనెంతు అన్ని విధముల నన్నుగాచియున్న ఆంధ్రదేశమునకు
నాయచ్చియున్న అప్పనముదీర్తునని చెప్పుకొనెను ) మొదలగు కృతులు
మిశ్ర ఆచ్చాంధ్రములలో విరచించుటయేగాక, అతి మనోహరమైన
శైలితో సంస్కృతములో రామచంద్ర, కాశీ శతకములను, హరికథామృ

తమను - 3 హరికథలు - తారకమను అపూర్వ సంస్కృత ప్రబంధమును రచించెను. హరికథలు రసవంతములై నను, కవిత్వముకన్న సంగీతాభినయములకు ప్రాధాన్యముండుటచే, దాసుగారి సంగీతమునకు, నృత్యమునకు, నటనకు హావభావములకు, హాస్యమునకు, అవి నిధానములై వానిలోనున్న ప్రతిభావ్యుత్పత్తులు గ్రహింపబడక ఈ సర్వకళా సంపుటిలో మహారాజుల సన్మానములలో మరుగున పడిపోయి, వారి కావ్యముల కంతగా ప్రచారము లేకుండుటచే వారిని మహాకవిగా నంతగా ప్రజానీకము గుర్తింపలేక పోయినది. ఇట్టిదానికి మరియొక హేతువు వారి సత్యసంధత, అకారణవైరము, నిష్కారణ ప్రేమ, యథాలాభసంతుష్టి మొదలగు సహజగుణములు గూడ ప్రతిబంధకములైనవని చెప్పవచ్చు. 'నాలవయేట - నేనరసిన గొలది నన్గొరి చదువు లెల్లదారసిల్లె'అని తనకు తాను ధీమాతో చెప్పుకొన్న ఆత్మ విశ్వాసముగల అంతర్వాణి వరేణ్యుడు.

నిజమాలోచించిన, వారు రచించిన, పైనిచెప్పబడిన ఉద్గ్రంథములే చాలు, వారి మహాకవి అను బిరుదమునకు తగిన ప్రతిబింబములుగా. ఆడినది ఆటగా — పాడినది పాటగా వర్తిలిన వేములవాడ భీమకవి వలె ఆశువుగాచెప్పినపద్యములు, చాటువులు, సంగీతాష్టావధానములు, లెక్కకు మీరియున్నవి. అవి యే సందర్భములందు చెప్పబడినవోకూడ దెలియుట ముఖ్యావసరమని నా యుద్దేశము. దాస కవీంద్రుల యాదర్శములు - భక్తి భావములు, ముఖ్యముగా నేటిసందిగ్ధ పరిస్థితులకు ఉపయోగపడుటకు, వెల్లడించుటకు, నెంతైన అవసరమున్నది. ఆ నిమిత్తమై, ప్రకాశకునిగా నేను వెలయించిన దాస భారతీ ప్రచురణములు, నిర్విఘ్నముగా సాగుచుండుటకు శ్రీ దాస కవీంద్రుల ఆధ్యాత్మికశక్తి ఆశీర్వచన బలమే కారణము. దానికి తగినట్లుగా నాకు చేదోడు వాదోడుగా, సంస్కృతాంధ్రములలో ప్రఖ్యాతిగొన్న ఇద్దరు పండిత ప్రకాండులు, విద్యోభయభాషాప్రవీణ, వేదాంతపారీణ



బ్రహ్మ శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రి మహోదయులు, ఆచార్య యస్. వి. జోగారావు M. A. P. H. D. మహోదయులు, ప్రధానాధ్యక్షులు, తెలుగు విభాగము, P. G. సెంటరు గుంటూరు.* నా కృషికి, సాహిత్యపరముగా, శ్రీ దాసుగారియందు భక్తితో, వారి ప్రతిభకు ముగ్ధులై, నన్ను వారి అముద్రిత రచనలను వెలుగులోనికి దెచ్చుటకు, పురికొల్పి, అనేక శ్రమల కోర్చి దాసభారతిని లోకమున కందజేయుటకు కంకణధారులై అడిగినంతడవుదేగా సంపాదకులుగా వ్యవహరించి ఇప్పటికి అయిదు దాస భారతీ రత్నములను ప్రచురించుటకు కారణభూతులైరి. వానిలో తల్లి విన్కి (లలితా సహస్ర నామవివృతి) అనునది శ్రీ ఓరుగంటి నీలకంఠ శాస్త్రిగారి సంపాదకత్వమున, మేలుబంతి, కచ్చపీశ్రుతులు వ్యాసపీఠము, నాయెఱుక (దాస మహోదయుల ఆత్మకథ) మధుర సరస్వతి, మహాకవి, యస్. వి. జోగారావుగారి సంపాదకత్వమున 1974, 75 సంవత్సరములలో వెలువడినవి. ఈ యిరువురి హితైషులకు, ఆప్తమిత్రులకు, నా కృతజ్ఞతాభివందనములు. ఇంకను శ్రీ జోగారాయకవి పర్యవేక్షణలో, బాటసారి, ఇంగ్లీషు తర్జుమాతో (ఇంగ్లీషుకూడ నారాయణోపజ్ఞమే), రామచంద్ర శతకము, కాశీ శతకము, సంస్కృతభాగము, దెలుగుసేత. శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు (పీఠిక అప్పల సోమేశ్వరశర్మగారు విశాఖపట్నం.) వారిసౌహార్దముతో భక్తిసుధ, సూక్తిసుధ పురుషార్థసాధనము సంకలనము, అనువాదము - శ్రీ కోగంటిసీతారామాచార్యులు - సంస్కృత కళాశాల గుంటూరు, శ్రీగుండవరపు లక్ష్మీనారాయణగారు, J. K. C. College గుంటూరు, సంగీత తరంగిణి - సంపాదకులు నూకల చిన సత్యనారాయణగారు B. A. ప్రిన్సిపాల్. సంగీతకళాశాల, సికింద్రాబాద్ (దశవిధరాగనవతి కుసుమ మంజరి, పంచముఖి వ్యాఖ్యానము సీమ పలుకుపహి - రెండవభాగము మొదలగు గ్రంధములు త్వరలో వెలువడ

---

* దీనినే ఇప్పుడు ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయము అనుచున్నారు.

-Online Publisher

నున్నవి. ఇంకను మాకు అందని వ్రాత ప్రతులు ఎన్నియో యున్నవి – తర్క సంగ్రహము, వ్యాకరణసంగ్రహము జ్యోతిశ్శాస్త్రము మొదలగునవి.

పై చెప్పబడిన ప్రచురణలు వెలుగులోనికి వచ్చిన శ్రీ నారాయణ దాస వర్యులు ఎంతటి అపూర్వసాహిత్య స్రష్టయో; ఎంతటి మహాకవియో లోకమునకు తేటతెల్లమగును, వారికి మహాకవిగా సముచిత స్థానమివ్వ బడునని నా విశ్వాసము. రెండు మాసముల క్రితము, నాకు బహుగ్రంథ కర్తలు, రాష్ట్రపతి బహుమతి గ్రహీతలునగువిద్వాన్, B. O. L. యం. వి. ఆర్. కృష్ణ శర్మగారి పరిచయము తలవని తలంపుగా గలి గినది. వారు వచ్చిన కోరిక ఈ దేరిన వెంటనే, నేను వారికి నాయొద్ద నున్న శ్రీ నారాయణదాస గ్రంథావళి మేము ముద్రించిన యిటీవలి గ్రంథ ములు, చీరాల సంస్కృతి సమితి వారు ప్రచురించిన శ్రీ నారాయణ దాస శతజయంత్యుత్సవ సంచిక వారికి జూపించితిని. వారు అక్కడక్కడ ఆ గ్రంథములను పర్యవేక్షించి, 'అయ్యా భావిభారత పౌరులగు, విద్యార్థులకు గూడ తెలియదగిన విశేషాంశములు - దాసకవీంద్రుల చరిత్రలో అణిము త్యములై యున్నవి - అవి హాస్యశృంగారాదులందు, పరిమితములై, విజ్ఞాన వికాసములకు గారణభూతములై యున్నవి. శ్రీదాస కవీంద్రుల సాహిత్యసేవ ప్రధానక్షేత్రముగా గైకొని, నేటి విద్యార్థులకు అర్థమవునట్లుగా సరళగ్రాంధిక భాషలో, రెండువందల పేజీలకు మించకుండా, S.S.L.C. Matriculation, Inter. విద్యార్థులకు ఉపవాచకముగా ఉపయోగపడు, చిన్న రచన చేయవలెనని, ఆశ పొడమినది. తమ ముద్రణార్థ సహాయమున్న వెంటనే గ్రంథరచన ప్రారంభించి ఆగష్టు 2 nd లోగా ముద్రణ పూర్తి చేసి, ఢిల్లీలో ఇట్టిమహాకవి చరిత్రల ప్రచురణల Competition జరుపుచున్న కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖకు పంపిన నాకు గూడ శ్రేయో దాయకమవును. మీరు అంగీకరింతురేని గ్రంథరచన ప్రారంభించి మీకు



కృతి నొసంగవలెననియున్నది- అని నుడివిరి. నాకు శ్రీనారాయణదాస సార స్వతా భిరుచి దిన దినము వృద్ధిపొందుచుండ, వారి అనేక గ్రంథములను చదువు భాగ్యము కలిగినందున, శ్రీదాస వర్యులు, ఎంతమహోన్నత వ్యక్తియో గ్రహించి, శ్రీనారాయణదాస కార్యము ఏదయినా, చేపట్టి దానికి తగినంత ఆర్థికసహాయముగూడ చేయ సుద్యుక్తుడనై యున్నందున, ఈ షణ్మాత్రము. గడువు లేకుండ, వల్లెయని, పని ప్రారంభింప చేయమంటిని, నేను కృతి పతిగా నుండవలెనన్న కోరిక, ఆశ నాలో ఏ కోశమున లేన ప్పటికి, కృష్ణ శర్మగారి ప్రోద్బలమున, దీనికి అంత ప్రాముఖ్యము నేను ఇవ్వక పోయినప్పటికి, వారి కోరికకు అడ్డురాక కృతిపతిగాగూడ అంగీక రించితిని. అదిగూడ సమంజసమే అని తోచినది.

నారాయణదాస మహాకవి చరిత్ర ఒకానొక దృక్పథముతో - వారి బాల్యదశ - విద్యాభ్యాసము, సాహిత్య సంగీత గ్రంథ రచనాదుల గూర్చి- వారి చమత్కారములను గూర్చి సంక్షిప్తముగా దెలుపబడినది. ఇది శ్రీవారి సాహిత్య సంగీత కృషుల సంపూర్ణముగా దెలుపక పోయినను, శ్రీవారి జీవిత మహౌన్నత్యమును రేఖామాత్రముగా నయినను నీడవలె చిత్రించి నా కంకితమిచ్చినందుకు శ్రీ కృష్ణశర్మగారికి కృతజ్ఞతాభివందనములు. వారిని పరమేశ్వరుడు ఆయురారోగ్యైశ్వర్యములనిచ్చి కాపాడుగాక - శ్రీ నారాయణదాస మహాకవి దీవనలకు సతతము పాత్రులగుదురుగాక అని అభిలషించుచున్నాను.

ఎన్ని పని తొందరలున్నప్పటికి, విద్యుదవరోధము సైతము లక్ష్యము సేయక సకాలములో, సర్వాంగ సుందరముగా ఈ చిన్ని పుస్త కమును ప్రూఫులుసైతము చదివి ముద్రించి, విడుదల చేసినందుకు వెల్కం ప్రెస్ మేనేజరు పి. రామకృష్ణమూర్తి మహోదయులను మనసార అభి నందించుచున్నాను.

పై గ్రంథరచనను సకాలములో వెలయించు తొందరలో, ప్రూఫులు దిద్దుటలో అనేక ముద్రణదోషములు మాకు కనుమరుగయినవి. అట్టి దోషములు, దైవానుకూలమున్న రెండవ ముద్రణలో సవరించుకొందుమని విన్నవించుకొను చున్నాము.

గుంటూరు
2—8—75

కర్రా ఈశ్వరరావు

# విజ్ఞప్తి

శ్రీ ఆదిభట్లనారాయణదాసకవి పుంభావ సరస్వతి సంస్కృతాంధ్రాది బహుభాషల నాపోసనముగా గ్రహించి పుక్కిట నుంచుకొనిన అగస్త్యమహర్షి. నిజగానామృతమును నాంధ్రదేశముననే కాక యన్య రాష్ట్రములను గూడఁ బవిత్రవంత మొనరించిన హరికథాపితామహుఁడు. చిరస్మరణీయ ములైన మహత్తర గ్రంథములను రచించిన విద్వత్కవి. ప్రజాహృదయము లందు భక్తిభావ బీజములను నాటిన మహాభాగవతశిరోమణి. వారి. జీవితమునందేమి వారి గ్రంథములందేమి వివిధధర్మానుభవములు ఆదర్శవంతములైన నీతులెన్నో యున్నవి. వాని నాబాలగోపాల మాచరింపఁ దగియున్నవి. ముఖ్యముగా భావిభారతపౌరులైన విద్యార్థులు వాని నభ్యసించినచో భావిజీవితపరమార్థ మెఱుఁగుటకు నవకాశ మెంతైనఁ గలదు,

శ్రీవారిజీవితచరిత్రమును వ్రాయుటకు నేతద్గ్రంథ ప్రాశస్త్యము వివరించుటకు సులభమైనపనికాదు. నేను ప్రాచీన కవులచరిత్రను 20 భాగములుగా (విజయవాడ - బాలాజీపబ్లికేషన్స్) వారు ప్రచురించిన పిదప నాధునికమహాకవులను గూర్చి వ్రాయ నుద్యమించు సందర్భమున శ్రీవారిగ్రంథములను బ్రచురించుచున్న సహృదయసమ్రాట్టు: మాన్యశ్రీ : శ్రీకర్రా ఈశ్వరరావుగారి పరిచయభాగ్యము లభించుటవలన నీకృతిని వ్రాయ నవకాశము సమకూరినది.

అయితే - శ్రీవారి సంపూర్ణమైన చరిత్రకాదని నా యభిప్రాయము. ఇది వారి చరిత్ర మహావృక్షమునకు- ఛాయామాత్ర మనియే - విన్నవించుచున్నాను. మొత్తము మీఁద నా స్వల్ప కృషిని రసజ్ఞులు మన్నించియాదరింతురని నావిశ్వాసం. ఈకృషికి దోహద మొసఁగిన కృతిపతి శ్రీ కత్తా ఈశ్వరరావు గారికి నా భక్తి పూర్వక ప్రణామములు. ప్రథమమునుండి నా సాహిత్య కృషికి నాశీర్వాదసహకారముల నందించు రసజ్ఞులు మాజీ భారత దేశాధ్యక్షులు శ్రీ వి. వి. గిరిగారికి ప్రాచీనగ్రంథమండలిమహారాజ పోషకులు: అమృతమూర్తులు శ్రీ వై. వి. సుబ్బారావు (ల్యాండ్‌లార్డు యలవఱ్ఱు) ప్రఖ్యాతనటీమణి : మహారచయిత్రి శ్రీ పి భానుమతిరామకృష్ణగారికి - చందమామప్రసాద్ ప్రొసెస్ అధినేత శ్రీ బి. వేణుగోపాలరెడ్డిగారికి - పద్మశ్రీ పిక్చర్సు అధినేత శ్రీ పి. పుల్లయ్యగారికి శ్రీ మాన్య శ్రీ యం. మల్లికార్జునరావు (ఇ.ఓ.)గారికి రవీట్యుటోరియల్‌కాలేజి అధిపతులు: శ్రీ సి. వి. యన్. ధన్. M. A. గారికి : శ్రీ సి, లక్ష్మీనరసింహమూర్తి గారికి - అడిగినంతట దమయమూల్యాభిప్రాయము నొసఁగిన విద్యావేత్తలు : శ్రీ యస్. వి. జోగారావు. M. A. గారికి ఆంధ్రశాఖాధ్యక్షులు : (P. G. సెంటరు) భాషాప్రవీణ శ్రీ పి. సూర్యనారాయణశర్మగార్కి- యం. ఎ. హిందీ ప్రధానాధ్యాపకులు- ఎ. సి. కాలేజి గుంటూరు. నా హృదయ పూర్వక ప్రణామములు.

ఎన్నిపనులున్న - ఎంతముద్రణాకార్యభారము భుజస్కంధముపై నున్నఁ గాదనక - భారమనక - పేర్మి - ఓర్మివహించి



సర్వాంగ సుందరముగా - ముద్రించి - యొసఁగిన అమృతమూర్తులు : శ్రీ పి, రామకృష్ణమూర్తి (మేనేజింగు డైరెక్టరు.) వెల్‌కం(ప్రెస్సు)గారికి : నా భక్తిపూర్వక వందనములు.

ప్రమాదవశమునఁ మాకు గనుమరుగైన-దోషములను - రసజ్ఞులు - సహృదయములైన పండితులు మన్నింతురని యర్థింతును, వానినిఁ బునర్ముద్రణమందు (నాకా భాగ్యము కలిగినచో) సవరించుకొందునని విన్నవించుకొందును

రచనావిషయములలో - ప్రాచీనగ్రంథమండలి సంపాదకవర్గ సహాయమునకుఁ గృతజ్ఞతాంజలులు. ఈ కృతి అవిర్భావమునకు మూలకర్తలయిన శ్రీ కత్తా ఈశ్వరరావుగారికి - మఱొకసారి భక్తిపూర్వక ప్రణామములు.

ప్రాచీనగ్రంథమండలి
(మదరాసు)
గుంటూరు, 12-8-75

ఇట్లు
విధేయుఁడు
యం. వి. ఆర్. కృష్ణశర్మ

# అంకితము

కృతిపతి : సహృదయ సమ్రాట్టు

మాన్యశ్రీ శ్రీ కఱ్ఱా ఈశ్వరరావుగారు

శైలకుమారితో రజితశైలము పైసురమౌని జాలమున్
జాలఁగ స్తోత్రజాలమును సల్పఁగఁ బుత్రులనల్పలీలలన్
వాలి నొనర్ప లోకములఁ బాలనఁ జేసెడి నీశ్వరుఁడు నే
కాలము బ్రోచు నిమ్ముగ సుఖమ్మిడి నీశ్వర రాయసూరివిన్.

బంగారమునఁ గాంతి - పరిఢవిల్లినరీతి
సద్గుణ ఘనమతి చాలఁబోలఁ
గస్తూరిఁ జాలను - గంధ మొనరులీలఁ
గవిజాల నుతజాల ఘనము గ్రాల
మల్లెప్రసూనను - మహితవాసనభాతి
నమృతోపమానమౌ - యాత్మవరల
వారిదాంతర్భూత - చారువిద్యుద్రీతి
సుకృతసుకృతిమతి - శోభఁభాతిదరల

రహిని రాజిల్లె 'ఈశ్వరరాయ' బుధుఁడు
కలితగుణపేటి శ్రితకోటి కల్పవాటి
పార్వతీకృపఁ బెనుఁబొందు పత్ని గాఁగ
భూరి సంతతి దయఁజెందు సుతులు గాఁగ

మోదసమేతచిత్తునకు భూధరనాథ సుతేశురాగసం
పాదికిఁ బాపభేదికి నపారకృపాపరతంత్ర వేదికిన్
సాధుమనోవినోదికి విశాలమనస్కున కార్యభావస
మ్మోదితమూర్తికిం బరమపుణ్యున 'కీశ్వరరాయ' సూరికిన్.

శ్రీ కఱ్ఱాన్వయజలనిధి
సోమునకు సదా సహృదయ శోభితునకు ను
ద్దామఖ్యాతి వరునకున్
శ్రీమాన్యశ్రీకి సుకవి సేవితమతికిన్.

పరమార్థ తత్త్వపరునకు
గరుణా హృదయారవింద ఘనతేజునకున్
వరబుధనుత చిత్తునకున్
విరతానంద సువిశాల వితాత్మునకున్

మానిత గుణఘని శ్యామల
మానసకమలారుణునకు మహితాదరసం
తానసమేతునకు గుణ
స్థానునకు బుధాభిమాన సంస్థానునకున్

కవిబుధజనగణసారస
రవికిఁ గుజనగిరిపవికి విరాజితమతికిన్

భువిదీనకుముద శశికిన్
నవిరళధర్మజ్ఞునకు నయసహితునకున్ !

నిరతోపకారమతికిన్
భరితామృతచిత్తునకు శుభభరునకు సవి
స్తర విజ్ఞానభరునకు ఈ
శ్వరరాయునకున్ వినీతసజ్జనమణికిన్

చందరుకు నూలు పోగిడు
చందము నాసుగుణఖనికి సత్యధనికి నా
నందము గడించి డెందము
నందంగ నీ కృతి సుకృతిని సంకిత మిత్తున్

# విషయ సూచిక

ఓం

శ్రీరస్తు అవిఘ్నమస్తు

# శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాస మహాకవి

## చరిత్రము

శ్రీయుతుఁ డాదిభట్టకుల సింధుశశాంకుఁడు భవ్యదివ్య వా
ణీయుఁ డగణ్యధీజలధి నిత్యపురాతన ధర్మవర్తనుం
డాయత సర్వశాస్త్రనిధి యద్భుతహాస్యరసాబ్ధియైన నా
రాయణదాస పండితమహాకవి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్.

తీయనిగానగాథ, తిరుతీయనికైత తెలుంగు మాతకున్
మాయనికీర్తి నిచ్చుజనమాన్యత విద్యలమూర్తియౌచు, సం
స్థాయ యశస్సునుంగొనుచు సూరినమస్సుల గొంచుమించు నా
రాయణదాస పండితమహాకవి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్.

శ్రీ నయతత్త్వచిత్తుఁడు వశీకృతధర్మపథాంచితుండు, స
న్మానిత గీర్తిసంయుతుఁడు మాన్యుఁడు పూజ్యసతీవతంస సం
ధాన పవిత్రవర్తనయుతాత్ముఁడు 'ఈశ్వరరాయ' కీర్తి సం
తాన సమేతుఁడున్నతముదమ్ము మాకు ననుగ్రహించుతన్,

శ్రీ కజ్జాన్వయజలధి సు
ధాకర సత్కవి సుజన హృదంబుజ సూరా
ప్రాకట ధర్మవిచారా
శ్రీకర ఈశ్వర వరకృతి చిత్తవిహారా.

"సుకవితా యద్యస్తి రాజ్యేనికి" మ్మను నదార్యోక్తి. అట్టి కవిత్వము పురాకృతకర్మఫలము. అది సర్వులకు సముపలభ్యము గాదు. అందుభయభాషల నాకవిత యుదయించుట మఱియు నరుదు. అందులోఁ బరిపాకమునందినకవిత బహుదుర్లభము, అట్టి కవితాశక్తి సముపేతులే మహాకవి పదవాచ్యులగుదురు. "వాల్మీకి కాళిదాస ప్రభృతయో ద్వైతాఃపంచభాషా కవయః" అనునానంద వర్ధనా చార్యోక్తి పరిణీతకవితా పరిణీతులకుఁ జెందుననుట నిస్సందేహము. అ స్థానమునలంకరింపఁ దగిన మహాకవి శ్రీ నారాయణదాసుగారు.

శ్రీకాకుళ జిల్లాలో అజ్జాడ అను నగ్రహారముకలదు. అది పవిత్ర సువర్ణముఖి యను నదీతీరమునఁగల యగ్రహారములలో ముఖ్యమైనది. ఆపురమత్యంత సౌందర్యవంతమై, ప్రకృతిశోభతో నలరారుచుండును. అందు సకలశాస్త్ర వేత్తలయిన పండితశిఖామణులు విరాజిల్లుచుందురు. ఆ ప్రోలున ఆదిభట్ల వేంకటచయని శాస్త్రి యనుమహాపండితుఁడు గలఁడు. అమ్మహనీయుఁ డాజాను భుజుఁడు, భాస్కరారాధకుఁడై పౌరాణికావతంసుఁడు, మహాకవియై యుండెను. ఇప్పండిత శ్రేష్ఠునికడ, రామాయణ భారతాది మహాకావ్యములు స్వయముగాఁ దాటాకు పుస్తకములలో గంటముతో లిఖించికొని భద్రపరచుకొన్నవి, పెద్దభోషాణము నిండ నుండెడివి. ఇక్కవిచంద్రుఁడు* ధనంజయవిజయ మను ప్రబంధ

* ఇప్పు డదియు లభ్యము కాకున్నది.



మును రచించెను. బొడ్డమడియ యను తనపొలములో నీతఁడు నూయిఁ ద్రవ్వించుచు నీరు పడకునికి గంగాభవానిని శ్లోకరూపమునఁ బ్రార్థించి జలమును దెప్పించిన మహాభక్తాగ్రగణ్యుఁడు. గొప్ప పౌరాణికుఁ డగుటచే దనగృహమునఁ జెప్పుచుఁ గేవలాముష్మిక సుఖములఁ గోరుచుండు స్థితప్రజ్ఞుఁడు.

ఈ మహాపండితునకు బహుభాషలఁ బ్రభులమెప్పించిన మరువాడ వెంకన్నగారి మనుమరాలు, ఆదిదంపతులని కీర్తిఁగన్న జగ్గయ్య సీతమ్మలకుఁ జతుర్థపుత్రికయు నగు నరసమాంబపత్నిగాఁగ, బంగారమునకు సుగంధము నబ్బినట్లతఁడు భూరియశోవిరాజితుఁడయ్యెను. సుమసౌరభము దారమునకు లభించు నట్లామహాపండితవర్యుని సహచర్యమునఁ బురాణశ్రవణమున సకలపురాణములా మహాసాధ్వికిఁ గరతలామలకములయ్యెను.

ఈ పుణ్యదంపతులకు నైదుగురు కుమాళ్ళు నల్గురు కుమార్తెలు జన్మించిరి. అందులోఁ బెద్దకుమారుఁడు జగ్గావధాని. ఈతఁడమేయబలసంపన్నుఁడు. మహాపండితుఁడు మహోదాత బహుభాషాకోవిదుఁడు, చతురుఁడు, రసజ్ఞుఁడు, నగు విజయనగర సంస్థాధీశుఁడైన ఆనందగజపతి మహారాజు కొల్వునందుండెడివాఁడు. రెండవకుమారుఁడు సీతారామయ్య. ఇతఁడు స్వాధ్యాయపరుఁడు, ఇహపరతంత్ర వేత్తయయి యుండెను

ఈ యనఘుండు విజయనగరమునఁ దెలుఁగు న్యాయవాదిగాఁ బ్రసిద్ధినందెను. మూఁడవ కుమారుఁడు, అగ్నిహోత్ర

శాస్త్రి. కావ్యనాటకాలంకారములవఱకు నభ్యసించినవాఁడు. నాలుగవ పుత్రుఁడు పేరన్న. బాల్యమాదిగా సంగీతాభ్యసనపరుఁడు.

తరువాత మహాసాధ్వి నరసమాంబగారు రక్తాక్షినామ సంవత్సర శ్రావణమాస కృష్ణపక్ష చతుర్దశీబుధ వారమునఁ బాల సంద్రము చంద్రునిఁ గనినట్లు, అదితిమహేంద్రునిఁ (31–8–1864 వ సంవత్సరము) ప్రసవించినట్లు, రాత్రి పదిఘడియలకు, మఘానక్షత్ర చతుర్ధచరణమందుఁ నైదవకొమారునిఁ బ్రసవించెను. ఆ బాలకుఁడే దివినుండి భువికేతెంచినవాణీ యపరావతారము. సంగీత సాహిత్య కవితానృత్యవాద్యములలో నిరుపమాన ప్రజ్ఞా ధురీణుఁడు. ఆ పసిడివిగ్గులదేరు పసిమీరు పసికందే శ్రీ నారాయణదాసు. ఆ తూనయే యాంధ్ర చరిత్రాకాశమున ధ్రువనక్షత్రము.

శ్రీ నారాయణదాసు దినదినాభివృద్ధిఁజెందుచు శుక్లపక్ష చంద్రునివలె సర్వప్రజానురంజకుఁ డగుచుండెను. ఇతఁడు రెండు సంవత్సరములవయస్సునఁ బొరుగున జరుగుచున్న సీమంతోత్సవమున స్త్రీలు ఆడపిల్లలు, గాజులు దొడగించుకొనుటచూచి తన రెండుచేతులు చాచెను. అంత నాయింటియిల్లా లాపసివాని రెండు చేతులకు రెండేసిగాజులు చొప్పునఁ దొడగించెను. అదిచూచి తల్లి నరసమ్మ "యేమండీ! వీనికి గాజులెందులకు వేయించినారు? సభాధ్యక్షుఁడగు" ననియనెను. అందుల కాయిల్లాలు "అల్లైన్నటికి జరగదు. సభాపూజ్యుఁడగును. సింహతలాటముల నలంకరింపఁ జేసి



కొనఁగలఁడు. ఇది నీకు మున్ముందుఁ బ్రత్యక్షమగు" నని పలికెను.

చిన్నతనమునుండి దాసుగారు మిక్కిలిపెంకితనము చేయుచుండెడివాఁడు. అతఁడు వీధిలోనికేఁగి తనతోడిపిల్లలను కొట్టి తగాదాలను దెచ్చుచుండెడివాఁడు.

నరసమాంబ బాలదాసిట్లుండుటచూచి వేంకట చైనులుగారినిఁ గాంచి "మనచిఱుతవాని కైదేండ్లు నిండినవి. వీనికక్షరాభ్యాసముచేసి. పాఠశాలలో వేసినగాని వీనిపెంకితనమణఁగ" దన నందులకా పండితగ్రామణి, యైదు సంవత్సరముల నయిదునెలల యయిదవరోజున కక్షరాభ్యాసము చేయఁగలనని పలికెను

వేంకటచైనులుగారు నిత్యము తనగృహముననే పురాణము చదువుచు నర్థము చెప్పుచుండెడివారు. అన్యస్థలములకుఁ బోయి, పురాణము చెప్పుట యాయన మతమునకు విరుద్ధము, ఆ సూరి బాలదాసుని వీధిలోనికిఁ బోనీక రెండుచేతులకుఁ గట్టు కట్టి తన వ్యాసపీఠమునకుఁగట్టి పురాణము చదువుచుండెడివాఁడు. అందుచే దాసుయల్లరేమియుఁ జేయక తన తండ్రి చదువుచున్న పుస్తకమునే చూచుచుండెడివాఁడు: తన చదువునకు నాటంకముగానున్న బాలుని శిరమును వెనుకకుఁ దండ్రి త్రోసివేసినను, నాచిఱుతఁడు తనయుద్యమమును మానకుండెను, చైనులుగారెట్లో తనశిరమునే త్రిప్పికొని పురాణమును చదువుచుండెడివాఁడు. ఏలయన వీధిలోనికిఁజని జట్టీలు తెచ్చుటకన్న

నీ విధానమే బాగని యాయనకుఁ దోఁచినది. ఈ విధముగా మూడుమాసములు గడఁచునప్పటికి చైనులుగారి కనుకున్న గడువునకు బాలదాసు స్వతంత్రముగాఁ బురాణము చదువ నారంభించెను. అదిచూచి చైనులుగారు తనకుమారుఁడు కారణజన్ముఁడని తలఁచి, యీసంగతి నెవ్వరికిఁ దెలియనీక నామకార్థ మక్షరాభ్యాసము చేయించెను.

శరత్కాలమునందు హంసలు తామంతట దాము సరస్సునకుఁ జేరునట్లు అక్షరాభ్యాసమైన కొద్దికాలమునకే బాలదాసుకు నరసమాంబ కరిపిన భాగవతపురాణము దైవభక్తి తోడుగా భాషానురక్తి పెంపొందెను. పువ్వుఁబుట్టఁగనే వాసన గుభాళించునట్లు లీతనికి బాల్యమునందే యనేక పద్యములు కంఠస్థముచేసి, శ్రావ్యముగా, దివ్యముగాఁ జదువుటయు, నెవరే పాటఁబాడినను, వారి ననుకరించి పాడుటయు ననునవి బంగారమునకు గాంతివలె సహజ గుణములై ప్రకాశించినవి.

ఒకప్పుడు శివరాత్రి జాతరకు గుంప యను దివ్యతీర్థమునకు నీ బాలదాసు మాతృమూర్తితోఁ గలసిపోయి, మఱలఁ దిరిగి పార్వతీపురము మీదుగాఁ దమ గ్రామమునకు దిరిగివచ్చుచుండెను. అప్పు డప్పూరమున నొకపుస్తక విక్రయశాల గనఁబడెను. వెంటనే యాచిన్నసూరి బండిదిగి యాయంగడి యొద్దకుఁబోయి "భాగవతమున్నదా" యని యడిగెను అందుల కాపుస్తకవిక్రయ శాలాధిపతి సాతాని రంగయ్య యనునతఁడు బాలదాసును గాంచి



యాశ్చర్యపడి" భాగవతము నీ కెందుకు? అది నీకుఁబనికిరాదు బొమ్మ"నెను. అమ్మాటలను నరసమాంబగారువిని, వెంటనే బండి దిగి, యా యంగడికడకుఁబోయి "అన్నా! భాగవతమున్న వెల కిమ్ము. వాఁడు చదువఁగలఁ" డన, నందులకాతఁడు "అమ్మా! యీ బాలుఁడు భాగవతము చదువఁగలఁడా? నిజముగా దీనిఁ జదివినచో నేను దానిని కూనకు వెలకొసంగెదనా!" యని భాగవతమును దీసి, మూఁడునాల్గు చోట్ల చదివించి, యర్థము సుబోధకమగునట్లు రాగవరుసతో నతివేగముగాఁ జదువుచున్న బాలునిఁ గాంచి యాశ్చర్యపడి యానందించి యతనిని దగ్గరఁదీసికొని భాగవతమును వరహాను బహుమతిగా నొసంగెను. అదియే ప్రథమున నార్జించిన వస్తువని కవీంద్రులు పలికిరి. ఆమహాగ్రంథమే దాసుగారు సమస్త విద్యలలో మహామనీషిగా నగుటకు నాంది యయినది.

ఒకప్పు డజ్జాడకు యతీశ్వరుండొక దరుదెంచెను, అమ్మహనీయుని దర్శనార్థమె పండితు లనేకులరిగి, పరిణమిల్లి సత్కరింపఁబడుచుండిరి. కౌపీనధారియగు బాలదాసుకూడ నాకర్మందికడకుఁజని "స్వామీ వందన" మనిపలికి రెండు పువ్వులను సమర్పించి నిలువఁబడియుండెను. ఆస్వామి యాచిఱుతవానిఁగాంచి, చిఱునగువుతో రెండరఁటిపండ్లను చేతికిచ్చిపంపెను. అంత నతఁడవ్వానిఁగొని, యీవలకువచ్చి వానిఁదిని, మఱల నాస్వామికడకు నడఁచి, "స్వామీ నమస్కార" మని నుడివి నిలువఁబడెను. మఱల నా స్వామి బాలస్వామికి ఫలద్వయ మిడఁ దిరిగిపోయి

వానినిఁ దిని మఱల నా స్వామి కడకుఁజనవాయతీశ్వరుఁడు దిరిగి ఫలముల నొసంగబోవ నందులకు బాలదాసుస్వామీ ! ఋఁకజాలు. నా కడుపు నిండినది, ఇంక పండ్లు వల'దని పలికెను. అందుల కాయతీంద్రుఁడు "ఎందుల కిందులకుఁ జనుదెంచితి" వని యడిగెను. అప్పు డాబాలస్వామి వినమ్రుఁడై "స్వామీ! నాకొక శాటీని దయచేసియనుగ్రహింప, దానినిఁ గప్పికొందు''నని విన్న వించెను. అందులకాస్వామి డెందమున నానందించి" నీ వందులకు దగినవాఁడవు. నీవు భావికాలమున మహాపండితుఁడు వగుట సందేహములే దని యొకశాటిఁ దీసి, యాబాలుని కలంకరించెను. ఆహా! మహాత్ముల వచనములు వ్యర్థములు కావుకదా,

ఒకనాఁడు వేంకటచయనులుగారు, యేటి యందుఁగల బాడవభూమిని దున్నించి, వంగనారు పాతించుచుండెను. అప్పు డక్కడకుఁ జేరిన బాలదా సదిచూచి" అయ్యా! యిక్కడ నారు వేయించుచున్నారు, దైవనిర్ణయ మన్యథాయండి, యేరువచ్చి, నారుకొట్టుకొని పోయిన నేమగు!'' నని పలికెను. అందులకు చైనులుగారు తోఁకత్రొక్కిన త్రాఁచువలె మండిపడి, "ఓరీ యప్రాచ్యుఁడా! యపశకునములఁ బలికెదవా!" యని బాలసూరిని జుట్టుఁబట్టికొని, నడ్డిమీఁద నాలుగుగుద్దులుగుద్ది యేటిలోనికిఁ ద్రోసివైచెను, అప్పు డాబాలదా సందుండి, యెట్లోలేచి, యొడలు కడిగికొని, బిట్టుగా నేడ్చుచు నింటికిఁజని జరిగిన దంతయు మాతృమూర్తి నరసమాంబతోఁ బలికెను. అంత నామె స్వాంత మున నెంతయో నొచ్చుకొని, బాలదాసును లాలించి యనుగ్ర



హించెను. మఱునాటి యుదయముననే పాలికాపు లరుదెంచి, చైనులగారినిఁగాంచి "అయ్యా! మనమేసిననారు, యేరువచ్చి కొట్టుకొని పోయిన" దని పలికిరి. అందులకాపండితశిఖామణి డెందమునఁ గుంది కుమారునిఁగాంచి "నాయనా! నీవన్నట్లే జరిగి నది ఇఁక నెన్నడీవన్నట్లనకు" మని పలికి యతనినిఁ బ్రేమతోఁ జూచెను. బాలవాక్కు బ్రహ్మవాక్కుకదా !

ఒకప్పుడు బాలసూరి తనపెద్దక్కగారి గ్రామము పిడిశీలకుఁబోయి, యచ్చట వేసవిలో నెండప్రొద్దున మోకాలుబంటి పారునేట బట్టల నుతుకురాయి తలాడఁగాఁ జేసికొని, వెచ్చనినీరు శరీరము మీఁదఁ బ్రవహించునట్లు శయించి నిదురించుచుండెను. అంతట మధ్యాహ్నికము నొనర్చుటకై యచట కేఁగిన జయంతి అప్పావధాను లను నతఁడటకు వచ్చి చూచి, నిదురించు బాల దాసును లేపి "అబ్బాయీ! బాగుగా నిదురింపుచున్నావు. ఏరుకుఁ గ్రొత్తనీరు వచ్చుచున్నది. ఇఁకలెమ్ము" మనిపలికి యతనిని నిదురఁబాపి యింటికిఁ బంపెను, మహాకవుల బాల్యదశాస్థిత ప్రజ్ఞ లిట్లే యుండునుగదా !

మఱొకప్పు డీబాలసూరి తనమాతామహు నింటఁ దనమే నత్త కంచమునిండఁ జలిదన్నముపెట్టఁగాఁ గావలసినంత తిని, శేషించిన దానినిఁ జిన్నచిన్నముద్దలుగఁజేసి కాకుల కెగురవేసి, వాని నవిక్రిందికిఁ బడకుండఁ బట్టికొనుట చూచి యానందింపు చుండెను. ఇంతలో నామెవచ్చి కోపగించి నందున లేచి యేటి

యావలిజొన్నచేల నడుమ నెవ్వరి కగపడకుండ దిరుగుచుఁ బలువన్నెల పక్షులఁ బరికింపుచు, వాని వింతవింత పల్కులను వినుచు, సాయంకాలమువఱకు విహరించెను. స్వేచ్ఛాజీవుల జీవిత మాదినుండి యిట్లే ప్రారంభమగు ననుట దాసుగారి జీవితమే యాదర్శము. ఈ విధముగా బాలసూరికి దశవర్షములు గడచెను. ఇట్లుండ నొకనాఁ డాతఁడు తనమాతామహు సూరికిఁ దల్లితోఁ బోయియుండెను. అచ్చట నొకనాఁడు బొబ్బిలి సంస్థాన సంగీత విద్వాంసుఁడగు వాసా కామయ్యగారు, బొబ్బిలినుండి పాలకొండకు జనుచు, మధ్యాహ్నమునకు వంతరామువచ్చి దిగెను. భోజనానంతర మాతఁడు విశ్రమించియుండెను. బాలసూరి యాంధ్రమహాభారతము చదువుచు, నతని మేనబావ అయ్యల సోమయాజుల పెంటన్న యర్థము చెప్పఁగాఁ బురాణకాలక్షేప మొనర్చుచుండెను. సూరి యనేకరాగములతో భారతపద్యములఁ జదువఁగా, విని యా సంగీత విద్వాంసుఁ డాశ్చర్యచకితుఁడై, నరసమాంబగారినిఁ గాంచి "అక్కా! కుమారునికి సంగీతము చెప్పింపుము. ఈతఁడు భావికాలమున సంగీతసాహిత్యములయందు మహాప్రజ్ఞావంతుఁ డగుట నిశ్చయ"మని చెప్పి యొప్పించి, తనతోఁగూడ బాలసూరిని వెంటఁగొని పోయెను. ఆమఱునాఁడు కామయ్యగారు పాలకొండలో నొక సంపన్నుని గృహమునందు వీణవాయించెను. బాలసూరి యమ్మహనీయుని వీణావాద్యవైదుష్యమున కబ్బురపడి యత్యానందభరితుఁడయ్యెను. పిమ్మట నా సంగీత విద్వాంసుఁ డీ చిఱుతవానిని బొబ్బిలికిఁ దీసికొనిపోయి కొందఱుగృహస్థుల ఇండ్ల



యందు వారము లేర్పరిచి, తానొక వారమిచ్చి మంచిముహూర్తమున 'సపల'లను నుపదేశించెను.

ఇట్లుండ బాలదాసున కొకనాఁడు వారము కుదరనందున మిక్కిలి యాకలిచే బాధనొంది, పండ్రెండుగంటలవేళ నొక గృహస్థునింటికిఁ జని తద్గృహిణీమణినిఁ గాంచి "అమ్మా! నేఁ డెక్కడ వారభోజనము వీలుపడలేదు. ఈపూట మీయింట కవళము గలిగింపఁగోరెద" ననిపలికెను. అందుల కాయమ "ఇప్పుడాలస్యముగా నిచ్చటికి వచ్చితివి. మా ఉభయులకు సరిపడు భోజనమే కలదు. కావున నింకేందేనిఁజని, ప్రయత్నింపు" మని చెప్పి, తన పతికొఱకు నన్నమును వడ్డించెను. ఆమె భర్త దేవతార్చనముగించి, తులసికోటలో జలము వోయుటకుఁ బెరఁటిలోనికిఁ బోవుట చూచి, మిక్కుటపుటాకలితోఁ బొక్కుచున్న బాలదాసు గ్రక్కునఁబోయి, ఎక్కున నాయన్నమును మెక్కసాఁగెను. అది చూచి యామె మొఱఁబెట్ట నా గృహస్థు వచ్చి చూచి "యేందుల కట్లు మొఱఁబెట్టెదవు! నాయారాధ్య దైవతమగు సూర్యనారాయణభగవానులే యీరూపునఁ జనుదెంచి యన్నమును స్వీకరింపుచున్నాఁడు. ఆలసింపక వానికినేయివడ్డింపు" మని పలికెను. ఆమె యటు గావింపఁగనే యాయజమాని యాబాలుని యాకలితీండిఁ జూచి, హృదయముఁ ద్రవింపఁ గన్నీరొలుక నా బాలకవినిఁ గాంచి "నాయనా! నీ వెవ్వరి బాలుండ' వని యడిగెను. అందులకా బాలదాసకవి "అయ్యా! నేను అజ్జాడయందలి ఆదిభట్ల వేంకట

చైనులుగారి యైదవ కుమారుఁడను. ఇఁట వారములఁ జేసికొని సంగీత సాహిత్యముల శ్రీకామయ్యగారి సన్నిధిని నభ్యసింపుచుంటిని ! నేఁ డెక్కడ వారములభ్యముకాకుండుటచే బుబుక్షాబాధభరింపఁజాలక యిట్లు సాహసించితి" నని వచించెను. అందుల కాయజమాని" నాయనా ! ఇందులకుఁ జింతనొందకుము. నీ కీ వారమును మాయింటికడ నొసఁగెదను. అంతేకాదు నీకెప్పుడు భోజనమున కాటంకము గలుగునో, యప్పుడు తప్పక దప్పున మాయింటికి రమ్ము" మని చెప్పి యొక అణాకూడ సంభావన మిచ్చెను, ఆహా! యా యజమానియెంతటి సంస్కృతిపరుఁడు ! బాలదాసకవి వారింటఁ గొంతసేపు విశ్రమించి, వారి శలవుఁ గైకొనిపోవుచు, నోటికి వచ్చినది పాడుకొనుచుఁ గోట ముందుగా నరుగుచుండెను. అతని వెనుకనడుచుచున్న యిద్దరు బ్రాహ్మణులలో నొకఁడు రెండవవానిఁగాంచి "చూడు నాబాలుఁడెంత విందుగాఁ బసందుగాఁ బాడుచున్నాఁ"డని పలికి కొంత దూర మరిగి, పాట జాలించిన వెంటనే యతనికరమును బట్టికొని "నాయనా నీ వెవ్వరివాఁడవు ! నీ వే రాగమునఁ బాడుచుంటివి! ఇంతవర కిట్టిబాణిని నే నెక్కడ నాలింపలేదని పలికి యతనిని వినుతింప సాఁగెను, అప్పుడు బాలసూరి వారికి నిజోదంతమాద్యంత మెఱిఁగించి "అయ్యా ! నేను నోటికివచ్చినట్లు పాడుచున్నానే కాని, యది యే రాగమో నాకుఁ దెలియదు నన్నందులకు సుతించితివేలాని నాకొకవార భోజనమొసగఁ గలరాయని యడిగను. అట్లడగినయతడు తుమురాడ వేంకయ్యగారను నొక



బ్రాహ్మణుఁడుసంగీతజ్ఞుఁడు ఆమాటలనువిని "నాయనా! నీవుపాడినది శుభపంథనరాళి, ఎంతో చక్కగ గాన మొనర్చినావు, నీవు భావికాలమున మహాకవిగా గాయకశిఖామణిగా, రాజిల్లగలవు. ఇంక వారమునకేమికొఱతి! నీయిష్టము వచ్చినప్పుడెల్లా మాగృహమున కరుదెంచి. భోజనము గావింపుచుండు" మనిపలికెను, బొబ్బిలిలో నొకనెల మాత్రముండి యానీరువడక. యొడలంతయుఁ జీడపట్టి నందున గురువుగారి తోనైనఁ జెప్పక, తన యూరుచేరితల్లినిఁజూచి "అమ్మా ! నాకాసంగీత మక్కరలేదు. నాకానీరుపడలేదు నే నింక నచ్చోటికిఁ బోవనమ్మా" యని పలికెను. మాతృమూర్తి యందులకుఁ బుత్రుని సౌఖ్యమే మిన్నఁగా భావించి మిన్నకుండెను. మఱొక్కసారి మక్కువగ్రామవాసి భాగవతకలాపాధ్యాపకుఁ డగు బలరామభక్త యనునొక బ్రాహ్మణుని కడకు నీ బాలదాసకవిని నొకరుఁ దీసికొనిపోయి, యొక పద్యమును రాగయుక్తముగఁ జదివించెను. అంత నాతఁడు బాలసూరి పద్యపఠనమునకు సంగీతఫణితికిమెచ్చి "నాయనా! నీ పద్యపఠనమునకు నచ్చితిని. నీవిచ్చటకు వచ్చుట నాకెంతో యానందమైనది, మేము ప్రదర్శింపఁబోవు నాటకమున నేదేని నొక పాత్ర ధరించుటకు నీకుఁ రూపగాత్రాదులు మిన్నఁగా నున్నవి! నీ కభిమత మున్నచోఁ బాల్గొనఁదగు"నను నమ్మాటవిని బాలసూరి "మీరన్నది బాగున్నది. కాని యే పనియన్న మిన్నఁగాఁ జేయుదును గాని, యాడవేషము ధరించుట మాత్రము సున్న" యని నిర్ణయముగాఁ బలికి యటనుండి తిన్నఁగాఁబోయెను. ఆహా! బాల

సూరి మనోనిశ్చయ మెంత దృఢమైనది!

ఒకసారి బాలసూరి మశూచికిఁజిక్కి తల్లియెంత చెప్పినను వినక, యూరఁదిరుగుచుండ, నొకజంగమవైద్యుఁడు బాలసూరినిఁబట్టి రెండుబొక్కులఁ జిక్కి రసము దీసికొనెను. ఆ విషయము దెలిసిన నరసమాంబగారు నేయిఁబోసిన యగ్నివలె నావైద్యునిపయి మండిపడి, యతనినిఁ బిలిపించి, "యేమయ్యా! నీ వొనరించిన పనివలన మావాని కేదేనిఁ బ్రమాదము సంఘటిల్లినచో, నీ వంశము సర్వనాశనము గాఁగల"దని శాపముగా దూషించెను.

ఆ మాటలను విని యావైద్యుఁడు "అమ్మా! నే నొనరించిన దానికి మీవాని కెట్టి ప్రమాదములేదు. అందులకు నీవు విచారింపఁబనిలే"దమ్మా యని పలికెను. బాలసూరికిఁ గొన్నాళ్ళ కాభయంకరవ్యాధి కుదిరినది. తన్మూలమున నతని ముఖమువిూద నెక్కువగా గుంటలుపడినను, నందము చెడలేదు సరికదా! మఱికొంతవింత సోయగము సంతరించినది. సర్వకళాశోభితుఁడగు చంద్రునకు మచ్చ సోయగము దెచ్చెనే కాని కళంకము వచ్చినదా? బాలదాసకవికి బాల్యమాదిగా గస్తూరికి సుగంధ మబ్బినట్లు, దేహబలము, బంగారమునకుఁ గాంతిఁ గూడినయట్లు బుద్ధిపాటవము, జ్ఞాపకశక్తి, మల్లెప్రసూనము నందు సుగంధకాంతు లొనఁగూడినట్లు పరిశోధనాశక్తి స్వతంత్రేచ్ఛాను కంపా స్వభావములు సైజగుణములై యున్నవి. మొండితనము పట్టుదల గలి



గినవాఁడైనప్పటికి జననీజనకులు, సోదరులు. మందలించినను వారిని ధిక్కరించుటగాని తిరుగఁబడు గుణముగాని కలికమునకేని బాలసూరికి లేకుండెను. సౌందర్య వికారగుణాదులను విమర్శించుశక్తి బాల్యమునుండి బాలసూరికి సహజగుణమై పెంపొందియున్నది.

ఒకసారి బాలసూరికవి జననీజనకులు కాశీ సింహాచలయాత్రాదు లొనరించి స్వగ్రామమునకుఁ జేరుచుండిరి. ఈ విషయము విని, జననిఁ గలిసికొనుటకై, యూరినుండి కొంతదూరము పరుగిడి, కాశీలో వేణీదానమొనర్చిన జననిని గుర్తింపఁజాలక, మా యమ్మ యేది యని యామెనే యడిగెను. అంత నేనే మీయమ్మనని, యామెయెంత వాకొన్నను విశ్వసింపక, కొంతసేపటికి గుర్తించి, పిదప మాతృపరిష్వంగనాసౌఖ్య మనుభవించి, సంతోషించెను.

మొత్తము మీఁద బాలసూరి బాల్యము, శరత్కాలమందలి యాకాశమువలెఁ బ్రకాంతితోను, పరిపూర్ణచంద్రునిఁ బోలు నిండు మనసుతోను, నవ్యనవనీత సమానమైన చిత్తముతోను. నల్పసంతుష్టితోను, చంద్రాగమనసముద్రతరంగములవలె నుత్సాహముతోను గడఁచిన దనుట నిస్సందేహము.

# విద్యాభ్యాసము

బాలసూరికవి రెండవయన్న సీతారామయ్య తెలుఁగు న్యాయవాదిగా విజయనగరమునఁ బ్రసిద్ధినొందెను. సోదరుఁడు విద్యాగంధము లేక చెడిపోవుచుండెనని యాంగ్లీయ పాఠశాలలోఁ జదువుఁ జెప్పించిన యెడలఁ బనికివచ్చునని సీతారామయ్యగారికిఁ దోఁచి, సూర్యనారాయణను విజయనగరమునకుఁ దండ్రితోఁ జెప్పి పిలిపించెను. క్రీ॥ శ॥ 1880 సంవత్సరము నీ బాల సూరిని మొదటి తరగతినందుఁ బ్రవేశపెట్టెను. అప్పటి కాతరగతిలోఁ బ్రథమమునుండి పట్టణవాసులగుటచేఁ జిన్ననాఁడే ప్రవేశించి చదువుచున్న బాలురకందఱికన్న నీతఁడు పెద్దవాఁడయినప్పటికి సంస్కృతాంధ్రములందును బరిచయ మున్నవాఁడగుటచేతను, గణిత శాస్త్రమునందు బుద్ధికుశలతఁ గలవాఁడగుటచేతను, నాంగ్లేయ భాషను సులభముగా నభ్యసింపఁగలిగెను.

పద్యపఠనమందును, బాటలుపాడుటయందును, జిన్నతనము నుండి నేర్పులవడి యుండుటచే, పాఠశాలలో నుపాధ్యాయుల యభిమానమును బొందుటకు బాలసూరికి నవకాశము గలిగెను. వారందులకు బాలసూరిని మిక్కిలి ప్రేమించుచుఁ దగునట్లు సహాయమొనరించుచుండెడివారు. కాలేజి ప్రిన్స్‌పాలు అగు చంద్రశేఖరశాస్త్రిగా రీతనికి జీత మివ్వనక్కరలేకుండ పాఠశాలలోఁ జదువుకొను నవకాశము గలిగించెను. బాలసూరి తనబుద్ధికుశల



తను గనంబఱచుచు, పైక్లాసుదాటి చదువుచుండెను. కళాశాలలోఁ దాను నభ్యసించు విద్యకన్న నూరిలో స్వయముగా నేర్చుకొన్న విద్యయే యధిక మగుచుండెను, అదియేమొ కాని బాలసూరికిఁ గళాశాల విద్యాభిమానము కృష్ణపక్షచంద్రకాంతివలెఁ గొఱఁతఁ బడుచుండెను. ఏదోవిధముగా నతఁ డుత్తీర్ణుఁడగుచుండెనేకాని, ప్రథమగణ్యతను సంపాదించుకొనఁజాలకుండెను.

అప్పటి విజయనగరము విద్యలనగర మనిపేరు బొందెను. పట్టణ మందు నెందుఁజూచినను పండిత సభలే జరుగుచుండెను. శాస్త్రవాదములు, వీణావాద్యములు, పాటకచ్చేరీలు భజనలు. నేత్రోత్సవంబులగు నాటకంబులు నగరమునమార్మ్రోగుచుండెడివి. *అప్పటి విజయనగరమునుగూర్చి దాసమహాకవి చక్కఁగా వర్ణించెను.

---

*సీ॥ తఱచుగ నల్లితామరతంపరఁజివు
రించెడి విద్దెలమించు నెద్ది?
సమదగజేంద్రాశ్వసంపద నలరారి
విజయరామవిభూతిఁ బెంచునెద్ది!
సంతతరత్నకాంచనముల విలసిల్లి
నెరి నలకారేఖ నించునెద్ది!
ఆనందపరవశంబై జగన్నాథవీ
క్షణమున నభివృద్ధిఁ గాంచునెద్ది!

బాలదాసకవి యెవరేదిపాడినను, విని దానినిమఱింత రసస్ఫూర్తిగను. విందుగఁ బసందుగ గానమొనర్చు చేకసంధగ్రాహియవి పేరువడసెను. కళాశాలలో నుపాధ్యాయులులేని తరుణమందుఁ దన సహాధ్యాయులు, పైదరగతి విద్యార్థులందఱు గూడి యాతని పాటలు పద్యములు వినుచు శ్లాఘింపు చుండెడి వారు.

సాహిత్యవినోదంబులఁ బాల్గొనుచు ప్రొద్దువోవుపఱకు గాలము గడిపి, గృహమునకు వచ్చుచు, వదినగారన్నము పెట్ట గాఁదినుచుండెడివాఁడు. అన్నగారు బాలదాసును నాలస్యమునకుఁ గారణమడుగ, దయ్యముఁవెంబడించినందువల్ల నాలస్యమగుటయో యేవోకట్టుకథలఁజెప్పి యందుచే నాలస్యమయ్యెనని చెప్పి తప్పించు కొనువాఁడు. నీరాహారవిహారములకన్న. సంగీతసాహిత్యసాధనలే

---

గీ॥ కోటలకుఁ బేటలకుఁ బూవుఁదోటలకును
నీటుటులబోఁకతి చిత్రనాటకముఁ
కాటపాటల కుద్యోగి కూటములకు
నాటపట్టైది యవ్విజయనగర మిద్ది-

* కన్యాశుల్క- మహానాటకమును రచించిన శ్రీ గురజాడ అప్పారావుగారు, గ్రామ్యవాదమునఁ బిడుగుగఁ బ్రసిద్దినొందిన శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు, శ్రీ ఆచంట వెంకటరాయ సాంఖ్యాయనశర్మగారీతనికా కాలమునుండి హితులు.



ముఖ్యాంశములుగా నీ బాలదాసుపరిగణించుట బట్టిభావికాలమున సాటిలేని మేటిపండితుఁడుఁగ మహాపండితకవిగ, నెదురులేని హరిదాసుగ వన్నెకెక్కెను. నాఁడొక్క-కాలమున ధారుణీగర్భమే యీ విషయమెఱింగియున్నదికదా!

ఒకనాఁడు కళాశాల తెలుఁగుపండితుఁడు బాలదాసకవిని బద్యమప్పగించుమనెను. అందులకాతడు "అయ్యా! ముందు నన్నడుగ న్యాయమా? నాకన్న ముందిరువురున్నారుకదా! వారప్పగించిన తరువాతఁ గదా! నే"ననెను. అందులకు మందహాసముఖుఁడై, యాయుపాధ్యాయుఁ డాయిరువురిచేతనప్పగించుకొనెను. పిదప నాతఁ డీతనిని వప్పగించుమనెను. అప్పుడు బాలసూరి యొకదోషము లేకుండ, ధారాళముగాఁ బద్యము వప్పగించెను. ఆపండితోపాధ్యాయఁ డీతనియే కసంధగ్రాహిత్వమునకు మెచ్చికొని "నీ ప్రతిభ నాకుఁదెలియకపోదు. ఒకసారి పద్యమును విన్న, దానిని మిన్నఁగా వప్పగించగలశక్తి నీకున్నది. కాని నీవింటికడఁ జదువు పాపమునుబోవ" విపలికెను. మొత్తముమీద నెట్లో కీ॥శ॥ 1886 సంవత్సరమున మెట్రిక్యులేషను పరీక్షయందు తీర్ణుడయ్యెను. అప్పటికే యాశువుగాఁగవిత్వము చెప్పఁగలసమర్థుఁడయ్యెను. "ప్రపేదిరే ప్రాక్తనజన్మ విద్యాః" అను కాళిదాసోక్తి యాతనియందు సమన్వయించినట్లు మతొక్కరియందు సమన్వయింప దనుట యతిశయోక్తిఁగాదు. నిరుపమానకవిత్వమందేకాక సంగీతహరికథలయందుఁగూడ నసమానుడని పేరెన్నికఁగాంచెను.

ఆకాలమున కాలేజి ప్రిన్సిపాలుగారగు చంద్రశేఖరశాస్త్రి గారు మృతిఁజెందెను. అప్పుడు ఈ సూర్యనారాయణ యావేదనఁ బడియాశువుగా * నొకపద్యమును జెప్పెను. ఆపద్యమును విన్న పండితులందలి పదమాధుర్యము, నర్థగాంభీర్యము, భావస్ఫూర్తికి హెచ్చుగా మెచ్చుకొనిరి. అప్పటికి బాలదాసు గారిఱువదిసంవత్సరముల ప్రాయమున రాజిల్లుచుండిరి.

క్రీ॥ శ॥ 1886 సంవత్సరమున శ్రీనారాయణదాస కవీంద్రుడు బ్రహ్మశ్రీ వడ్లమాని అన్నప్పయను నాతని పుత్రిక లక్ష్మీనరసమ్మను వివాహమాడెను. ఆ సాధ్వీమణి కాపురమునకు వచ్చి పూవుందావివలెఁ బతియందత్యంతానురాగమును గల్గి వర్తింపుచుండెను. పూసలుదారమువలె వారిదాంపత్యము సీతారాములవలె, నన్యోన్య రాగాస్పదయుతమై రాజిల్లుచుండెను. ఆ కాలేజియందుఁ బ్రథమగణ్యుడుగా నుత్తీర్ణుఁడు గాకుండుటచే, నుచితవిద్యార్థి వేతనమును నీ కవీంద్రునకుఁ దొలఁగింపఁబడెను. అందులకతడు విచారింపలేదు. పిమ్మట నతఁడు విశాఖపట్టణమునకు బోయి, ఏ. వి. యన్. కళాశాల ప్రిన్సిపాల్ గారిని దర్శించి వారితోఁ దనవిషయమును సాకల్యముగ మనవిఁ చేసెను.

---

* స్మితపూర్వాస్యసరోజ మున్నతభుజాశ్లిష్టంబు, నాజాను లంబితబాహుద్వయ మబ్జనిర్మల శిరోవేష్టంబు, సత్యామృతాంచితవాక్పూర మఖండవక్ష మరుణస్ఫీతంబు, శిష్యాళిఁ బ్రోవుత మంచున్ గురుచంద్రశేఖర మహామూర్తిం బ్రశంసించెదన్.



అప్పు డాకళాశాలాధ్యక్షులు నారాయణ దాసకవి స్ఫురద్రూపమును బ్రతిభాశక్తినిగుర్తించి నాయనా! నీవు నివురుఁగప్పిన నిప్పువలె నున్నావు! నీ యట్టివారికి సహాయ మొనరించుట తగిన ధర్మము. కాన నీ కళాశాలయందుచితముగాఁ జదువుకొనుచు మద్గృహమున భోజన మొనరించుము. నీకుఁ దీరిక వేళ నా ప్రియురా లగు వేశ్యనుసాహిత్య సంగీతము లందుఁ బ్రవీణురాలుగఁ జేయు" మనిపలికెను. అయధ్యక్షుని మాటలు నారాయణ కవిమనసునకు బుభుక్షాపీడితునకు నన్నమువలె పెన్నిధి లభించిన నిరుపేదవలె సంతోషముగూర్చెను. అతఁడట్లు జేయుచుండెను.

క్రీ॥శ 1886-88 సంవత్సరములలో F. A. క్లాసు *పూర్తి చేసెను. ఈకాలమునందు ప్రిన్సిపాలుగారి సానికి సంగీతము చెప్పుటతోనే సరిపోయెను. అందుచే నాక్లాసునందు నుత్తీర్ణుడు గాకపోయెను. కాని దాసకవీంద్రునకు నుద్యోగము చేయుట

---

* F. A. పరీక్షలో ఇంగ్లీషు పేపరు బాగుగావ్రాసెను. రెండవనాఁడు గణితశాస్త్రము పేపరు ఆఖరున యున్నసమస్య తీసికొని దానినిసాధించుటకుఁ బ్రయత్నించుచు మూఁడుగంటలలో రెండున్నరగంటల కాలము వ్యయపఱచిన సూర్యనారాయణ బాధ యక్కడనున్న పరీక్షాధికారిచూచి పేపరు మొదటనున్న లెక్కలు చేసిన యెడల ప్యాసుమార్కు వచ్చునని సూచించెను. అంత సూర్యనారాయణ కవీంద్రుఁడు "దానిలోనే మున్న"దని మిగిలిన యరగంటగూడ వ్యయపరచెను.

యందు వాంఛలేకుండెను. ఆప్తు లెంతహితబోధ చేసినను జెవిటికి శంఖూదినట్లుండెను. అప్పటికేకవితాప్రజ్ఞ, హరికథా కాలక్షేపసామర్థ్యముగలిగియున్న శ్రీనారాయణకవి స్వేచ్ఛాజీవనమందాసక్తిం గలిగినవాఁడై యుండెను. అంతకుమున్నే యా మహాకవి బాల ముకుందశతకమును కంద పద్యములలో" బాలకంద ముకుంద' యను మకుటముతో రచించెను. శ్రీనారాయణదాసకవి యిరువది సంవత్సరముల ప్రాయమునందు రచించినను, మిగులఁ బ్రౌఢముగను, మాధుర్యవంతముగను నదియుండె ననుట నిస్సందేహము. శ్రీనారాయణదాసకవి * భగవంతుని స్వామీ! నిన్నుఁబాడుటతప్ప వేరేవృత్తిఁ జూపింపకుము. బాల్యమునందే నీయందు భక్తిగలిగించినది. దానిని నామదినందు సుస్థిరము సేయుము. నన్నువదలక సర్వదాకాపాడుము, ఇహలోక సుఖమునందు మనస్సును నిల్పకు"మని వేడుకొనుచు విజస్వభావమును వెల్లడించినాఁడు.

---

*కం॥ "పొందుగ నిన్నుంబాడుట
కుందప్ప మఱెట్టివృత్తిఁ గొల్పింపకు న
న్నుం దయతో నారాయణ
కందళితానంద మూలకందముకుందా".

కం॥ "మందెట్టులనో పసితన
మందే నీ భక్తిపొడమె బాగుగ నది ని
ల్పందగురా నారాయణ
కందళితానంద బాలకందముకుందా"



ఒకనాఁడు సీతారామయ్య తమ్మునిఁగాంచి "నారాయణా! ప్రభుత్వోద్యోగము సేయుటవలన స్వేచ్ఛకాటంకమురాదు. న్యాయవాదవృత్తి కూడనట్టిదే! నీ విందేదేని ననుసరింపు" మని యెన్నోవిధముల మెచ్చఁజెప్పెను. రోగికి మధురాన్న మట్లు నారాయణదా సామాటల నచ్చదయ్యెను. ఆ కాలమున F. A చదివిన వా రందఱకు సామాన్యముగాఁ బ్రభుత్వోద్యోగములు వచ్చుచుండెడివి. కానివానిమీఁద దాసకవీంద్రునకు మోదము గలుగ లేదుసరికదా! ఎట్లు జీవనము జరుగునను ఖేదముగలుగ లేదు. గురుముఖమునఁ జదువుకొనని, నైజముగాఁదన కలవడిన సాహిత్యసంగీతహరికథాకాలక్షేపాదులలో మునుగడ సాగింపనిశ్చయించిన శ్రీదాసకవీంద్రుని మనః ప్రవృత్తి యత్యంతశ్లాఘనీయమైనది. ఆదర్శనీయము, చిరస్మరణీయమైనది కదా!

---

కం॥ "మందులమారివి నీదెస
డెంద మిటులభ్రమముజెందెడి న్విడువక బ్రో
వందగురా నారాయణ
కందళితానంద బాలకందముకుందా".

కం॥ ఇందలి లౌకికదంభము
లందున నామనస్సు నిల్పకనవరతము నిన్
జెందించుము నారాయణ
కందళితానంద బాలకందముకుందా".

దాసకవీంద్రుఁడు వేదశాస్త్రపురాణేతిహాసము లందు సర్వ సారజ్ఞతను స్వయముగ సముపార్జించెను. సంగీతసాహిత్య వాద్యములలో నసమాన ప్రజ్ఞాధురీణతను సంపాదించెను. రూపు రేఖలలోను సుందరమూర్తియయి, శ్యామలగాత్రుఁడై, శృంగార రసభూతుఁడై, వాణ్యంశసంభవుఁడై, యాంధ్రావనియం దవతరించిన గంధర్వుఁడయ్యెను.

మహాభక్తుఁడును మహాకవి యగు పోతనామాత్యునివలె సహజపాండిత్యమును మనోహరకవితా ప్రతిభను, నిర్మలభక్తిభావమును నన్గ్రళముగ గణించికొనెను. పూర్వజన్మ సంస్కారము నకుఁదోడుగా నతనికిలోకమే యొకపాఠశాలయు, సరస్వతియే యొక గురువయ్యెను. తన స్వగ్రామ మందున్న వేళఁ దొమ్మిది గంటలనుండి, వేకువవఱకు నాముదపు దీపము పెట్టికొని, యేదో గ్రంథము చదువుచుండెడివాఁడు. స్వయంకృషివలన ఉర్దూ, పారసి, అరబ్బీభాషలను నేర్చెను. శ్రీనారాయణదాసకవి పుంభావ సరస్వతీ భక్తిభావములను, నసమానశక్తిని మహాకవులు శ్రీ తిరుపతికవులు, పుంభావ సరస్వతులే ప్రశంసించిరి.

* శ్రీ దాసకవీంద్రుఁడు దనకుభగవానుఁ డనుగ్రహించిన యీ విద్యావైభవమును దానుజీర్ణింపఁ జేసికొని, లోకమున భక్తిప్రబోధమును గావించియే, తాను బరమేశ్వరారాధనమును జేసి కృతకృత్యుడను కాఁగల నని సంపూర్ణముగ విశ్వసించి,

* ౧ "ప్రహ్లాద నారద పరాశర పుండరీకాది పరమభక్తు



జపహోమ వ్రతతపాదులచే, సాధ్యపడని భగవంతుని మాహాత్మ్యమును నెఱుంగుటకు నిర్మలభక్తియే సాధనమని యెఱింగెను దానిని సాధ్యమైనంత వఱకు సాధించెను.

వ్యుత్పత్తి, ప్రతిభ, అభ్యాసము, అనునవి మూఁడును దాసకవీంద్రునికి సమముగాఁ బరాకాష్ట నందినవి. సముద్రమథన విష్ణ్వవతారమైన మోహినీస్వరూపమెట్లు మన్మథమథనునిఁ గూడ మథించి సాధింపఁగలిగెనో! యెట్లు వివిధరూపముల వివిధవ్యక్తుల

లలో పరిగణింపఁ దగినవాఁడు. ఈయన బాహ్యప్రవర్తనయేదో ఒకమాదిరిగ గానవచ్చినను, నంతరంగము బహునిర్మలమైనది. భక్తుఁడనఁగా, నారాయణదాసుగారు, అని నేను బాహులెత్తి చెప్పఁగలను. గానము కవిత్వము మాతృగర్భమునందే సంపాదించుకొనెను. ప్రసేదిరే ప్రాక్తక జన్మ విద్యాః అను కాళిదాసోక్తి యీతనియందు సమన్వయించినట్లు మఱొకరియందు సమన్వయింపదు" ఆంధ్రపత్రిక 29 జనవరి 45.

శ్లో॥ వర్ణాః సంకలితాః శ్రియోవిచలితా: వేదాః పరీభావితాః
గావః క్రూరవిభక్షితాః ఋషిమతం భూమ్యాం వినిక్షేపితమ్
కన్యాశుల్క మపేక్షితం ద్విజగణైః నీతాశ్వవృత్తిః సదా
ధిక్‌ధిక్ భారతవర్ష యోగమధునా కింవర్ణ నీయంమయా
జపహోమ వ్రతర్దానైః తపసానహిశక్యతే
జ్ఞాతుంత్వదీయ మాహాత్మ్యం భక్త్యైవ పరమేశ్వర"

"శ్రీ హరికథామృతము",

కేకకాలమున గోచరింపఁ గలిగెనో, యట్లే రంగస్థలమునఁ దానొక్కఁడేయయ్యు, వివిధవ్యక్తులను భిన్నప్రకారమున నేకకాలమునగోచరింపఁ జేసికొని, యాత్మశక్తివి సహస్రముఖములవారికి ప్రసారించినవాడై అనంతస్వరూపుడుగాఁ గళాబ్రహ్మగా, ఆశుకవి బ్రహ్మగా, హరికథక బ్రహ్మగా. గ్రంథరచనా బ్రహ్మగా, విరాజిల్లి, యాంధ్రచరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపఁబడిచిరస్మరణీయుఁ డయ్యెననుట నిస్సందేహము. ఇన్నివిధాలఁ బ్రశంసింపఁ బడిన నారాయణదాస మహాకవి యాంధ్రమాతృగర్భశుక్తి ముక్తాఫలమైనాఁడనుటలో నాశ్చర్యమేమి?



"ఒక పండితోద్దండుఁ డుద్ధతుం డొక యోద్ధ
ఒక మహాసమ్రాట్టు నొక మహర్షి" —యస్వీ.

# సాహిత్య సౌరభము

(సేవ)

*ఋషికానివాఁడు కవికాలేఁడు. దర్శనమువలన ఋషిత్వ మలవడును. చిత్రచిత్రభావములను ధర్మసూక్ష్మములను గ్రహింపఁగల ప్రజ్ఞయే దర్శనము. ఆ తత్త్వ దర్శన కవిలక్షణములలో ముఖ్యమైనది. ఊహాశాలిత అనుశీలనము, విషయజ్ఞత అనుభవములను నుపాధులు గలిగి, శాస్త్రకావ్యాదులలో ససమానపరిచయమును గలిగి, నిరుపమానాధ్యాత్మిక శక్తినిఁ బెంపొందించుకొనినప్పుడే కవికాఁగల్గుచుండును. ప్రాచీనకవులీ మార్గము ననుసరించి, మహాకావ్యములను రచించి చిరస్మరణీయులైరి. రవిగాననచోఁ గవిగాంచునన్నట్లు సముదాత్తమైన యూహావైభవము గలిగినప్పు డాకావ్యములు పరిణితఁ జెంది యా చంద్రార్కము విలువఁబడఁగలవు అట్టి కావ్యములే దాసమహాకవీంద్రునిలేఖిని నుండి వెలువడినవి. ఇట్టి మహద్భాగ్యము గల్గినవారే శ్రీ నారాయణదాస మహాకవి. విద్యాభ్యాసము నేయు మొదలుగా నాశుకవిత్వమున దిట్టగాఁ బేర్వడసిన మహాకవి. బరంపురం నివాసి, ప్రముఖ న్యాయవాదిగాఁ బేరొందిన శ్రీ జయంతి కామేశం

---

*"నానృషిః కవిరిత్యుక్త మృషిశ్చ కిలదర్శనాత్
విచిత్రభావధర్మాంశతత్త్వ ప్రఖ్యాతదర్శనమ్
సతత్త్వ దర్శనాదేవ పఠితః కవిః
దర్శనాద్వర్ణ నాచ్చాదరూఢా లోకేకవిశ్రుతిః.

పంతులుగారిని దర్శించి వారు కోరగాఁ దనచరిత్రను బాల్యమాదిగాఁ నాశుపద్యముల జెప్పెను. అప్పుడు పంతులుగారు దాసకవీంద్రుని యాశుకవితాధోరణి కాశ్చర్యానందములంది తనగృహమున నుండుమనియుంచి తనకుఁ దీరికయున్నప్పుడెల్ల దాసుగారితో గోష్ఠిసలుపుచు, వినోదింపుచుండెను. దాసుగారికి పంతులుగారి పరిచయముచాల విచిత్రమైనది. జయంతి కామేశంపంతులుగార ప్రతిమాన సంస్కృతాంధ్రపండితుఁడు. ప్రతిభావంతుఁడైన న్యాయవాది యగుటచే ననేకులగు జమీందార్లకు న్యాయవాదిగానుండి, యశేషధనమును విశేషయశమును సముపార్జించిన ధీశాలి. మృగీమదమునకుఁ గాంతియొనఁ గూడునట్టు లెంతధనవంతుఁడో, యంతవితరణశాలి, ఎంతవదాన్యమూర్తియో, యంత సాహిత్యపోషకుఁడై యుండెను.

ప్రథమమున దాసమహాకవీంద్రుఁడు వారింటికిఁజేరి వారెందుండిరని, యఁటఁగల వారి యుద్యోగి నడిగెను. అందులకతఁడు "అయ్యా! పంతులుగారు మేడమీఁద నున్నారు. వారితో మిమ్ముఁ గూర్చి యేమని చెప్పమందు" రని యనెను. అందులకాదాసకవీంద్రులు "నీకా శ్రమపనిలేదు. నేనేపోయెద"నని సరాసరి మేడమీఁదకుఁ బోయెను! పంతులుగా రీతనినిఁ జూచి" మీరెవ్వరు ? మీ నివాసమెయ్య'దని పలికెను. అందులకు దాసమహాకవీంద్రుఁడు "అయ్యా! మాది అజ్జాడ. నన్ను నారాయణదాసకవి యందురు. సంస్కృతాంధ్ర సంగీతములందుఁ బ్రతిభగణించి



తిని. పురాణపఠనమునందును, నాశుకవిత్వమునందును నష్టావధానమునందును సాటిలేని మేటిని. మానవరూపమును దాల్చిన గంధర్వుఁడ"నని పలికెను. ఎంతటియాత్మవిశ్వాసము! అమ్మహనీయుఁ గుర్తించిన దాసుగారి యాశుకవితాప్రాగల్భ్యమునకు, దమ్మహాకవీంద్రుని హరికథా ప్రావీణ్యమునకు, వాక్చాతుర్య ప్రాశస్త్యమునకు, బహుముఖ పాండిత్యమునకు, శ్రీ పంతులుంగార మందానంద కందళితహృదయారవిందుఁడగుచుఁ దనయొద్ద నాతని నాలుగైదునెల లుంచుకొని, తనవెంటఁ ద్రిప్పికొనుచు నమిత ప్రేమాభిమానములఁ జూచుచుండెను. పంతులుగారు, దాసమహాకవీంద్రులను "తమ్ముఁడనియు" దాసుగారు "అన్న" అనియు నుభయు లన్యోన్యానురాగములతో సంబోధించుకొనుచుండెడివారు.

దాసమహాకవీంద్రులచట, మాసద్వయముండి విజయనగరమునకుఁ బోవుటకు సంసిద్ధపడఁగా, నతని కొంతదూరము సాగనంపి, యతనిని విడనాడుటకు నభిమతములేక కన్నీరు పెట్టెను. అందులకు దాసమహాకవీంద్రుఁడు "అన్నా! యోగవియోగములు భగవన్నిర్ణయములుకదా ఇంతవంత స్వాంతమున నుంపకుము. త్వరలోఁ దిరిగి నీ సన్నిధికిఁ జేరఁగల"నని పలికెను. అందులకు పంతులుగా రాప్యాయముగా "మహాకవీ ! సూరన్నా! నిన్ను లోకమున నీయంతటివారే గుర్తింపవలెను.*" "అహిరేవహ్యాహేః పాదాన్వి జానాతినసంశయః" యని సూక్తికదా యనెను. అందు

*పాములజాడలు పాములెఱుఁగునట్లు.

లకు దాసమహాకవీంద్రుఁడు మందహాస ముఖారవిందుఁడై పయనమైపోయెను.

దాసమహాకవీంద్రులు విజయనగరముచేరిన తరువాత గతిపయ మాసద్వయమునకు, సాహిత్యలోకమునకుఁ జీఁకటిగప్పి, పండితకవి పద్మముల ముకుళింపఁజేసి, కృపణాకైరవముల వికసింపఁజేసి, కామేశభాస్కరుఁ డస్తమించెను. కర్ణకఠోరము, దురంత దుఃఖభాజనమైన, యవ్వార్తవిని దాసమహాకవీంద్రునిహృదయము ఝంఝామారుతమునకు సంక్షోభించు సముద్రతరంగములవలె క్షోభపడెను. చంద్రుడస్తమించిన తపించు కుముదమువలె, విస్తారము సంతపించి, యాశువుగా నమ్మహానీమునిపై ఆంధ్రభోజుఁ డస్తమింప తపించిన పెద్దనకవీంద్రుని చందమునఁ బద్యములను జెప్పెను. *ఆ పద్యరత్నములందుఁ పంతులుగారి యౌదార్యము, రూపాదులను, తత్ప్రతిభావిశేషములను

---

కం॥ *"పొడవా రడుగులు మేల్మిప
సిడిమేను వెడందరొమ్ము చిక్కనినడుమున్
జడుపెరుగని వాల్ప్రాపులు
కడుపుట్టులు మాజయంతి కామేశునకున్".

కం॥ తనపెను దోసిలితోడన్
వెనుఁజూపక పంచిపెట్టె. వేసారులు కో
రినవారి కెల్ల రూకలు
కనలేమెన మాజయంతికామేశునకున్".



ద్యోతకమొనర్చి. నిజగౌరవ ప్రేమసంతాపాదులను వెల్లడించెను. ఆహా! ఎంతటి కృతజ్ఞతా స్వభావపరుఁడు!

ఆంధ్రమహాభారతరచనాప్రారంభకుఁడు, ఆదికవి, వాగనుశాసనుఁడైన నన్నయభట్టారకుఁడు నివసించినరాజమహేంద్రవరము సర్వకళలకుఁ గాణాచి. వివిధభాషాపండితులకు నిలయము. వదాన్యులకు స్థానము. *అట్టిపురమున న్యాపతిసుబ్బారావుగారను, ప్రముఖన్యాయవాదియుండెను. అమ్మహనీయుఁడు నవనాగరికుల

---

కం॥ *"ఎరుకన్నేలపు కొలువున
బిరువురులను నీవి పట్ల బంటుతనమునన్
సరికా దెవ్వండైనను
గరువతనంబున జయంతికామేశునకున్"

కం॥ "కుడిచికుడిపించె గోర్కులు
గడించె వేవేలుమాటకారిమగండే
కడినైననెత్తిచూపడు
కడఁగలిదే మాజయంతికామేశునకున్"

కం॥ "పుట్టె వెలనాటిపారులఁ
గట్టెను పేరిపపట్ట కడియము కేలన్
గట్టెక్కె నలువదేటన్
గట్టండా మాజయంతికామేశునకున్"

ఈదేజయంతికామేశ పండితం గుణమండితమ్
శివమ్మక్తం రామభక్తం సుందరం ధైర్యమందరం.

సమాజమునందు సభ్యుఁడుగానున్నను ప్రాచీనాచారముల విడువని ధర్మపరుఁడు. అయ్యనఘుఁడు కలియుగ మిట్టులుండినను, సాధు వృత్తిని విడనాడని సజ్జనాగ్రగణ్యుఁడు. శిష్టులనుబాధించు దుష్టులనునెదురించు స్వభావమున నిష్ఠాగరిష్ఠుఁడు. ఆబాలగోపాలమును సమానభావమునఁ జూచు పవిత్రమూర్తి. నారాయణదాసమహాకవీంద్రుని ప్రతిభాసంపన్నతగుర్తించిన ధీసంపన్నుఁడు. అట్టి పంతులుగారికి నిత్య మీతఁ డత్యంతాసన్నవర్తియై, సత్యాదరాభిమానపాత్రుఁడయ్యెను. సద్గుణములబుట్టయగు పంతులుగారు తనపట్టునఁబట్టిన ప్రేమకు దాసమహాకవీంద్రుఁ డాశ్చర్యమును,

---

సీ॥ నవనాగరికులసంఘంబున నుండియు
పితృపంథ నెడయఁచతురుడెవఁడొ
కలియుగం బిట్టులంజెలరేగిన నాసాధు
వృత్తిని విడువని విబుధుఁడెవఁడొ !
క్రూరులచే సాధుక్షోభ లభించిన
పట్టునెదురించు దిట్టయెవఁడొ !
పిన్న పెద్దల నెల్ల ప్రియమారగాఁజూచు
ధీరుఁడెవఁడొ ! కర్మవీరుఁడెవఁడొ ః

గీ॥ "నిరత మన్యోన్యమైత్రితో నెగడెనెవఁడొ !
జాతినీతులు దప్పకజరిపె నెవఁడొ !
పరువుమర్యాదలకు బాటుఁబడె నెవండొ !
సుగుణముల ప్రోవు న్యాపతిసుబ్బరావు"



నానందమును బట్టుచుండెడివాఁడు. అందులకాతఁడు తన కృతజ్ఞతగా పంతులుగారినిఁ గూర్చియాళువుగా నయ్యనఘుసహజ గుణములను విందుగాఁ బసందుగా గొప్పగామెప్పు గాఁ జెప్పెను.

న్యాపతిసుబ్బారావుపంతులుగారు, దాసకవీంద్రునిచే నష్టావధానమును జేయించెను. నాఁటిసభకు దిగ్దంతులనఁదగు శ్రీకందుకూరివీరేశలింగముపంతులుగారు, వడ్డాదిసుబ్బారాయుఁడుమున్నగువారు పృచ్ఛకులుగానుండిరి. శ్రీదాసుగారష్టావధానమున మామూలగు నన్నిపనులఁ జేయుచు, రెండుతాళములతోఁ బల్లవి, యత్యుల్లాసమున సభరంజిల్లునట్లు గావింపుచుండెను. శ్రీవీరేశలింగము పంతులుగారు, కాళిదాసుమహాకవి రచించిన శాకుంతలనాటకమున గల "యథాలోకేసూక్ష్మం" అనుశ్లోకమును నాంధీకరింపు మని కోరెను. అట్లేయడిగిన పంతులుగారాశ్లోకమును, నిట్టేస్వభావసిద్ధమైన మధురఫణితినిఁ దెనిఁగించెను. ఆశ్లోకము భావము.* "విడిపోయిన చిన్నది పెద్దది మఱలఁ గలిసికొనునట్లు, రథవేగమునకు దగ్గరనున్నది, దూరమున నున్నది యొకటియైకలిసి కంటికిఁగనఁబడకున్నది" ఈ పద్యమును పంతులుగారు విని, రథవేగము బాగుగా విస్ఫురించిన దని పలికిరి. దాసమహా

---

* కం॥ చిన్నది పెద్దదిగా, విడి
యున్నది కలసినటు వంకనురువది సరిగాఁ
జెన్నారు దవులఁ జెంగటఁ
గన్నులఁబడ దెద్ది తేరు కదువడిఁ బోవన్,

కవీంద్రులు పంతులు గారినిఁజూచి" తమరనువదించిన శాకుం తలనాటకమున నీశ్లోకమును నెట్లనువదించితిరోశలవీయఁగోరెద" నవిపలికెను. పంతులుగారుతాముశ్లోకమునకు అనువదించిన ౨ రెండుపద్యములనుజదివిరి. వెంటనే, దాసమహాకవీంద్రుఁడు "పంతులుగారు ఆశ్లోకమునకు రెండుపద్యములు గావలెనా ? సంస్కృతభాషను దెనిఁగించి నప్పు దందలిపదము లచ్చతెనుఁ గులోనుండుటమంచిదికాదా"యని యాక్షేపించెను. మఱొక పృచ్ఛక పండితుఁడుదాసకవీంద్రునిఁగాంచి పచ్చనిపచ్చికబయలు గుఱించి చెప్పుమనియడిగెను. అప్పు డాకవీంద్రుఁడు దడుముకొన కుండ, సహజమగువర్ణనలఁజేర్చి, మాధుర్యమునుగూర్చి, రస మును దార్చిచెప్పెను. ౩ పంతులుగారు నాఁటినుండి దాసమహా కవీంద్రుని యందు నభిమానము చూపక, విమర్శనాదృష్టిని నీస డింపును జూపుచుండెను. అష్టావధాన మత్యంతవిజయవంత ముగా నొనరించి, పండితప్రేమార్హుఁడయ్యెను.

---

" సీ॥ *అల డెక్కఁలవంటి యాడెడి మిడుతల
వేటాడుగోరల మాటలకును
ఆఁబోతుమూపుల నలరునేఁత్రింతల
వలన నూరెడి నీలపాటలకును
గూళ్ళలోఁబరవులకొఱకు నాఁదోకల
వెంబడు కాకుల వేటలకును
చిఱురాల్లపై జిలజిలబారు సెలయేటి
నీటిపై లకు ముకిదాటులకును



౧ * రాజమహేంద్రవరమును గూర్చి యాశువుగాఁ జెప్పఁదవికోరిన దాసమహాకవీంద్రులు హృదయంగమముగాఁ జెప్పెను. వానియందు రాజమహేంద్రవరమునందు, గోదావరి, శ్రీరామనవమీ, అ ర్తరక్షకులయినగృహయజమానులు, గలర నియు, సాటిగానని మేటియీవిగాంద్రదందుందురనియుఁ దగవకులు

---

గీ॥ చెలఁగియుబ్బుచు, నిసుకతిన్నెలగంతి
బరుగువిడుచుండు బసులకాపురులుగలిగి
చుట్టుచెట్లులు నొకవంక చిట్టవంక
బరగు పచ్చనిపచ్చికబయలుగంటి."

౩ తరువాత పంతులుగారు దాసకవీంద్రులు రచించిన బాల సారియను పద్యకావ్యమును F A కు పాఠ్యగ్రంథముగా నిర్ణ యించిరి.

౨ "ఏది కడుఁజిన్న దై యుండునిప్పు డదియ
క్షణములోపలఁబెద్దదై కానుపించు
నేది నడుమును నెడముండి యొసఁగుచుండు
నదియు నొకటిగాఁగలిసి యున్నట్లుతోఁచు."
"ప్రకృతిచేతను నెయ్యదివక్రమగునొ
పరఁగనయ్యది సమరేఖవలెనె యుండు
దూరమిది, చేరువిది యని తేరుపడిని
నిశ్చయింపఁగ రాదేకనిముసమున."

నేర్చినపనుపరులు, తీర్పరులు నుందురనియు, మఱియు ననేక విశేషములఁ జేర్చిస్వభావసిద్ధముగ దానినివర్ణించెను.

---

* సీ "పరమపావనులు నీప్రజ లౌదురనఁగ సుం
దరతరాఖండగౌతమియెసాక్షి
నీవాలవాలము దైవభక్తి కనంగ
శ్రీరామనవమీప్రసిద్ధిసాక్షి
నీనరుల్దేశాభిమాను లనుటకు వం
దేమాతరంబనుతలపెసాక్షి
దిక్కుమాలినవారి దిక్కు నీ వనుటకు
నార్తులఁ బెంచుగృహాళిసాక్షి.

ఎల్ల చదువుల కీవె పుట్టిల్లనంగ
నఖిలదేశీయ విద్యాలయంబెసాక్షి
పుడమిలోపల నిన్బోలుపురముగలదె?
ఎన్నదరమనిన రాజమహేంద్రవరమ"

సీ॥ నగునోఁఅ నాలుగుతెగల మగలు మగ
నాండ్రు బిడ్డలుమాట లల్లువారు
చదువరి మొనకాండ్రు సాటిగానని యీవి
కాండ్రు వెన్నయని గడుసుదొరలు
తారామ్రరుసల్పని తగవరు లేర్చిన
పనుపరు ల్తీర్పరుల్పాటకాండ్రు



ఒకసారి దాసకవీంద్రుఁడు డిరువళ్ళూరురాజాయి అనువేశ్య పాటనువిని యానందించి యాపె పైనాశువుగాఁ బద్యము చెప్పెను. *ఆమెపాటమృతుమధురముగనున్నదనియు, నమృతంపుకొలనుమోటయనిచెప్పుచు నంత్యప్రాసములతో నానాటవెలఁదిపై తేటగీతిలోనే చెప్పెను. 2 శ్రీమహావిష్ణువును గూర్చి యొకరుపద్యమును జెప్పుమనికోరఁగా నిందాగర్భముగఁ జెప్పెను. అందలిభావము భార్యసీతనురావణుఁడపహరింప, నామె

---

తడిపొడితెర్వుల నడచు తేపలబండ్లు
కాపుర మలరింపఁగల వసతులు.

మేటి మైపులఁదొలఁగించు నేటియొడ్డు
తిరుగఁ బెండ్లాడుపడచుల కిరువుపట్టు
నేలయందెల్ల వీడుల మేలుతరము
హెచ్చునికరము రాజమహేంద్రవరము.

*"జిలుగురతనాల పేట - పూజెండులాట
క్రొంజెవుల యూట - యమృతంపుకొలనుమోట
వలపుముద్దులమూట పువ్విలుతువేట
హాయి వాడపోయుతేట రాజాయిపాట."

"అలియొరు లకాయె - నత్త నీపాలాయ
ముద్దితుడుపు లాయె - బుధవిధేయి
నీతిబీరకాయరీతి నీపేరాయ
నుత్తముండా పూరుషోత్తముండ."

తల్లియగు భూదేవి నీకుస్వాధీనమైనదని, పేరు నీతిబీరకాయవలె నున్నదని మనోహరముగఁ బద్యముచెప్పెను. ఈపద్యము శ్లేష నిందలతో స్వభావసిద్ధముగ, హాస్యరసపూరితముగఁగలదు.

రాజమహేంద్రవరమునందు సోమంచి భీమశంకరముగారనునొకన్యాయవాది కవిపోషకుఁడునై యుండెను. ఆసచ్చరిత్రుని మైత్రిదాసమహాకవీంద్రునకు లభించెను. ఇట్లుండ నాభీమశంకరముగారిప్రియపత్నియొకపుత్రికనుగని కాలవశమున మృతిజెందెను. నాఁటినుండి భీమశంకరముగారు పునర్వివాహమును జేసికొనక సౌందర్యవతి యగు నొకవేశ్యనుజేరఁదీసెను. భీమశంకరముగారి మాతృమూర్తి దనకుమారుఁడు తిరిగియుద్వాహమొనరించుకొనక వారవనితను జేరఁదీసినాఁడని విచారపడుచుండెను. ఒకనాఁడు దాసకవీంద్రునిఁగాంచి "మహాకవీంద్రా నాసంతాపము మీకుఁదెలియకపోలేదు. నాకుమారునకుఁబుత్రసంతతిలేదు. పుత్రులులేనివారిపుట్టగతులు లేవని పెద్దలుచెప్పుదురు. మీమాట మావానికివేదవాక్కు. వాని కెట్లనచ్చఁజెప్పి తిరిగి వివాహ మగునట్లుచేయుఁడు. మీ కెంతో పుణ్యముండు" నని మిన్నఁగాఖిన్నదనము తోఁబలికెను. అంత నాదాసకవీంద్రుఁడు దగినతరుణముజూచి భీమశంకరముగారినిఁ గాంచి "అయ్యా ! తమకుఁబునర్వివాహముగావలెనని యందులకు తమతల్లి మిక్కిలి సంతాపపడుచున్నది, కోరుచున్నది. మాతృవాక్యమువేదవాక్యము గదా అయినను మీకేమిప్రాయముచెల్లినది ! కానమీరు పునర్వివాహితులై సత్సంతానముపడయ మాకుఁగోరికయున్నద"దని పలికెను.



అంత నాతఁడు మందహాసమున మహాకవీంద్రా ! నాకు మఱల వివాహముపైన నభిమతములేదు. నాకొకపుత్రికకలదు. అయినను విశ్వాసనీయురాలు, సుందరవతియు నైన యొకవేశ్యను జేరఁదీసితిని. ఆమెను విడనాడుట ధర్మముగాదుకదా యనిపలికి యామెను నొకపరి దాసకవీంద్రులకుఁజూపెను. అంత నాకవీంద్రుడు "అయ్యా ! సానువలపు గోడతెలుపు స్థిరముగానుండునా ! విద్యావేత్తవైన నీకీవిషయమునఁ బ్రాజ్ఞతలేనందులకాశ్చర్యముగ నున్నది*. లోకమునందుఁగాకిజాతితెలుపు, లంచగొండికి న్యాయమందువలపు, నాస్తికునకుఁ బాపమందు జడుపు, పడుచుబోగముదానికి వలపుండునా !" యని బోధించెను.

దాసకవీంద్రునిమాట లతనికి నపుంసకునకురంభయట్లయ్యెను. అంత నిరుపు రొకనాడావేశ్యను బరిశోధించుట కొకయుక్తినిఁబన్ని, దానిచేఁదన్నిజస్వభావమునుతెలిసికొనిరి. నాటినుండి యామె యందాతడు విరక్తుడయ్యెను. కవయతి, వర్ణయతి యనునర్థముగలమహాకవిబిరుదము శ్రీదాసుగారిపట్లనే పూవుందానివలె సార్థకమగును ఉద్రేకపూరితమగుమనస్సునం దుత్సాహపశమునఁదోఁచునూహఁదాల్చిన యక్షర రమ్యమగురూపమే

---

అ॥ * కాకిజాతితెలుపు, కడు లంచగొండికి
న్యాయమందువలపు నాస్తికునకుఁ
బాపమందుజడుపు పడుచుభోగముతొత్తు
కొకనియందువలపు యుండుటరుదు.''

కవిత్వమందురు. అట్టిదానిని దాసకవీంద్రులు రసముజెడనీక సడలనీక, యమకపుష్టి స్వతంత్రకథాకల్పన, సందర్భోచితపద ప్రయోగవై శారద్యము, అపూర్వశక్తి, ధ్వనిప్రకర్షణ మున్నగు నవి యుండునట్లు ప్రదర్శింపుచుండువాఁడు. ఒకసారిసంగీత మెట్లుండవలెననిసభలో నొకపృచ్ఛకుఁడు ప్రశ్నించెను. అంత దాసకవీంద్రుఁడు "ఒకసారి పావుర మొదిఁగినచ్చినట్లుఁ ఒకసారి వానకోయిల పిట్టపలికినట్లు, ఒకసారి వేల్పుటావాడిసినట్లు, మంచుతో మబ్బు గర్జించునట్లుండవలె''నని సహజోప మానములతోఁ *జక్కని చిక్కని పద్యమును నాశువుగాఁ జెప్పెను.

---

సీ॥ '' *ఒకసారి పావుర మొదిఁగివచ్చినయట్లు
వానకోయిల పిట్టపలికినట్లు
ఒకపరి వేల్పు టావొడసి పటినయట్లు
మంచుతో మబ్బు గర్జించినట్లు
ఒకమారు వెన్నెలలోలికి గాసినయట్లు
కొలనిలో జలకేళి సలిపినట్లు
ఒకతూరు గవ్వగిలకరించినట్లు
చేడెతోఁ బూలచెండ్లాడునట్లు.''

గీ॥ చిన్ననాయన నీ మాట వెన్నముద్ద
లేసినట్టుల జువ్వలు వెగచినట్లు
సన్న బెంబేలి జాజులు జల్లినట్లు
చిన్న పూఁదేనెపై పయి చిందునట్లు''.



శ్రీ దాస మహాకవి సాహిత్యములో నిరుపమానాద్భుత మగు కృషి సల్పిరనుట నిర్వివాదాంశము. వారికిఁ దెలుఁగుబాస పై మిక్కిలి మక్కువ. తెలుఁగు భాషయందుఁబూవుతావియందుఁ గల గొప్పఁదనము. తేనెఁదీయదనము. మొలకయందలి లేఁతనమి మిడి యున్నవని, యందులోఁగవిత వ్రాయుట జన్మహక్కని వారినిర్ణయము. ఆంధ్రము నందేగాక, సంస్కృతకన్నడ, ఆంగ్ల గ్రీకు లాటిన్ పారశీక భాషలలోఁ గూడఁ గవితారచనయందు దిట్ట. గ్రంథాలయోద్యమ విధాత శ్రీఅయ్యంకి వెంకట రమణయ్య గారి సన్మానసంఘము కోరికమేరకు *సంస్కృత శ్లోకరూపమున వారికి నాశీస్సులంపెను.

దాసమహాకవివీంద్రుఁడు కుటుంబసహితముగా రామేశ్వరయాత్రకరుగుచు చోడవరం మున్సబుగారి ప్రోద్బలమునఁ బేరన్నతోఁగలిసి చెన్నపట్టణము చూచుటకై చనిరి. అచ్చట సోమంచి శంకరముగారి బసలో దిగి, పట్టణమును జూచుచుండిరి శ్రీశంకరముగారు రాజమహేంద్రవరమునఁ బ్రసిద్ధినొందిన

---

" * మొలక లేఁతదనము తలిరుల నవకంబు
మొగ్గసోయఁదనము పూవుతావి
తేనెదీయనము తెన్గున కేగాని
పరుష సంస్కృతాఖ్య భాషకేది!"
"అయ్యంకి వెంకట్రమణః, సత్యవాక్యపండితాగ్రణిః
వదాన్యః సద్గ్రంథగోప్తా జీయాదాచంద్రతారకః

న్యాయవాదియేకాక, ప్రముఖ కళాపోషకుఁడు, కవితాభిమానియై యుండెను. తరువాత శంకరముగారు దనయందుఁ జూపెడి ప్రేమాభిమానములకు దాసకవీంద్రుఁడు మనమున సంతసించి యమ్మహనీయునిఁ గూర్చి యాశువుగాఁ బద్యములను జెప్పెను,* అందాతఁడందమైన ముఖముగలవాఁడనియు, సత్యవర్తనము. దీనబంధుత్వమును గలిగినవాఁడని ప్రశంసించెను. ఆ పద్యములందు శృంగారరసమును బోషించి, ప్రశంసించెడిశక్తి యమ్మహాకవీంద్రునకే తగియున్నది. చెన్నపట్టణమునఁ బ్రముఖ న్యాయ

---

* "చక్కనిరూపు, నెమ్మి వెదఁజల్లెడి చూపును వాడవాడఁబెంపెక్కిన విద్య. సత్యరతి,యింపగు వర్తన. దీనబాంధవం బెక్కుడు గాఁగఁగల్గినను నిట్టులఁ బొంగగఁ జేయువానినిన్ మక్కువతో స్మరించెదను - నవ్యరసాంకుర భీమశంకరా"

"కులుకుమిటారి మేల్పసిఁడి గుబ్బలు, ముద్దుమొగంబు, చేరలన్ గొలువఁగవచ్చు వాల్గనులు గ్రొమ్మెఱుగారెడిమేని జవ్వనం బలరఁగనిన్నవిన్వలచి హాయిగ దంబురమీటి పాడఁ బ్విలుతునిఁబోలి నీవు వినువేడ్కఁ దలంచెద భీమశంకరా".

"తేలెడి కన్నుదోయి వడఁదేరెడిముద్దు మొగంబు, కాకలం దూలెడిమేను, మిట్టిపడు త్రుళ్ళెడిచన్గవ వేడిచెమ్మటల్ గ్రాలెడి చెక్కుటద్దములు గల్గుచుఁ గ్రన్నన నీదు కౌఁగిలిన్ సోలెడిగాత యౌవనము చొక్కునఁ బైకొని భీమశంకరా!"



వాదిగాఁ బ్రఖ్యాతిసందినవాఁడు రెంటాల సుబ్బారావుగారు. అతఁ డొకనాఁడు భీమశంకరముగారి బసకువచ్చి శ్రీ దాసకవీంద్రుఁ జూచి, తత్కవితా సౌరభ మాఘ్రాణించి, యానందరసోపేతుఁడై సోదరద్వయమును నిజగృహమునకుఁ గొంపోయి గౌరవాదరములతోఁ జూచుచుండెను.

అప్పటికే దాసమహాకవీంద్రుఁడు* బాటసారియను నాంధ్ర పద్యకావ్యమును. శ్రీకృష్ణజననమను సంస్కృతకావ్యమును రచించియుండెను. చెన్నపట్టణమందున్నదినములందు దాసకవీంద్రుఁడు నిజకోమల నిరర్గళకవితాధారచేతను, భరమనోహరసంగీత* హరికథాగానములచేత నాబాలగోపాలమునందు బండితపామరులయందు బ్రశంసలఁబడసెను. ప్రముఖాంగ్ల దినపత్రికలుగూడ దాసు

---

1. * వీనినిఁగూర్చి, గ్రంథపరిశీలన శీర్షికయందు విపులీకరింపఁ బడినవి.

2. వీనినిఁగూర్చి హరికథా శీర్షికయందుఁ దెలుపఁబడినది.

3. సమశీతోష్ణ స్థిత్యా - నిర్వాహిత సమధికార సంగత్యా
అప్యతిధన సంపత్యా - చెన్నపురి రాజతేత్రి దవభూత్యా॥

కం॥ కనుతెప్ప మూయనేరరు
మనుచక్కి న్గానినేలమీఁద దిరుగలే
రనయము వేలుపులీ చె
న్ననగరున నలరెడి మీకెనయగు దురొక్కొ.

గారి కవితానైపుణ్యము, హరికథాచాతుర్యము గానప్రావీణ్యములను గూర్చి గొప్పఁగ వెల్లడించినవి. దాసమహాకవి. చెన్నపట్టణమును, దానివైభవమును గూర్చి యాశువుగా నొకసభలో హృద్యములైనపద్యములను జెప్పెను, అందున్న వారందరు నేలమీఁదఁ దిరుగరనియు, నిదురఁబోరనియు, నెల్లరుదేవతా సమానులనియు బేర్కొనెను.

దాసమహాకవి మదరాసునివాసమును ముగించి, నిరుపమ కీర్తిని సంపాదించి, సోదరునితోఁగలిసిబెంగుళూరుచేరెను. ఆనందాచార్యులవారిసోదరుని గృహమునవివసించి మహారాజదర్శనార్థమై వేచియుండెను. అచ్చటనాస్థానవిద్వాంసుల మెప్పునొందినఁగాని, యామహారాజనందర్శనము లభింపదు. అల్లేదాసుగారు* సంగీత

---

సీ॥ *"లీలమై హిజెక్సలెన్సీ గవర్నరుకృ
పం బరిపాలించు భవ్యపురము
రసికాగ్రగణ్యులు రాజులువర్తకుల్
మేటియుద్యోగులు మెలఁగునగరు
సకలవిద్యాపాఠశాలలు సర్వాధి
కారస్థలంబుల గ్రాలుపోలు
అన్నిమతములవారన్యోన్య మైత్రితోఁ
గలసి మెలసిహాయిగాంచు వీడు
గీ॥ అతివిశాలము సతతసౌఖ్యాకరంబు
వార్ధితీరరమ్య మఖిలవస్తుయుతము



కళాకౌశలమును జూపివారిమెప్పు గొప్పగాఁబడసెను. మహారాజు మహాకవీంద్రుని మహాసంగీత కళానైపుణ్యమును విని వారిని స్వయముగాఁ బిలిపించి, వారిగానామృతమును గ్రోలి సంతోషాంబుధి నోలలాడెను.

మఱునాఁడురాజభవనమున దాస మహాకవి యంబరీష చరిత్రము సంస్కృతాంధ్రాంగ్లభాషలలో ననువదింపుచుఁ జదివెను అందున్న సంస్థాన విద్వాంసులువిని వారు దాసకవీంద్రుని సంగీత ప్రావీణ్యమునకుమిక్కిలి శ్లాఘించిరి * నారాయణ దాసుగారి

---

పలుకుఁదెలుఁగెక్కువగఁ జెన్నపత్తనంబు
భరతవర్షపుభాగ్యదేవతమకుటము.

సీ॥ *అలరుదేవియలూరు తలిరులజిగిమీరు
విన్నఁగరువు మీరుబెంగుళూరు
చిరుతమబ్బులకారు చెమటరానిషికారు
వేడుకలింపారు బెంగుళూరు
చెఱకుదీయనినీరు చేలపచ్చనిజారు
వేల్పునగ్గరుగేరు బెంగుళూరు
అపులపాలేరు తావులవేమారు
విలువఁదగినపేరు బెంగుళూరు

*హరికథాసేవలో నిచ్చటి వృత్తాంతము పొందుపరుపఁబడినది.

ప్రాయము ముప్పదేండ్లు అప్పటికి వారికిసుందరదేహ సౌష్టమునకు దోడు, నృత్తవిన్యాసము. గానకళాప్రవీణత, అద్భుత కవితా ప్రదర్శనము, సమయమునదగుచమత్కార విధానము లోకదానికన్న నొకటిమిన్నగా నుండుటచే మహారాజ హృదయము సంతృప్త సంతోషగౌరవ సంకలితమయ్యెను. దాసమహాకవీంద్రుని పూర్వ జన్మ పుణ్యమెంతటి గొప్పది? దాసకవీంద్రునిఁ గనిన జననీ జన కుల గత భవసుకృత మెంతటి గొప్పఁగా జెప్పఁగలఁది?

మహారాజు దాసకవీంద్రునిపై నప్రతిమానప్రేమలుద యించి, మిక్కిలిగౌరవించుచుండిరి. దాసకవీంద్రుఁడమ్మహారాజు తనయందుఁజూపు నాదరమునకు మోదపడుచు, నమ్మహీంద్రుఁ గూర్చి *యాశువుగాఁబద్యములను జెప్పి, యమ్మహారాజునకు వినిపించిరి. అంతనాభూజాని వానిని దర్బారులో ఫోనోగ్రాపులో క్రీ॥శ 1894 సంవత్సరము డిశంబరునెలలోరికార్డుచేయించెను వీనిని శతసంవత్సరములవఱకు వినుటకువీలగు 'నని మహారాజు శలవిచ్చిరి.

---

గీ॥ వింతదగు నాణెములనారు బెంగుళూరు
పెనుతవుళ్లకు మందుపే ర్బెంగుళూరు
తెల్లదొరలను రాఁగోరు బెంగుళూరు
వేనుదువులేల బంగారు బెంగుళూరు

సీ॥ "*ఏమహాప్రభునీతి యేపారునాంగ్లేయ
విక్రమాంభోదికి వేలమగుచు



దాసుగారు బెంగుళూరు నందున్నదినములలో నచ్చటి దేశస్థితులను. నాచార వ్యవహారములను బరికింపుచుండెను. ఒక దినమున నొకవైశ్యునింట నద్భుతమగు హరికథాగాన మొనరించెను. ఏతత్కథవిన్న యొకవైశ్యస్త్రీకి దేవుడావేశించి యింకొక కథ చెప్పింపుమని 'యనెనఁట దాసకవీంద్రులందులకం గీకరింపలేదు, మహారాజా దేశమున ఆస్థాన విద్వాంసులుదాసమహా

---

నేమహీజాని వీక్షామాత్రమున నిరు
పేదయునెగడుఁ గుబే రుఁడగుచు
నేధరణీకాంతునేలుబడి న్సరి
తనరారుఁ దామరతంపరగుచు
నేరసికాగ్రణి చారుధోరణిమించుఁ
బండితజనకర్ణ పర్వ మగుచు

గీ॥ నలరుఁగావుత, గానవిద్యాప్రకేళి
దుష్టవనకేలి, భక్తిసంతుష్టశూలి
శ్రితకమలహేళి, రూపమోహితనరాళి
రమ్యగుణపాళి శ్రీచామరాజమౌళి.

క॥ సర్వస్వతంత్రరాజ్యమ
ఖర్వంబురువిక్రమమునిగర్వాపీక్ష
పర్వం బగుసంతానం
బుర్విన్ శ్రీచాపన్నపతికొక్కనికేతగెన్.

కవీంద్రునికడ హిందూస్థానీభైరవిరాగ మభ్యసించుటకుఁ బ్రయ త్నించి విఫలమనోరధులయిరి.

---

శ్లో॥ బాలసూర్యాతపసరాగముఖపద్మ
మాంవి దేశీయముపలక్షితకటాక్షం
చారులే గోదుయవనాశ్వమధిరూఢం
చామరాజేంద్రమహోమున్నత మపశ్యమ్.
విద్వజ్జనే సవినయః-స్వజనే దాక్షిణ్యం
మూర్ధ్నిమార్త జనే

శ్లో॥ శత్రుజనే బాత్యుగ్రం-ప్రసరతి
భోచామభూప। తేదృష్టిః

శ్లో॥ న్యాయస్థానే ధర్మః
లాల్బాగారామ మండపే మదనః
మైసూరి ర్విపణిషుజనకః
భాతి శ్రీచామరాజ దేవేంద్రం

శ్లో॥ సింహాసన నాధిపత్యం-విశ్రుతసత్యం
సరాగధాంపత్యం
పశ్యామి విబుధమాన్యం
మవాహీపురీ చామరాజమూర్ధన్యం

శ్లో॥ ఏనప్రథమ కటాక్షా
దేవజ్ఞాతామ మాంచిత ప్రతిభా
తంగాతుంమత్క-వితానేచ్ఛతి
కించామరాజముచితజవైజ్ఞా



శ్రీవారితో దాసకవీంద్రుఁ డొకనాఁడు ముచ్చటింపుచు బెంగుళూరుపై నాశువుగా నంత్య ప్రాసములతోను జక్క-నిపద్య మును జెప్పెను. మహారాజాపద్యమునువిని, యానందించి దానిని గవిగారిచేత వ్రాయించి తీసికొనెను. దాసమహాకవి మహారాజు కడ శలవుఁగైకొని హిందూపురము, గుంటకల్లు మీఁదుగా గుంటూరు చేరెను. ఇచ్చట సభలో నొక పృచ్ఛకుని కోరికమీఁఅ గుంటూరునుగూర్చి* యొక పద్యమును నాశువుగాఁ జెప్పెను.

---

శ్లో॥ వాణీవిశాలక్ష్మీ చకోరచంద్ర
సౌజన్యసంతాప విభూతిసాంద్ర
స్వచ్ఛందకార్యేషు సదాప్యతీంద్రం
సాయాచ్ఛివచామధరాధీపేంద్ర

శ్లో॥ "అశ్వచతుష్టయరశ్మి పరిగ్రహణాతత కౌశలహస్తయుగం
హూణ విలాసవతీ చతురోక్త్యనుకారి మనోహరహాసయుతం
మామపిపూర్వనివేదితమధ్య నివీక్ష్య కృతస్మితదృగ్లసితం
చామనృపంగతసాయమ బిభ్రాజదాత్మరథస్థముపేంద్రనిభమ్.

చం. "సన్నవిమబ్బులో మెఱయు-చందరుపోల్కి- మొగంబు,
పెన్వలం
బన్నగఁద్రుళ్ళు బేడిసల-చూడ్కి- గనుంగవచూపు, చాపలోఁ
జెన్నలరారుఁగల్మిచెవి-చెల్వగురాణియుఁ బట్టుగద్దెపై
వెన్నునిఁబోలు చామదొర-నించుత కోరికతల్లి దంద్రులై".
(1894 డిసంబరు)

దాసమహాకవీంద్రుని హరికథా గానకవితానైపుణ్యము లాంగ్లాం ధ్రపత్రికలందు గొప్పఁగా బ్రశంసింపఁబడుటచే విజయనగరము మహారాజు చూచి, యట్టిమహాకవి, మహాదానునకుఁ దన యాస్థానమునఁ బదవి లేకుండుట తనకే కళంకమని తలఁచి, యమ్మహాకవీంద్రుని పేరు తన పండితులలోఁ జేర్పించి మాసమునకు పదునైదు రూప్యము లుచితవేతన మొసఁగున ట్లుత్తరువొసఁగెను.

ఈవిషయ మాకవీంద్రుఁడా విజయనగరముచేరఁగనే కళాశాలప్రిన్సిపాలు రామానుజాచార్యులవారిచేవిని, నాఁటి హరికథలో నాళువుగాఁ *బద్యమునుజెప్పిరి. ఇంతటిప్రతిభావంతుఁడైనను నింతప్రాపకము గౌరవాదుల సంపాదించినను, నుద్యోగవాంఛవడకుండెను. స్వతంత్రాభిలాషియై యథాలాభ సంతుష్టిపరుఁడయి యుండుటచే దాసమహాకవీంద్రుఁడు, లతః

---

గీ॥ ఆయు రారోగ్యములతోడ-నఖిలజనులు
సకలసౌఖ్యంబు లన్మనఁజాలుతావు
సుస్వరంబుగ మాటాడుచోటు విశ్వ
యముగ గుంటూరుకన్న నెందైనలేదు".

ఆ. "*వేంకటాద్రివలన, నంకురించినబడి
పల్లవించె నరుణపర్వతమునఁ
బూచికాచెఁ జంద్రభూషుచేరామాను
జమ్మునాటఁగల్పశాఖియయ్యె"



లార్జింపలేదు. అమ్మహాసీయుఁడే ధన్యజీవి. సహజపాండిత్యము గలపోతనామాత్యుఁడెంతటిపరమభక్తుఁడో, దాసమహాకవిగూడ, నంతటిమహాభక్తుఁడే - పోతనామాత్యునివలెఁ దనకృతులలో దేనినినరాంకిత మొనర్పక భగవదంకిత మొనరించిన పరమభాగవత శిరోమణి. తనహృదయమున నాటికొనిన భక్తిబీజములఁ బ్రోదిచేసికొనుచు సంగీతసాహిత్యకళావైదుష్యమును గవిత్వమును భగవత్పరమొనరించి ప్రజానీకగౌరవములను సంపాదించిన కృతార్థజీవి. శ్రుతిరాత్మాలయఃపితా" యని మాతాపితలను జక్కఁగా సేవించి తనియించినధన్యజీవులు కథాగాననిర్వహణమున నఖిలశాస్త్రసంబంధము, నాధ్యాత్మికశక్తియుండవలెనని మహాకవీంద్రునియాశయము. అయ్యాశయమున సఫలీకృతమనోరథుఁడైనాడనుట నిస్సందేహము. అట్టిబహుముఖప్రజ్ఞయల రారియుండుటచేత వారఖండకీర్తినిసంపాదించిరి. ఇన్నిటికిఁదోడు దాసకవీంద్రుఁడతిసుందర గంభీరవిగ్రహులు. ఐహికభోగములందువలెనే యాముష్మికసౌఖ్యములం దత్యంతాసక్తిగలవారు. దాసకవీంద్రుని ప్రతిభవలెనె వ్యక్తిత్వముగూడనపూర్వము, నమానుషమైనది. తాను మహాకవిమహాగ్రంథకర్త యగుటయే, కాక పసుమర్తి కృష్ణమూర్తిరచిత పార్వతీపరిణయయక్షగాన ప్రబంధమునకుఁ గృతిపతిగానంగీకరించెను. పిదపదాసకవీంద్రులే యాకృతిని నచ్చువేయించి సభఁజేయించి, కృతిస్వీకృతిఁ గావించి, యాకవికి బహుమతు లొసంగెను. ఆహా! ఎంతటివిశాల

హృదయము! మఱెంతటివిస్తారసంస్కృతి!మహాకవియై మహీజాను లపైఁబద్యముల మధురాతిమధురముగఁజెప్పి, ప్రశంసలందిన మహనీయుఁడు. మదరాసులోనున్నప్పుడు. *దేశోద్ధారకుఁడు, విశ్వదాతకాశీనాధుని నాగేశ్వరరావుగారినిఁ జూచి, వారి పై నాలు వుగాఁబద్యములఁజెప్పి. యమ్మహాదాతకళాపోషకుని గౌరవ సన్మానములనుబడసెను. ఆంధ్రకేసరిటంగుటూరిప్రకాశంపంతు లుగా రిమ్మహాకవి నిరుపమాన గానకవితా ప్రాశస్త్యమునకు నబ్బురపడిమిక్కిలిగౌరవించెను, ఆంధ్రరత్న దుగ్గిరాలగోపాల కృష్ణయ్యగారు, ప్రముఖన్యాయవాదియగు సర్ ఆల్లాడికృష్ణ

---

సీ॥ "*గొప్పతనంబునకు గుర్తునాసికయను
శాస్త్రమున కీ వుదాహరణము
సర్వప్రపంచప్రసంగా వహాత్మవి
ఖ్యాతినీపేర్శంకరాభరణము
సంగీతసాహిత్యసారామృతాంజనం
బలరునీవృత్తియా ర్తావనంబు
ఎల్లప్పుడు న్గపాలేశ్వరమునకునె
యరుగుట నీసహజాచరణము
గీ॥ నాఁడు బమ్మెరపోతన - నీడు నేడు
వన్నియ న్దెచ్చితార్వేల - వారికెల్ల
ఔరసకలాంధ్రజనపదోద్ధారకమణి
కాశీనాధనాగేశ్వరాఖ్యసుగుణమణి"



స్వామయ్య మున్నగుమహనీయులుదాసమహాకవీంద్రుని యద్భుత సంగీతకవితామాధుర్యమునకు భక్తిప్రపత్తులతో, నానందగౌరవము లతో జోహరు లొసంగిరి. ఒకనాడు విజయనగర మహారాజ సభలో తన పద్యమునకు తప్పుజూపిన పండితునకు మఱునాఁడు దాసమహాకవీంద్రుఁడు మహారాజునకు తనపద్యప్రయోగమున కుదాహరణముగా మనుచరిత్ర మందలి "నృమాంసము కూడై యేనెటు భరించువాఁడ" నను పద్యమును భారత మందలి "రాహు కంఠము దెగి నేలఁగూలె" నను పద్యమును నుదాహరణమును లక్ష్యము గాఁజూపి తనపద్య మందలి నిర్దోషిత్వమును నిరూపించెను, మహారాజు యుదాహరణములను విని యమ్మహాకవీంద్రు నుత్తమసాహిత్యజ్ఞానసంపదకు మిక్కిలి సంస్తుతించెను. ఆస్థాన పండితులు కూడ మహాకవీంద్రుని బహుముఖపాండిత్యధీప్రతిభకు మెచ్చి నివాళు లిచ్చిరి, "యథారాజ తథాప్రజా" కదా!

ఒకనాఁడు విద్వద్వల్లభుఁ డైన యానందగజపతీంద్రులు కవీంద్రునిఁ బిలిపించి గౌరవించి 'మహాకవీంద్రా! సంస్కృతాంధ్రములయందు రెండుసమస్యలను నిచ్చుచున్నాము! వానినిఁ బూరించి మాకానందమును గలిగింపఁ గోరెద" మని పలికెను. ఆ రెండు సమస్యలను దాసమహాకవి భావము సడలనీక *మాధుర్యవంతముగాఁ బూరించెను.

---

*సానులయొద్దనిచ్చకము సల్పుచు లొంగుచునుంట కర్ణ మౌ
దానము సేయుకుంటకు వృథాదినముల్ సరిపుచ్చుచుంటకున్

ఆనందగజపతి, యాసమస్యాపూరణమునకు మిక్కిలి యానందించి" మహాకవీంద్రా ! మీరవారణ కారణజన్ములు సంగీతసాహిత్యములు రెండు మీరెండు నేత్రములే. మీప్రతిభ యప్రతిమానము నిజముగా మీరు పుంభావసరస్వతులే" యని శ్లాఘించిరి భగవదంకితమైన దాసమహాకవీంద్రుని మనస్సు మహారాజసన్నుత నమస్సులకుప్పొంగలేదు. యోగులకుద్వంద్వము లందు సమానాదరణ ముండుట సహజము కదా,

ఒకసారి మహాకవీంద్రునితో మహారాజునిష్ఠాగోష్ఠి సలుపుచు, "కవిసార్వభౌమా! తేనియ సోనల మఱిపించి యమృతమును ధిక్కరించి మీ కవితామాధుర్యము మామనస్సులఁ నాటి మీరి పోతున్నది చక్కని చిక్కని కవిత్వము సామ్రాజ్యాధిపత్యము కన్న స్వర్గసంవాసము కన్న నధిక మైనదికదా ! నాకుఁ జిరకాలము నుండి శతకము వినఁగుతూహలము కలదు. పదమాధుర్యము- నర్థగౌరవము- భావస్ఫూర్తి- అలంకారసంపద- ధ్వనియుక్త- మయిన కవితగాఁ జేసి వినిపింపఁ గోరెద"నని యాదేశించెను. పిమ్మట దాసకవీంద్రుఁడు "సతతము సంతస

---

జ్ఞానియు జాణయైన తననాథుని గన్గొను నప్పుభార్యకున్
మానము లజ్జ ప్రేమయును మాటికిఁ బోరఁగ ప్రీతి
మీరెడున్.



మొసంగు సత్యవ్రతికిన్ అనుమకుటతో *గశతకమును నాతువుగాఁ దుదకు మహారాజును సంభోధించుచుఁ దదౌదార్యగుణ ప్రతిభలఁ బ్రశంసింపుచుఁ బద్యమును జెప్పి ముగించిరి. మహారాజా పద్యశతమునువిని మిక్కిలి సంతోషించెను. శ్రీవారు

---

క॥ *బ్రతుకున సుంకం బెఱుఁగక
స్వతంత్రరాజ్యంబు సేయు ప్రభువువలెఁ బతి
వ్రతవలె సహజకవివలెన్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్.

క॥ అతిజారవినుగుఁ బతికిన్
మతిహీనుఁడు ధనము లొసఁగు మజీతిరుపతికిన్
స్తుతిగొసఁగు జగత్పతికిన్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్.

క॥ అతులవికారము మీస మ
నృతవాదికి శక్తిహీనసీచకుమతికిన్
క్షితి సూనృతనెద సొగసది
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్,

క॥ బ్రదుకునఁ జదువులు సందెలు
చతురకళానిపుణతయును సర్వప్రజ్ఞల్
వితసూనృత మాడనిచో
సతతము సంతస మొసంగుసత్యవ్రతికిన్.

శ్రీనారాయణదాసమహాకవివలె మాధుర్యవంత మైన గాన మొనర్చువారు కాని అమృతపూరిత మైన కవిత్వమును జెప్పువారు కాని యీ విజయనగరము నందు లేరని పెక్కుసారులు వక్కాణింపు చుండెడివారు. దాసురాను నమ్మహాకవిపై ననురాగగౌరవము లతిశయించు౦డెను. కతిపయదినములకుఁ గవీంద్రునిపై

శ్లో॥ చతురకళావిద్యానం గతికిన్ స్థిరధృతికిఁ బ్రకటకరుణామతికిన్
కృతియానందగజపతికి సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

శ్లో॥ దాతృత్వం-ప్రియవక్తృత్వం-ధీరత్వముచితజ్ఞతా
తవైసత్కవి క్తమాఖ్యవత్వారః - సహజగుణాః

విద్వత్ప్రితోవిక్రమదేవవర్మన్-రాజన్యమూర్ధన్యవదాన్యమాన్య
జీయాశ్చికంవైష్ణవధర్మమూర్తే-దిగ న్తవిశ్రా న్తనితాన్తకీర్తిః

క॥ జయపుర మేలెడిఱేఁడా - వయిపు తెలియు చక్కని
చదువరి మొనగాడ కయికెమ్మ లేనివాఁడా - వెయితెఱఁగులఁ
గుఱివేలుపు ప్రోచున్ సీ॥సత్యవాక్యప్రియుం-డత్యంతశాంతుఁడు-
బ్రాహ్మణ్యమూర్తి సర్వజనసముఁడు సంశ్రితకల్పభూజము కవీ
శ్వరుఁడు. విష్కపటమానసుడు భాగవతమా రమ్యసద్గ్రంథవిరచనా
ధురీణుఁడు ప్రఖ్యాతపురుషుఁడు బహుకుటుంబ భవ్యవర్తనుఁ డేక
పత్నీవ్రతుఁ డిహపరములఁ దరియించు భాగ్యశాలి ఆరువేల
నియోగి, ధర్మానురాగి మహితమంత్రిప్రగడమండనుండు
భూసురాగ్రణి, యేలూరు పురవాసి స్వర్గమరిగెనె రాజాభుజంగ
రావు.



ప్రేమగౌరవచిహ్నముగాఁ బండితవేతనము పదిహేనురూపాయల నుండి ముప్పది రూపాయలవఱకుఁ బెంచెను శ్రీనారాయణదాస మహాకవి మహారాజు కడ నున్నప్పు డొక సేవకునివలెఁ గాక ప్రథ మాస్థాన మహాకవిగా, మహాగాయకుఁడుగా, వర్తించి స్వేచ్ఛఁగా సంచరించె ననుట స్పష్టము. జయపురసంస్థానాధిపతి. సాహిత్యసామ్రాట్ శ్రీవిక్రమదేవవర్మ మహాపండితుఁడేగాక, మహాకవియై, కావ్యనాటకరచయితయై కళాపోషకుఁడై, మిక్కిలి ప్రఖ్యాతి కాంచెను. ఆ మహారాజును దర్శించినయార్తులు రిక్త హస్తులై వచ్చెడి వారుకాదు. నిరంతర మాయాస్థానము భోజ మహారాజు నాస్థానమువలెఁ బ్రకాశింపుచుండెడిది. దాసకవీంద్రుల సంగీతసాహిత్యప్రావీణ్యతల విక్రమదేవవర్మ భూపతి యెఱింగి సగౌరవముగాఁ జయపురమునకు నాహ్వానించి యుచితాసీనునిఁ గావించెను, పిమ్మట దాసకవీంద్రులులేచి యాశువుగానమ్మహీపతి పైన రెండు సంస్కృతశ్లోకములను, నొక యాంధ్రపద్యమును జెప్పెను. అంత నా కవీంద్రుని ప్రతిభనుమెచ్చి, కథాగానాదులను జేయించి గౌరవ సత్కారాదులను మిన్నఁగా నొనరించెను. అమ్మహాకవిత్వగానాదుల కమ్మహీశుఁ డెంతయో సంతసించెను, ఏలూరు నివాసియగు రాజా మంత్రిప్రగ్గడ భుజంగరాయజమీందారు, శతాధిక గ్రంథకర్త, పండితకవి పోషకుఁడునై యుండెను. దాసకవీంద్రుల ప్రతిభను గుర్తించి గానకవిత్వాదులను విని సత్కరించెను. వారినిఁ గూర్చి కవీంద్రు లాశువుగాఁ బద్యమును జెప్పిరి.

క్రమముగా దాసమహాకవీంద్రులు, దేశపర్యటనము గావింపుచుఁ గథాగానాదులఁ బ్రజలను మెప్పింపుచు మహనీయుల సందర్శింపుచు వారిపై నాశువుగాఁ బద్యములను జెప్పుచు, వారిగౌరవప్రేమాదులను నొందుచుండెను. *అట్టివారు అనర్ బిల్ శ్రీ బూదూరి సోమయ్య. శ్రీ గరికిపాటి సుబ్బారాయశాస్త్రి, శ్రీ చంద్రశేఖరశాస్త్రి, కిళాంబి రామానుజాచార్యులు, వ్యాసుల జగన్నాధరావు, శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు, శ్రీ గంటి లక్ష్మన్నపంతులు, దండెమరాజుభగవానుపంతులు, శ్రీ తణ్ణారంగ నాయకులు, శ్రీ ముప్పర సోమరాజు, శ్రీ అవసరాల జగన్నాధ రావు. శ్రీ చుండూరి నారాయణరావు. శ్రీ ఇనగంటి బుచ్చి తిమ్మయ్య, శ్రీ కరిదేలోల శ్రీనివాసరావు. శ్రీ పాలంకి సూర్య నారాయణ, సబ్ కలెక్టరుమెహర్, రాఘవేంద్రరాజు బుజ్జవరపు బ్రహ్మన్న, పెర్లయసత్తైయశెట్టి పొట్టా అచ్చయశెట్టి, శ్రీ చిన్నా రావు, జూపూడి వెంకన్న, జూపూడి సుబ్బన్న మున్నగువారు కలరు. ఈ ప్రముఖులెల్లరు దాసకవీంద్రుల, యాశుకవితామాధుర్యమును గ్రోలి, యాశుకవితాచక్రవర్తిగా, మహాకవిగా, గుర్తించిరి.

విజయనగరము మహారాజుగా రొకపరిహవేలికి దాస మహాకవీంద్రుని వెంటఁ దీసికొని పోయి యచట వేసంగికాల

---

*వీరిపైఁ గల పద్యములు శ్రీ కె. ఈశ్వరరావుగారు ప్రచురించిన మేలుబంతియను గ్రంథమునఁ గలవు.



మును గడిపెను. అచ్చట వారి సంగీతసాహిత్యములతో వినోదింపుచుండెను. *ఒకనాఁడు దాసకవీంద్రులచే మహారాజు కథా

---

సీ॥ "*వేసవి మెండైనఁ బ్రియ మగుచుండు
నిల్లాలి చూపుల పొలయల్కమాడ్కి
హితమయ్యెడు నకాలహిమపాతమయ్యు
వివాహ మందలి యుపవాస మట్లు
పరుష ప్రకృతి యయ్యు బహుఫలదంబగు
ననవరతంబు పిత్రాజ్ఞకరణి
అభ్యున్నతం బయ్యు నతిసులభంబగు
సాధులన్భగవత్ప్రసాదమువలె

గీ॥ చెమటపట్టనితావు సౌఖ్యముల ప్రోవు
నలసటలగొట్టు దొరలకు నాటపట్టు
క్రూరజంతుల పేర్వెత్తు క్షోణినత్తు
కనుక నీ నీలగిరియె స్వర్గంపు తునక

సీ॥ "మూఁడువంతులు మిన్నుముట్టిమంచు మబ్బులనెగదన్ను కప్పురపు చెట్లు
మాయన్ని రకములు మరియేటన్లే పని
వేడ్కఁ జూచిన వింతవింతపూలు
శ్రమకరంబయ్యు నూర్ధ్వగతియె స్వర్గము
గొను దను నెక్కుఁడు మనుపుత్రోవ

గానమును జేయించెను. నాఁటిసభకుఁ దనమిత్రు లగు నాస్థానాధిపతుల నెల్లర నాహ్వానించెను. కొంతసే పయిన పిదప దాసమహాకవి నిజసహజధోరణిలో లోకము నానాటికిఁ జెడిపోవు చుండెనని పలుకుచు *నాంగ్లమహాకవి షెక్స్పియరు పద్యమొకటి చదివి మూఁడుచరణములు సభవైపుఁజూపుచుఁ దుదిచరణము దనదిశకు జూపుచుఁ జక్కఁగా నభినయించెను. అక్కడ చేరిన సంస్థానాధిపతు లెల్లరు మిక్కిలి నవ్వుచు నా కవీంద్రుని పటుతర నటనాశక్తికి నానందించిరి. అంతనొక సంస్థానపతి "మహాకవీంద్రా ! యాంగ్లమహాకవి పద్యమును హృద్యముగ జదివితిరి. కాని మీరద్దానినిఁ దెనింగించి యాశువుగాఁ జెప్పి మమ్మానందింపఁ

---

పున్నమవన్నెల కన్నవింపయి తుద
మొదలు చూపని నడుప్రొద్దుటెండ

గీ॥ మలయుచుంబొగనెల్పు కంబములు పనుల
తెరపి మరపించి రేబవ ల్గురియు వాన
పంకమెఱుగక పంటల పండునేల
వేసవి న్నీలగిరివాసమే సుఖంబు

"The world is grown so bad
That wrens make prey where eagles dare not perch"
Since every jack became a gentleman
There is many a gentle person made a jack



జేయుఁ"డని కలవిచ్చెను. అంతట నక్కవీంద్రుఁడు దడుము కొనకుండ నందలిభావము చెడకుండ జక్కఁగాఁ *బద్యమును నాశువుగాఁ జెప్పెను. దానిని విని యెల్లరానందించిరి. ఆహా కవీంద్రుని ధీశక్తి వర్ణనాతీతము. కదా!

కథాగానానంతరము మహారాజు మహాకవినిఁ గాంచి "మీ కథాగానకవిత్వము లెల్లర మనస్సుల నానందింపఁ జేసినవి. కాని మీయభినయము వలనఁ దోటి సంస్థానాధిపతుల మనస్సు లేవిధముగా భావించునో కదా !" యని పలికెను. అందులకు నామహాకవి "మహారాజా! ఇందు వేంచేసిన సంస్థానాధిపతు లెల్లరు మహారసజ్ఞులు లోకజ్ఞులు కావున నాయభినయస్వభావమును జక్కఁగాఁ దెలిసికొందురు. పద్యమందలి భావము సుభోధక మగుటకుఁ నట్లు చదివితినిఁ గాని వేరు కా"దని పలికెను. అందులకు మహారాజానందించి దాసకవీంద్రా! మీకీహవేలి యెట్లున్నదో పద్యరూపమునఁ జెప్పఁగోరెద" నని పలుక, వెంటనే యాకవిపుంగవుఁడాశువుగా, హవేలి మీఁదఁ *బద్యములను జదివెను. అందులకు మహారాజు సంతసించి కవీంద్రుని ఘనముగా సత్కరించెను.

---

"*జగముచెడె, డేగవాలగ, సాహసింప
కున్నచో జీనువయెుఱ దిన్నునుండె నెల్ల
నీచుఁడున్ ఘనుఁడౌటచే నెరుపఁబడిరి
తక్కువారుగ పల్వురు తగుమనుషులు !"

# గ్రంథరచన

శ్రీనారాయణదాసమహాకవి దాదాపుగా *నేబది గ్రంథముల రచించెను. వానిలోఁ బద్యకావ్యములుఁ హరికథలు శతకములు గద్యకావ్యములు నాటకములు గలవు. ఇమ్మహనీయుఁడు సకల శాస్త్రపాండిత్యమును సకలకళాకౌశల్యము బహుభాషావేతృత్వ మును, స్వప్రతిభాతిశయము సంపాదించుకొనిన ప్రజ్ఞాశాలి "నిరం కుశాఃకవయః" యను సూక్తి ననుసరించిన మహాకవి కేవల మానందజనకమయిన కళాస్వరూపము మాత్రమేకాదు. వారి మేధానిధానము తర్కకర్కశమై శాస్త్రనిశితధారారూపమై ప్రతి వాది మత్తేభగండ ఖండన పటిష్టమైనదియనుట సత్యదూరము గాదు. వారికవితాసంపద యందు నౌచిత్యము ననుసరించి రస భావమునకుఁ దగినరీతిలో శబ్దము లాణిముత్యములవలెఁ బ్రకా సిల్లుచు ధ్వనిప్రధానములై హృదయమున కానందమునుగూర్చు చుండు ననుట నిస్సందేహము. ఈ యపారప్రజ్ఞ బహుముఖము లుగా కళాసరస్వతియై విజృంభించినది. సహజ పాండిత్యసంప న్నుఁడు, మహాభక్తుఁడు మహాకవి యగు పోతనామాత్యునితో సరిపోల్పఁదగిన మహాకవి. భక్తాగగణ్యులైన త్యాగరాజు జయదేవులతో సరిఁదూపఁదగిన మహాభక్తాగ్రగణ్యుఁడు. ఆ కార ణముల వలననే యిమ్మహాకవీంద్రుని కావ్యమ్ములు పండిత పామరరంజకమ్ములై యాచంద్రతారార్కమ్ము నుండు ననుట నిస్సందేహము: రససిద్ధుఁడై విశిష్ట లక్షణ యుక్తములైన

---

1. అంబరీష చరిత్రము, 2. అచ్చతెలుఁగు పలుకుబడి 3. ఉమరుకైయాము రుబాయత్, 4. కచ్ఛపీశ్రుతులు, 5. కాశీ శతకము, 6. గజేంద్రమోక్షము. 7. గోవర్ధనోద్ధారణము, 8. గౌరప్పపెండ్లి, 9. చాతుర్వర్గ్యసాధనము, 10. జగజ్జ్యోతి, 11. జానకీశపథము, 12. తర్కసంగ్రహము, 13 తల్లివిన్కి, 14. తారకము, 15. దశవిధరాగనవతి, 16. దంభపురప్రహస నము, 17. ధ్రువచరిత్రము, 18. నవరసతరంగణి, 19. నాయె ఱుక, 20. నూరుగంటి, 21. పురుషార్ధసాధనము, 22. ప్రహ్లాద చరిత్రము, 23. బాటసారి 24. బాలరామాయణకీర్తన, 25 భీష్మచరిత్ర, 26. మక్కిమిన్కు, 27. మార్కండేయ చరిత్ర, 28. మకుందశతకము, 29. మృత్యుంజయశివశతకము, 30. మృత్యుంజయస్తోత్రము, 31. మృత్యుంజయాష్టకము, 32. మేలుబంతి, 33. మ్రొక్కుబడి, 34. యథార్థరామాయ ణము, 35. రామచంద్రశతకము, 36. రుక్మిణీకళ్యాణము, 37. వెన్నునివేయిపేర్ల వినకరి, 38. వేల్పుమాట. 39. వేల్పు వంద, 40. వ్యాకరణసంగ్రహము, 41. వ్యాసపీఠము, 42. సం గీతతరంగిణి. 43. సత్యవ్రతిశతకము, 44. సారంగధరనాట కము, 45. సావిత్రీచరిత్రము, 46. సీమపల్కువహి 47. సూర్యనారాయణశతకము, 48. హరికథామృతము, 49. హరి శ్చంద్రోపాఖ్యానము.

కావ్యము లను రచించిన వాఁడగుటచే నమ్మహాకవికి నీరాజన మాంధ్రజన మొసఁగినారు.

బా ట సా రి :

ఈ కావ్యమును రచించు నాటికిఁ గవీంద్రుని ప్రాయమిఱువదినాలుగువత్సరములు. ఇట్టి ప్రాయమున నిట్టి విశిష్టకావ్యమును రచనఁ జేయుట, వారి పురాకృతసుకృతమని చెప్పఁదగును. సంగీతాభినయములలోఁ బ్రాశస్త్యమును గణించి ముదిరిన తత్త్వశాస్త్రవేత్త యగుటచేఁ దాత్త్వికశాస్త్రమును నందుఁ గూర్చి పేర్చినారు. ఈకృతి గూఢార్థప్రతిపాదితము. ప్రతిపద్యమునందు వాచ్యార్థము కంటె వేఱైన గూఢార్థము నూహించుకొనవలసి యున్నది. ఎట్లూహించినను నది యాధ్యాత్మిక మార్గమునకు విరుద్ధము గాకుండ నుండవలయును. ఇందు ౧౬౫ పద్యము లున్నవి దీనియందు నాటు తెలుఁగు మాట లెక్కువగఁ గూర్పఁబడినవి. తత్సమ తద్భవపదము లరుదుగాఁ గూర్పబడినవి. ఒకానొక బాటసారి (జీవుడు) దారాపుత్రులతో నోడపై సాగరయానమొనర్చుచుండెను. గాలితాఁకిడిచేత నాయోడ కొండను దాఁకి పగిలెను. అతఁడును వానిభార్యాపుత్రులను విడివడిరి. బాటసారి యెట్లో తీరమునఁ బడియెను. కాని దారాపుత్రుల జాడ తెలియ దయ్యెను. విరహియగు బాటసారి యుదయము కాగానే యొక గిరినిఁ జూచి దానిమండి ప్రవహించు నొక సెలయేటినిఁ జూచుచు నొకతోట చెంత కరగి యచట విదురఁబోయెను. తరువాత నతఁడు ఘో



ర్కాని చాప రాతిమీఁద వెన్నానించి పరుండి తనసుందరిని భావించుకొనుచు నటఁ గలయొక తటాకమున స్నానమాడి నీరుద్రావి పూవుఁదోటనుండి వింతలఁ జూచుచుఁ బోవుచు గొంతదూరమున కరగి రాత్రివేళ నొకదివ్య సౌధమును గాంచి దానిలోనఁ జేరి దాని యందమునకునద్భుతపడుచుండెను. కాంతాసమూహముతోఁ గూడిన యొక సాదు సాహి దిస్స మొలతో నున్న బాటసారి కొక దువ్వలువనిచ్చి నీవెవ్వఁడవని ప్రశ్నించెను. అంత నాతఁడా తేనికి నిజవృత్తాంతమును జెప్పి తదానతినిఁ గోటలోఁ గొంత కాలముండెను. ఆతేఁడు విరాళితో నున్న బాటసారిని నోడరేవు దాపునకుఁ గొనిపోయి యచట నున్న గంటకంబము నందలి వ్రాఁతను జూపెను. దానివలన నింకొకనావ తనవారిని రక్షించినట్లు తెలిసికొని బాటసారి సంతసించెను. తదుపరి కొన్నాళ్ళ కాతేఁడు దనయన్న కొమరు నతని కప్పగించుచు వారి నోడనెక్కించి వేరొకపట్టణమున కంపెను. తరువాత నాపట్టణము నందే యతఁడు దనకాంతను జిన్నకొమరునిగాంచెను. ఆతేని యన్న కొడుకునకుఁ గూడ నతఁడు ప్రేమించిన సుందరిలభించెను. తరువాత బాటసారి తనదారాపుత్రులను నూత్నదంపతులను దోడ్కొని వెనుకటిపట్టణమునకు .వచ్చి తేనికి వారినప్పగించి యానృపాలుని పోషణమున దారాపుత్రులతోఁగూడి సుఖముగా నుండెను.

ఇట్టి కథావస్తువను రసవత్తరముగా మహాకవి దాసుగారు అత్యంత సమర్థవంతముగ నిర్వహించిరి. ఇందుఁ గొన్నిచోట్ల నవితర సాధ్యమైన పనితన మున్నది. ఇందు వేదాంతార్థమును

సమన్వయించు కొనవలయును. శైలిసుగమమై గుణము మాధుర్యవంతమై యున్నది.

ఈ కావ్యము శాంతరసప్రధాన మైనది. అంగభూతములై కరుణశృంగారవీరాదులన్నియు దీన నున్నవి. కాని ప్రశాంత మగుటచే నిందు వేనికిని బొంగుండదు. హద్దులోనుండి యెచటి నచటనే పొటమరించి యణగారు చుండును. *పద్యరచలలో నందెవేసినచేయి

---

*పాపపుదైవమెంత పొరబాటొనరించెను నన్మిగిల్చె స
య్యోపికవాణి వికసితోత్పలలోచన నిన్నుఁబాసి యె
ట్లోపుదు జాముక్రింద మన ముంటిమి ముచ్చటలాడుకొంచు నా
హా! పరిపూర్ణచంద్రవదనా మనకింక ఋణంబు చెల్లెనా. 1

గీ॥ కట్టుకొన్నచెలిమి కట్టులఁ దప్పితి
గట్టుకొన్నవాఁడ నెట్టులైతి
కట్టరానిమనసు కట్టిబ్రతికితిని
న్గట్టుకొన్నవాఁడ గనుకఁజెల్లె.

నారాయణదాసుఁ డఖిజ్ఞుఁడుగా,
గను ధ్వన్యర్థము స్ఫురింపం
గా రచియించెను బాటసారి యను
కబ్బంబదిదె స్వభావోక్తిన్.
గోరందగు నైనన్ విద్యార్థుల
కుంబాత్యమ్మయి భాసిల్లన్, 2



యగుటచే, సహజోక్తులతో బాటసారి కావ్య మత్యంతరమణీయముగ, మృదుమధురఫణితిని రచించెను. అందుచేతనే మహామహోపాధ్యాయ [2] శ్రీకొక్కొండ వేంకటరత్నము పంతులుగారు, శ్రీ బ్రహ్మశ్రీ పంతుల రామశాస్త్రిగారు, బాటసారి కావ్యమును ప్రశంసించిరి. దీనినిఁ గావ్యదృష్టి గంభీరముగ

---

"ఆచారాదులతోడ నొక్కకథ యూహంజేసి కల్పించుటన్
మీచాతుర్యము మెచ్చనయ్యె మతియున్ మీబాటసారిన్ రస
ప్రాచుర్యంబు స్ఫురించె మీకవిత ధారాళంబు నారాయణా
ర్యా! చిత్తంబున జాతిరీతులకు హర్షంబొందితిన్ మీకృతిన్". 3

సీ॥ "ఒంటిపాటునఁ జొక్క యురువయి కింపెక్క
విన్నుతూర్పునఁ దూఱె వేఁగుఁజుక్క
తెక్కలు జాడించి ముక్కున గోడించి
కొక్కొరొకో యనికోడికూసె
నీటితావులఁ దాఁటి,తోటలఁ గడఁదేఱి
యొడలు చల్లనసేయుచుండె గాలి
యైదుజాముల సద్దుగాఁ దోఁచు నింకఁ బ్రొద్దుఁ
బొడమెడు నని చాటఁదొడఁగె గంట

గీ॥ పట్టువెడఁబాసిపిట్టలు బయటఁబాఱెఁ
దలలుతిక్కించి మొక్కలు చెలువుమీఱె
బలిమితోడుత నిద్దుర బరువు జాఱె
దుబ్బున న్వేసవిబ్రేఁయి తెల్లవాఱె 4

నొనర్చి వర్ణనాత్మకముగఁ జేసి యాధ్యాత్మికముగ జీవునకు పాధి సంబంధమునఁ గలుగు వింతలను ధ్వనింపఁ జేసిన యీ మేధావి భావనాశక్తి నిరుపమానము. ఈకావ్య మొక్కటియే యాతని కవిసార్వభౌమత కుదాహరణముగాఁ జాలును. భాషలో భావములో సన్నివేశములలో సాదృశ్యములలోఁ గవీంద్రుని ప్రత్యేకత యడుగడుగునకు ద్యోతక మగుచుండు ననుట విస్సం దేహము. అంత్యప్రాసములతోఁ గలపద్యము లిందు సుందరముగా నుండును. పద్యము లందు సహజస్థితికి, మఱికొంత మెఱుఁగుఁ దెచ్చుచున్నది ఇందు సంస్కృత రచనాపాటవమే కాక యచ్చ

'అనుచతఁడంతఁగాంచెఁ జటులానిల చంచల దూర్మిమాలికా
ఘనవికటధ్వని ప్రబలకన్ది సముత్పవమానరమ్యనూ
తనరవిబింబ మొక్కయదిఁ దక్కిన చక్కులఁ బిక్కటిల్లి యీ
క్కుననడుమిన్నుదన్ను నొకకొండను గాంచి వెండియున్ 5

గీ॥ ''మొదట పావు లెఱింగి ముద్దుచూపు
పిదప కురులుంచు దాపున బెదరుచూపు
దగిలియెడఁ బాయఁజాలని దిగులుచూపు
కనుల దూజూచి చూపు నాకన్నెచూపు 6

క॥ నిడువాలుకనులు తీయని
నుడువులు ముంగురులు చెదరు నుదురు ……
…. …. …. ….
గడఁదగునీనడక, కనులగట్టియెడినుమీ! 7



తెలుఁగుతూడఁగాడఁగానఁబడును. సంస్కృతాంధ్రములను మేళ వించి తన యుభయభాషాపాండిత్య మీకావ్యము నందు వెల్ల డించెను. ఇట్టి రసపూరితకావ్య మాంధ్రభాషలోఁ బ్రముఖస్థానము నొందియున్న 'దనుట యతిశయోక్తి కాదు. ఇమ్మహాశయుఁడు లయ బహ్మయేకాఁడు. నన్నయ భట్టారకునివలె సంస్కృతాంధ్ర ములయందుఁ కవితయు గవిబ్రహ్మవలెఁ 7 తెలుగునుడి కారమునఁ గైతయుఁ జెప్పఁగలగొప్ప గవీంద్రుఁడు. సోమనాథుని వలె ననితరసాధ్యరచనా పరిశోభితుఁడైన శ్రీనారాయణ దాస మహాకవి శ్రీనాధకవిసార్వభౌమ తిమ్మనార్యులకు తుల్యుఁడై, ప్రకాశించిన కవిసామ్రాట్టు. అందుచేతనే శతాధికగ్రంథకర్తలు, ఆశుకవితాచక్రవర్తులు, నగు తిరుపతి వేంకటకవులు నారాయణ దాస మహాకవీంద్రునిఁ గూర్చి "*నారాయణదాసు సంగీత విద్వాంసుఁడేకాదు. అందమునను జిందించు సత్కృతులందించు

గాయక మాతృడన్నటుగాదితఁడంద మొలర్పసత్కృతుల్
సేయఁగలాడు వాక్పటిమచే, నుతికెక్కినవాఁడు, భాషలే
వోయయిదారునేర్చిన మహోదయుఁ డక్కటపోయెనేమి నా
రాయణదాసు ముక్తుఁడతఁడిట్టిఁడు, భూస్థలిఁ బుట్టఁబోఁడిఁకన్

''హోయనిపించునాట, యహహోయనిపించును బాట తేనెసో
నాయనిపించుమాట, వహవాయనిపించును దేటకైత వ
హ్వాయనిపించునో హరికథామృత సాగర, యాదిభట్టనా
రాయణదాస, నీకడ'' సమస్తము నవ్వయమయ్యె నద్దిరా'

నందగాఁడు, అంతేకాదు, విందుగాఁ బసందుగాఁ బలుకనేర్చిన వాఁడు, ఆమాత్రమేకాదు, బహుభాషల నేర్చిన పండితుఁ"డవి ప్రశంసించిరి, సంస్కృతాంధ్రభాషానిధియగు శ్రీమాన్ కాశీకృష్ణమాచార్యులుగారు" శ్రీ నారాయణదాసుగారి యాట హాయి యనిపించును. వారిపాట అహాహాయనిపింపఁగలదు. వారిమాట, తేనెసోనాయని యంచును వారి కవిత, వహ్వాయనిపింపఁగల'' దని స్తుతించిరి.

2. ఉమరు ఖయ్యాము - ఈ కావ్యము పారశీక భాషలో మిక్కిలి ప్రశస్తిఁ గాంచినది. దీని ప్రాశస్త్యమును గాంచి పాశ్చాత్యు లనేకులు తమతమ భాషలలోని కనువదించుకొనిరి. విజయనగరము* మహారాణి శ్రీ లలితా కుమారీదేవి గారు దాస

---

*సీ॥ రాజునకుంబుట్టి రాజుచెట్టంబట్టి
రాజులఁ గన్నట్టి రాణివీవు
మెల్లని మాటలఁ జల్లనిచూపుల
నెల్ల ప్రజంబెంచు తల్లివీవు
బడమి కవ్వింగక యిడుముకుస్లుంగక
తాలిమి గొనుముద్దరాలి వీవు
అన్ని జగంబుల కాదరువగుసజ్జ
పేలుపమ్మకు బత్తురాలి వీవు
గీ॥ ఒరులనొప్పింవ సుంతయు నొప్పవీవు
ఎప్పటికినైన మఱియాడి తప్పవీవు



కవీంద్రునితో నొకపరి నిష్ఠాగోష్ఠిగఁబుచు "మహాకవీంద్రా! ఉమరుఖయ్యాముము మీరు దెనిఁగించుట కేల పూనుకొన" రని యడిగెను. అందులకుఁ గవీంద్రుఁడు" మహారాణివారి సంకల్పమునకు వికల్పములేదుకదా! మోదావహమైన మీయాదేశమున ఉమ్మరుఖయ్యాము దెనింగింతు"నని పలికి వీడ్కొనెను. పిదప

---

మంచినెనెనరివి నీసొమ్ము లెంచిజూడ
గారివేనీవు లలితాకుమారిదేవి".

*శ్రీ మైసూరు మహారాజావారు, మఱల దాసకవీంద్రుని నాహ్వానించిరి. అంత నమ్మహాకవీంద్రుఁడు, సోదరునితోఁగూడ, బెంగుళూరు చేరెను. మఱునాఁడు కవి పుంగవుఁడు, సౌధసోపానమందు నిలుచున్న మహారాజావారిని దర్శించి ప్రణమిల్లి యొక గులాబీ పుష్పమును వారికి సమర్పించెను. అంత మహారాజు మందస్మితమున 'కవీంద్రా! యీ ప్రసూనమును, నెచ్చటఁగోచితి' రని ప్రశ్నించెను, అందులకుఁ గవీంద్రుఁడు "మహారాజా! యీ సుమమును, దేవరవారి సుందరోద్యానమునఁ గోసితి" నని విన్నవించెను. అంతనామహీజాని "సంగీత సాహిత్యములలో, మీకు మీరేసాటి, మీకుఁ బోటియేమేటి కూడలేఁడు. ఉండఁడు. ఉండఁబోఁడు, ఇట్టిమీరు మా యాస్థానమునఁ గవిగాయక పదవిలో నుండి, మాసంస్థానమునకు దిగంత విశ్రాంత కీర్తిని, 'నెలకొల్పఁ గోరెద' నని శలవిచ్చెను.

అ మాటలను, నాటపాట మాటల మేటియయిన శ్రీ నారా

నాకవీంద్రుఁడు మొత్తము పై ననువాదము నాలుఁగు పద్యము

---

యణదాస కవీంద్రుఁడు" ఏలినవారు నాపైఁజూపిన యనురాగమున కత్యంత కృతజ్ఞుఁడను. కాని, నేను మానవులను సేవించు మతమునకు, విరుద్ధమును గలవాఁడను. అందులకు శ్రీవారు మిన్నఁగా, మన్నింతురని యాశింతు"నని విన్నవించెను. ఆ పలుకులకు నామహీజాని, తనమనస్సున నానందించి, పైకిఁ గొంచెమయిష్టభావమును, వెల్లడెంచి" నిజమే- 'మీరు స్వతంత్ర జీవనమందాసక్తిఁగల వా'రని పలికెను.

తరువాత మహారాజు మహాకవీంద్రుని, హరికథాగాన కవిత్వాదుల జరిపించి, యానందించి, తన దర్బారులో దాసకవీంద్రునకు, మైసూరు ప్రభుత్వ చిహ్నముతోనున్న బంగారు మురుగులు. రెండు జతల శాలవలు, ఒకవీణయు, నొక తంబురాయును, వేయిన్నూటపదార్లుగల సంచియు, రెండవక్లాసు రైలుటికట్టును, బహూకరించి, గజారోహణాది సత్కారములను జేసి వీడ్కొల్పెను.

పిదప నా కవీంద్రుఁడా మహీంద్రునిపై, పద్యశ్లోకములను నాళువుగాఁజదివి, సోదరునితోఁగూడి, బళ్లారిచేరి. ప్రముఖ నాటకకర్త శ్రీ ధర్మవరము కృష్ణమాచార్యులుగారిచే, గౌరవ సన్మానములను బడిసి, విజయనగరముచేరెను. విజయనగర మహారాజ దాస కవీంద్రులఁ దన సంస్థానమున కాహ్వానించెను, అంత నా మహారాజ సభలో దాస కవీంద్రుఁడు, నిజ గానాదులచే నారాజేంద్రుని మెప్పించి, నాతనిపై నొక శ్లోకమును. నొకపద్యమును, నాళువుగాఁదెలిపెను.



లలో మూలము చెడకుండ నొనరించెను. అస్థిరమైన జన్మమున విస్తారభోగములకు నిస్తులానురాగము నుంచక సంపదలకు స్వస్తి జెప్పి భగవంతుని బ్రస్తుతించుటయే పరమార్థమని యీ గ్రంథము బోధింపు చున్న దని కవీంద్రుఁ డంతరార్థమును విశదపఱచెను. ఆమహాకవి యనువదించిన ఉమ్మరుఖయ్యామును బూర్తిగా విని అప్పుడు కాలేజిప్రొఫెసరు గారొకరు మహాకవి యభిప్రాయమునకు వ్యతిరేకింపుచు "అయ్యా ! మీభావము సరిగాదు. ఐహికమే కాని యాముష్మిక మన్నది లేదనియు జీవించెడి వఱకు,మనస్సునకు నచ్చినట్లు నిహలోక సౌఖ్యము లనుభవించుటే మానవపరమార్థ మని ఉమారు బోధించినాఁడు. ఈవిషయమునఁ బాశ్చాత్యులనుకూలమున నున్నా"రని పలికెను. అప్పలుకులకుఁ గవీంద్రుడు "అయ్యా! పాశ్చాత్యులు - వారి వారి సంప్రదాయములను బట్టి వారివారి భాషననుసరించి యటుల భావించుటలో నాశ్చర్యము లేదు, కాని హిందూదేశమున జన్మించి హిందువుల సంప్రదాయ మెఱిగి సంస్కృతభాష నభ్యసించిన వారెవ్వ రట్లు దలంపరు సామాన్యముగా మానవులు నిజప్రతిభా సంపదలతో నూత్నవస్తుజాలమును గ్రహించుట పరిపాటి. ఈకవితన గ్రంథమందు వాడిన 'మస్తు' అను పారశీకపదమునకు 'మత్తెక్కుట' అనియు, మనస్సున దైవము నందు మగ్నమొనరించి తన్మయత్వము చెందుట అనియు రెండర్థము లున్నవి. ఈద్వితీయార్థమును విస్ఫురింపఁజేయుపదమునే యేల నాకవి వాడెనో! మీరు కాని వారు కాని చెప్పఁగలరా! ఇహలోకసుఖాలనే యనుభవించుట యిందున్న

పరమార్థ మని వారు గాని మీరు గాని యూహించినచో నిజముగా నీగ్రంథ మిందాక యుండదని నిశ్చయముగఁ జెప్పఁగల' నని పలికెను. అమ్మాటలకు ప్రొపెసరుగారు సంతృప్తి జెందిరి. ఈగ్రంథమునకు భారతరత్న శ్రీ డా॥ యస్. రాధాకృష్ణగారు తొలిపలుకు వ్రాసిరి. అందులో దాసుగారి యనేకభాషాకోవిదత్వమునకు నిరర్గళధారగా వెలువడిన పద్యరచన మొదలగు వివిధప్రజ్ఞలకు సంతస మొందితిని. మొత్తము పైన నెల్లవిధముల నత్యాశ్చర్య జనకమైన యీయనువాద మొనరించిన శ్రీదాసుగారిని శ్లాఘింప వలసియున్నది" అని వ్రాసిరి.

తారక : ఇదొక సంస్కృత ప్రబంధము. ఇందు రెండు వందల తొంబై యెనిమిది శ్లోకములున్నవి, వింధ్యప్రదేశమునఁ నందున్న నదీతటంబున, సంశ్రితమనునొక గ్రామముకలదు. అందు సుదమతీ మహేశ్వరులను బ్రాహ్మణ దంపతులు గలరు. ఆ పవిత్ర దంపతులకు గల్గిన బాలుఁడు దినదిన ప్రవర్ధమానుఁడై, గురుకారుణ్య కటాక్షమువలన నప్రతిమాన విద్వావంతుఁడై నాఁడుః అతనికి విద్యారంగంలో దిగ్విజయ యాత్ర సాగింపనెంచి, పయనమైపోయి, విబుధనగరమునేరి, నిజ విద్యా ప్రతిభావిశేషముల రాజ సభలోఁ బ్రకటించి, మెప్పుఁబడసెను. పిదప నారాజేంద్రుని కుమారునితో గాఢమైత్రినిఁజేసెను. ఒక నాఁడిఱువురు గలసి నావమీద చంద్రద్వీపమందలి చంద్రమతీ నగరునకుఁ జేరిరి. ఆ పట్టణాధిపతి వీరిఱువుర గౌరవించెను. అంతలోపల రాజానుజులు దుర్మార్గులగుటచే వారిని నిర్బంధించిరి. అంతటవారు



వీరితోఁబోరి విజయమును సాధించిరి. అంతట రాజానందించి, తారక మిత్రుఁడైన రాజపుత్రునకుఁ దన పుత్రికనిచ్చి వివాహ మొనరించెను. పిదపఁ దారకుఁడు గృహస్థాశ్రమమును, స్వీకరించి పుత్ర పౌత్రాభి వృద్ధినిఁ బొంది సుఖించెను. ఇదీ సంగ్రహముగాఁ గథ, ఇంతటి చిన్నకథను చక్కని ప్రబంధముగా రచించిన ప్రజ్ఞాశాలిదే ఇంకొక గ్రంథముకూడ విశిష్టమైనది. అది అనల్ప ప్రతిభాప్రకటితమగునది 'తల్లి విన్కి' అను లలితాసహస్రమునకు, నచ్చ తెలుఁగు పద్యానువాదము. *ఇందొక్కొక్క నామముపన.

---

*హృదయస్థా :-
"గుండియలో నుండు గుబ్బలిపట్టి
నింగినేలలకుఁ దానే తల్లి వేరు
అడియని యుల్లము నలరించువేల్పు"
రవిప్రఖ్యా
"ఎఱ్ఱని వేల్పు - జగ్గలరించుజెజె
తమ్మి దొరవలెఁ బ్రాలత నలర్చుతల్లి"

గీ॥ ముద్దు పల్కులఁ గూర్చు ముత్యాలసరమ
సిరిగల దానవచ్చితె మింటినుండి
కఱకు గైదుపు సాము. గంగ్రలన్ మమ్ము
గెలువక సొమ్ములంకించి పోదురమ

శ్లో॥ ఖేదోయథాకాండ తరంగయోర్న
స్యాత్తైఽన్యలోకస్యత థైవదేవ

కొక్కొక్క పద్యమును శ్రీ దాస కవీంద్రులు రచించినారు. దాస కవీంద్రులింకొక యసాధారణమైన కృషిఁ జేసినారు. ఋక్సంగ్రహమును మొక్కబడియను పేరుతో, ఋగ్వేదమునుండి, మూఁడు వందల ఋక్కులను నేర్చికూర్చి, వానివిలయబద్ధముగా, నొనరించి, యుదాత్తానుదాత్త స్వరములు తప్పకుండ, సంగీతమున స్వరపరచి, వానికిఁ దెలుఁగుపద్దెములనువ్రాసి, శ్రీ శంకరాచార్య స్వామికి సంకితమొనరించిన సాహసశాలి.

నూరుగంటి యనునది చిన్న పిల్లలు చదువు కొనుటకై "Easop's Fables" నుండి నూరుకథలనునేర్చి వానినిఁ దేటతెలుఁగునవ్రాసి యాయాకథలలోని నీతిరెండు పాదముల లోను, నుదాహరణమును దక్కినరెండు పాదములలోను నిమిడ్చి వ్రాయఁబడిన గ్రంథము. మహావిశేషపూరితమౌ తనస్వీయ చరిత్రను ముప్పది సంవత్సరముల వఱకు రచించిన యద్వితీయ ప్రతిభాశాలి. అమూల్యములు, అద్భుత రసావహములైన కృతులనెన్నో రచించి మృతజీవులై, యాంధ్ర హృదయాంతర్నాళములందు సుస్థిరస్థానమును నాక్రమించిరి.

ఇంతటి మహోత్తర గ్రంథ రచనాశక్తి గలిగిన మహాకవి యగుటచే మైసూరు మహారాజ మహాగౌరవ మహాభిమానములకుఁ బాత్రుఁడయ్యెను. శ్రీ నారాయణ దాస మహాకవీంద్రులు

---

సర్వ ప్రపంచంత్వయి కల్పితోవా
స్థాణౌ భావేద్దస్యురివ భ్రమేణ"



సర్వవిధముల సంస్కృత భాషా మహోదధినిఁ దఱచి. లోతును గనుఁగొన్న మందరము, అందచ్చ తెలుఁగునందు హెచ్చిన మెప్పుదలఁ గల్గినవాఁడగుటచేఁ దెలుఁగు వారికిఁదేట తెల్లముగ నర్థమగునట్లు రచింతునని ప్రతిజ్ఞఁ జేసి, సఫలీకృతమనోరథుఁడైన మహనీయ మూర్తి. *సంస్కృత శ్లోకములను, నాంధ్ర

---

సీ॥ కర్తాఽస్తికిం వాజగతయితికృత్రిమ
శాస్త్రార్థచింత నైశ్యంక్యమాన
పండితమ్మన్యేషు వంచితేషు చతుర
సంస్కృతి గణికయా సత్స్వపిహ
భాగవతాస్సు విశ్వావహతాఖిల
సంశయాస్తావక చరణకమల
భజనామృతాస్వాద పరవశ నిత్యర
మాశ్లేషణిన సుఖ్యన్తిహంత

తే॥ గీ॥ భవతి నశ్రద్ధయా వినాభక్తి మాంస్తు
భక్తిమంత్రాంతిరేణ నముక్తి రస్తి
భవతి నశ్రద్ధయా వినాభక్తి మాంస్తు
హేజగన్నాథ సంశ్రిత హృద్విబోధ

మాన్యశ్రీ కర్రా ఈశ్వరరావుగారు దాస కవీంద్రుని గ్రంథముల ప్రాశస్త్యమునుగూర్చి "సాహిత్య నీరాజన" మను గ్రంథమును ప్రకటించుచున్నారు. వీరి కృషి ప్రశంసార్హము.

జాతి పద్యములగు సీసము, ఆట వెలఁది తేట గీతలలో వ్రాయుట యెంతయో ప్రశంసనీయమైనది.

సహజముగా భావ ప్రధాన కావ్యములకు సముచిత గౌరవముగలదు, రసాత్మకములగు నవియగ్రస్థానమును వహించును. ధ్వని ప్రధానములై మాధుర్యవంతములైనచో మఱింత యుత్తమ స్థాయినిఁ జేరఁగలవు. వీని నన్నిటిని ననుసరించినవారు శ్రీ నారాయణదాస కవిగారు. రసోల్లసదనన్యవాక్చ మత్కృతి సత్కృతి కల్పనానల్పమతిని, మహాకీర్తిని, నార్జించిన మహాకవి.

దాసకవీంద్రులు సునిశిత శీలనాశక్తితో దేశమును గూర్చిన హృదయవేదనము.*తమ యాశయములను లోకమునకు బోధించిన

---

సీ॥ నిరుపేదలకుఁ గుక్కమురికి సంతానంబు
కోటీశు నాలికి గొడ్డటికము
చేతనైన కురూపిఁ జేరనీయదు చెల్వ
నందగానికిలోని యంగుసున్న
మృష్టాన్న మారోగ్య హీనులకుండును
దినఁగలవారికిఁ దిండిలేదు –
దాతను ముంగాళ్ళఁ దన్నియేఁగును గల్మి
కడులోభివానినిఁ గొఁగలించు
గీ॥ ఉన్నవారున్నదని యేడ్వనుర్విలోన
లేదనునుచుఁ గుందెదరు సిరిలేనివారు



మేటి బోధకుఁడు. ఇట్టియమూల్యాశయరత్నములను, మనోహర గ్రంథమంజూషలయందు భద్రపఱచి, ప్రజలకు నొప్పగించిరి. మహాకవీంద్రులు, వివిధ భాషలయందుఁ బాండిత్యముగలవారలే యైనను. తమ గ్రంథములను సంస్కృతాంధ్రాంగ్లములయందే తమవారలకొఱకు సంతరించిరి. శ్రీ దాస కవీంద్రులు, తమ పవిత్రాశయములను, దమ సిద్ధాంత ప్రబోధములను, దమ పాండిత్య ప్రకర్షణములను నిక్షేపించి భారతమునకందించి రనుట నిస్సందేహము.

ప్రపంచ కీర్తిని సంపాదించిన కాళిదాస షేక్స్‌పియరుల కవిత్వలావణ్యములను, వాని తారతమ్యములను దెలుపుటకై యా మహాకవుల కావ్యములను నీమహాకవి యాద్యంతము పఠియించి వానియందలి కవితావిశేషములనునేర్చి నవరసములలో విభాగించి వేరువేరుగా నొక్కొక్కరసనుగల పద్యముల నొకదిశఁ గనఁబఱచి వానికిఁ దెలుఁగు అనువాదము రెండవదిక్కునను లిఖియించి యా యాపద్యముల సందర్భములను సముచితముగాఁ

---

చూడ నీలోకమంతియు శోకహతము
సత్యముందయయుఁ గల్గిన జనముదక్క
గీ॥ తెలుఁగువారల కుందేట తెల్లముగను
తెలుఁగులో నెల్లవిద్దెలఁ దెలుపనెంత
అన్ని విధముల ననుగాఁచు నాంధ్రదేశ
మునకు నాయచ్చియున్న యప్పనముదీర్తు॥

దెలిపి యాయుభయకవుల భేదమును దెలిపిన గ్రంథమే నవరస తరంగిణి. ఆంధ్రదేశమున షీక్స్పియరు కాళిదాసుల కవితాతార తమ్యమును విశదపఱచిన మహాకవీంద్రుని కృషి నిరుపమానము కదా!.

దాసమహాకవి తనయభీష్టసిద్ధాంతములను. ప్రౌఢపాండిత్యబలమును దమలౌకానుభవమును వెల్లడి యగునట్లు శ్రీకృష్ణుని చరిత్రమును వర్ణింపుచు హరికథామృతమను నొకగ్రంథమును రచించిరి, అచ్చతెనుఁగున నొక నిఘంటువును నెంతో శ్రమపడి రచించిరి, శ్రీ దాస మహాకవీంద్రుని గ్రంథ సముద్రమును మథించుటకు, నట్టిశక్తిపరులె యత్నించుట సహజముకదా! దాస మహాకవీంద్రుల శతకసాహిత్య మత్యంత మాధుర్యవంతము నిరుపమానము నిరంతరసంస్తూయమాన మైనది. ఆ చంద్రతారార్క మా మహనీయు కవితామృత ప్రవాహ మాంధ్రభూమినిఁ బవిత్ర మొనర్చుననుట నిస్సందేహము.

ఈ ప్రపంచ మంతయు దుఃఖభాజన మనియు జీవితము బుద్బుదప్రాయ మనియు నిహలోకసుఖముల నాశించి నట్టే పర లోకసుఖముల నభిలషించుటకూడఁ బరమార్ధ మనియుఁ బుట్టు జావుల విషయమును నెఱుంగుటకు మానవశక్తి చాలదనియు సంసారసాగరమును దరించుటకు భగవద్భక్తి తప్ప వేరు మార్గము లేదనియు నస్థిరములైన సంపదల నాశించుటకన్న సుస్థిర మైన యాధ్యాత్మికశక్తి సంపాదించుకొనుట విధ్యుక్త



ధర్మ మని యీశతకము లందు దాసకవీంద్రులు తమవిశ్వాసము లను జక్కఁగాఁ బ్రకటించిరి. *ప్రత్యక్షదైవమగు శ్రీసూర్య నారాయణ భగవానుని శతక మంతయు నసమానభక్తి భావ

---

అరవిందపిరియ! నీవుదూర మగు నప్డయ్యయ్యో! దుర్దాంతదు స్తరఘోరాంధతమిస్రమగ్న మయి భూతవ్రాత మాపత్పరం పరలంబొందును, నీదుతత్త్వ మెడలింపన్ సర్వమున్ శూన్యమౌ నరయన్నివె చరాచరంబులు మహాత్మా! సూర్యనారాయణా.

కమలాళిన్ వికసింపఁజేయు నెడ శృంగారంబు హాస్యంబు, దు ర్దమ మందేహతమిస్రమారణమున రౌద్రాద్భుతోద్వీరసం క్రమభీభత్సభయానకంబులు లసత్కారుణ్యముందావకీ నమహాభక్తులయందు సప్తగిరిపొంతన్శాంతి భావంబునీ వమరంజేయుదు, నిత్యనిర్గుణుఁడవై, హాసూర్యనారాయణా.

ధనమారాము, దురాశఁబోదు, పరతత్త్వజ్ఞానమాలేదు. యౌ వనమా నిత్యముకాదు, వార్ధకమునన్ వామాక్షియౌఁజేదు, జీ వనమా యెన్నఁగఁబాదు, దుఃఖములకుం బల్మాఱటల్ గావున న్నినునేఁగొల్తునిఁకేలవాదు, దయగన్మీ! సూర్యనారాయణా,

తొలి రంగెద్దియు లేని నీకిరణసందోహంబు వాశ్శీకరం బుల నానావిధివర్ణయుక్త మగు నప్పోల్కిన్ నిరాకారని ర్మల నిర్లేపితనిత్యకేవలపరబ్రహ్మంబు నీవయ్యు. ని మ్ముల మాయంబలుచూపులం జెలఁగె దట్లోసూర్యనారాయణా.

ములచే రచిత మైనది, ఇది మనోహర మైన యూహల తోను నౌచిత్యయుక్త మైన లోకోక్తులతోను మనోజ్ఞ మైన వచోనిపుణత్వముతోను దాసమహాకవీంద్రుఁడు రచించెను.

---

ధరణిం జీకటివేళ దవ్వు జెంగుండర్శించుకందోయికిన్ మరియేవస్తువు లైన దోచనటు నిన్ ధ్యానించు నవ్వాని క ద్దిర యీలోకవికారము ల్మది రవంతేనిన్ గనన్ రావుగా నరయంగాఁ దన జీవితంబున మహాత్మా! సూర్యనారాయణా.

అమరన్ బంగరునుండి దానిదగు ఛాయన్ వేరుసేయంగ శక్యముగా నట్టుల నిజ్జగం బెడబరా దయ్యారె నిన్నుండిచ క్రమునం గోణము రీతి నారయఁగ నీత్రైలోక్య మేపారినా శమునీయందునె చెందుచుండుపరమేశా సూర్యనారాయణా.

గారీచిత్తసరోజభృంగ త్రిగజత్క-ళ్యాణ దాపాంగ, సంసారధ్వాంతపతంగ మూర్ధవిచల స్స్వర్గాపగాభంగ, కేయూరప్రాప్తభుజంగ, మర్దితబలోగ్రోద్దండమాతంగ, తారారాట్త్రుజ్వలతోత్తమాంగ, లలితార్ధస్వాంగ మృత్యుంజయా.

రవిచంద్రానలనేత్ర, దుర్ఘటమహారక్షఃపురీజైత్ర, సంస్తవనీయోరుచరిత్ర, భక్తజనహృద్రాజీవసన్మిత్ర దుర్భవషడ్వర్గలతాలవిత్ర, గిరిజారామావనీచైత్ర! భస్మవిలిప్తాంచితగాత్ర, భూరివియదంభఃపాత్ర. మృత్యుంజయా.



మధురమైనది అంత్యప్రాసములతోఁ గూడునది సమాసాడంబర సంయుక్త మైనది మణౌకశతకము మృత్యుంజయము ఇదిభక్తి ప్రధానమై మోక్షాసక్తినిఁ గూర్చు శతకరాజము. ఈ కోవకుఁ జెందినవే వేల్పువంద మున్నగు శతకరత్నములు. ఇఁక సంస్కృతవాఙ్మయమునందు ధ్రువతారలుగా నెన్నఁదగిన రామచంద్ర శతకము కాశీశతకము మున్నగునవి దాస మహాకవీంద్రుని లేఖిని నుండి వెలువడిన యాణిముత్యములు. *ఈ కాశీ

---

కరుణాలోకనజాల, రాత్రిచర మేఘస్తోమవాతూల, సింధురచర్మాంచితచేల, మూర్ధవిలసద్ద్యోవాహినీకూల, నగ్గిరిజాచిత్తవిలోల, భక్తజనహృద్వీధీనటచ్ఛీల, భాస్వరదక్షిణయశోవిశాల, శశిరాజత్ఫాల, మృత్యుంజయా!

శ్లో॥ *గంభీరం. నిర్మలంస్నిగ్ధం
మపూర్ణం, భాతిజాహ్నవి
అపి కరుణయోర్మధ్యే
శశిరేయోగి దృష్టివత్

శ్లో॥ విశ్వేశ్వరాభిషేకాయ
సతి భాగీరధీజలే
కాశ్యాం కోమాంవాంఛతీతి
నారికేళోసజాయతే -

శ్లో॥ సౌధస్యాఽరుంధతీవ
మధ్యే సౌదామినీయధా
అధస్తాత్పాంచాలికేవ
కాశ్యాంభాతికులాంగనా!

శతక కవితలోఁ బ్రత్యక్షీకరణశక్తి యధికముగా మోదాకరముగా నున్నది చదివిన వారి యెదుట గాశీనగరము నానాసన్నివేశములలో దక్షణము దృగ్గోచరము కాఁగలదు, ఇచట శిశిరకాలమునఁ దాపము స్వేదము లేకుండుటచే, యోగదృష్టియెట్లు గంభీరము నిర్మలము స్నిగ్ధమునై, యుండునో, అటులే వరుణా - అసీ మధ్యఁగల గంగానది భావించుచున్నదఁట —— కాశిలోఁ గొబ్బరి కాయపుట్టదఁట - విశ్వనాధుని యభిషేకమునకుఁ బావనగంగా జలము లభించు నప్పుడు దన జల మెవరికి గావలయునని తలంచి కొఁబోలు టెంకాయ ఇక్కడ నదృశ్యమై పోయినదఁట: కాశీసౌధముల మీఁద నివసించు కులాంగన అరుంధతీ నక్షత్రము వలె లీలగాఁ గనిపింపుచున్నదఁట మధ్యాంతస్థున విద్యుల్లత వలెఁ గనఁబడు చున్న దఁట అంత్యాస్థులో జిత్రమువలెఁ గనఁబడుచున్న దఁట: ఇట్టి హృదయంగమోపమానములతో నాకవి సార్వభౌముఁడు రచించెను. అందుచే నీశతక కవిత్వము కమనీయమునకుఁ గాణాచియై యున్నది. ఇందుపమానము లన్నియుఁ గవికులగురువైన కాళిదాస మహాకవిని మఱిపింపఁగలవు. ఈ శతకమును శ్రీకవీంద్రులు క్రీ॥ శ 1914 లో సతీసమేతముగా వారణాసి సందర్శించిన సందర్భమున రచించిరి

*"శ్రీరామ చంద్రశతకమ్" అను పేరు గల యీశత

శ్లో॥ నభో నైల్యసద్రూప్యవచ్చుక్తికాయాం
త్వయీదం జగత్సర్వమధ్యస్థమేవ



కమును, సంస్కృతభాషయందు భుజంగప్రయాతి యను వృత్తములలో విరచించెను ఆకాశము నందు నీలిమయు ముత్తెపుఁ జిప్పయందు వెండియు వలె నీయం దీజగ మంతయు నిమిడియున్నది. నీవు దీని తోడిసంబంధము లేని సచ్చిదానంద మూర్తివై యున్నావు, సముద్రము నందుఁ దరంగమున్నది. తరంగము నందు సముద్రము లేదు. ఆ నిధముగా నీయం దీవిశ్వమున్నది, కానీ యీవిశ్వము నందు లేవు. నీవే ప్రమాణము ప్రమేయము అగు స్వరూపము కలవాఁడ వై యున్నావు, ఈ విశ్వమంతయు నీ గుణములచే నిండియున్నది. సత్త్వ ప్రధానుఁడ వగు నీవు లోకమును రక్షింపుచున్నావు. అను నీభక్తిభావముతో వైరాగ్య ప్రభోధకముగా నుపనిషత్తత్త్వ ప్రకాశము వగు నీ శతకము

అసంగోవవాన్సచ్చిదానందమూర్తి
స్త్వయాపాలనీయావయం రామచంద్ర

శ్లో॥ "తరఙ్గోఽస్తివార్ధౌ. నవార్ధిస్తరఙ్గె
తథావిశ్వమస్తిత్వయి. త్వంసివిశ్వే
త్వమేవ ప్రమాణ ప్రమేయస్వరూపః
కథంవిద్మహేత్వాం ప్రభోరామచంద్ర".

శ్లో॥ త్వమాత్మాః గుణః సర్వదా ఏక ఏవ
త్వయీదం నభోనైల్యవద్విశ్వమస్తి
యతో నావకాశోఽతి ఖిన్నాణయుత్తే
స్తతో నైవజాతం జగద్రామచంద్రః.

విజ్ఞానులకు భక్తులకు నిత్యపారాయణమునకుఁ దగియున్నది.

'వేల్పువంద' అను మతాంక శతకము. ఇదీ సింహాచల స్వామిపైఁ జెప్పఁబడినది. ఇది భక్తికి, లోకజ్ఞతకుఁ గాణాచి. భగవద్గీతకు ననువాదముగా 'వేల్పుమాట' యనుపేరుతో గ్రంథమును రచించెను. దాస కవీంద్రుని అన్నగారు మృత్యు ముఖద్వారమునఁ బడినప్పుడు వారు *మృత్యుంజయ శివస్తోత్రమును జేసిరి.

జగజ్జ్యోతి సువిస్మృతమైన హైందవ సంస్కృతినిఁ గూర్చి రచించిన గ్రంథము. ఇందు నాలుగు ప్రకాశములలోను ముప్పది శీర్షిక లున్నవి. పురుష దైవవిచారము జాగ్రదాద్యవస్థల నిరూ

---

*క॥ భోగములఁ గోర నొల్లము
భోగీశ్వరభూష బ్రతుకు పొడిగించినచో
నీగానము సంతుష్టిగ
బాగుగఁ బ్రకటింప నాసపడితిమిశివా

క॥ జోడుగ నీడఁగఁ దోడుగ
వేడుకతో శ్రుతుల మేళవించుచు నిన్నుం
బాడి కసిఁదీర్పు కొందుము
వేడెద మాజంటఁ బెంచు పెక్కండ్లుశివా

క॥ ఆశ్రితులము నీకీర్తన
కేశ్రమ ప్రాణంబు లనక యెల్లదెసలురా
గాశ్రితములుగాఁ గవగా
మిశ్రలయలఁ బాడఁ జిరము మెలఁగించుశివా.



పణము ప్రకృతి ఆత్మ-చార్వాకమతము - యజ్ఞము-పశుహింస మతసమీకరణము - వర్ణ వ్యవస్థ నాదబ్రహ్మము - అక్షర మహత్త్వము - నాదబిందుకళ - వాగర్థ వైఖరి - చరణసేవ - మున్నగు శీర్షకలున్నవి, ఇందు విశేషజ్ఞానముతో సాంప్రదాయిక సాంఘిక దురాచారాల విశితముగా ఖండింపఁ బడినవి. ఇందుఁ గల వ్యాసములలో యజ్ఞయాగాది కర్మలకోసము గాని జీవహింస పనికిరాదని సహేతుకముగా నిరూపింపఁబడినది. ఇందు వర్ణాశ్రమ ధర్మములలో నాయావర్ణముల వారి హెచ్చు తగ్గుల దృష్టి పనికిరాదని తీవ్రముగా నిందు హెచ్చరింపఁ బడినది. ఇందు మాటిమాటికి శాస్త్రప్రమాణంబు లెన్నెన్నో నిరూపింపఁ బడినవి. తగినయుక్తులతో కొందఱు మీమాంసకుల వాదములను నిందు ఖండింపఁ బడినవి. ప్రాచీనకాలము నందు గావింపఁ బడు సముచిత హోమకర్మాదు లీనాఁడాచరింపఁ బనిలేదని కవీంద్రుఁ డిందు నుద్ఘాటించినారు. ఇందుఁ బరులను సుఖపెట్టి తాను సుఖించటమే మానవుని కర్తవ్యముగా నిరూపించుట ప్రశంసార్హమైనది. ఇట్టి యమూల్యగ్రంథమును రచించిన కవీంద్రుని ప్రతిభ కాంద్రులు కృతజ్ఞతాంజలు లొసఁగ వలసియున్నది.

ద్వితీయ భాగము నందు నలువదినాలుగు శీర్షిక లున్నవి. శబ్దసిద్ధి పంచమశబ్ద మర్యాద అరిషడ్వర్గవైఖరి బుద్ధి స్వరూపము ఆత్మ మున్నగువానిఁ గూర్చి యిందుఁ జర్చింపఁ బడినవి. ఇందు నించుమించుగా భారతీయ ధర్మమునకు సంబంధించిన పరమార్థములన్ని కూలంకషముగాఁ బరిశీలించి తమ సిద్ధాంతము అన్ని

నిష్కర్షగా ప్రకటించినారు. కరుడఁగట్టిన వర్ణాశ్రమాచారములు ప్రాతఁబడిపోయిన కులమతముల హెచ్చుదగ్గులు ప్రాచీనములైన యజ్ఞపశుహింసాది కర్మలు నేఁడనవసరము లని దాస కవీంద్రు లిందుఁబేర్కొనినారు. ఈ జగజ్జ్యోతి శ్రీవారి వేదశాస్త్ర పాండిత్యమునకొకదర్పణమువంటిదని పేర్కొనఁదగును, ఇందుఁ గ్లిష్ట మైనభాషను గాకుండ మృదు వైన భాషన్నుపయోగించుటచే పఠించుటకు సౌకర్యము ఆనందదాయకము ఆసక్తికరముగానున్న దనుట నిస్సందేహము.

దాస కవీంద్రుని, మఱొక గద్యగ్రంథము. వివిధ వ్యాస సంకలితమైనది. వ్యాసపీఠము. ఇందురెండు భాగములు కలవు. పూర్వభాగము నందు మొత్తము పదునారు వ్యాసములు కలవు, వీనిలో గానము యదార్థ రామాయణము హరికథ షెక్స్పియరు కాళిదాసు అనునాలుఁగు వ్యాసములు తప్ప. మిగిలిన పండ్రెండు వ్యాసములు నాటుతెలుఁగుపైఁ గల యభిమానమును తెలుపు చున్నవి. ఇందుఁగల వ్యాసము లన్నియు విమర్శనాత్మకములైనవి, ఉత్తరభాగము నందలి వ్యాసము లన్నియు సృజనాత్మకము లై యున్నవి. ఇవి కవీంద్రుని స్వకపోల కల్పితములు ఇందిఱువదియేడు వ్యాసములున్నవి. గౌరప్పపెండ్లి తప్ప మిగిలిన వ్యాసము లన్నియు మిశ్రమభాష యందు లిఖింపఁబడినవి. ఇందు వాక్యరచన దీర్ఘమై యున్నను పఠించునప్పుడు వీనుల విందుగానే యుండును. ఇందు విషయము లన్నియు హృదయమునకు హత్తుకొనునట్లు దెలుపఁబడినవి. జగత్తులో నిత్యజీవితమున



జరుగుచుండెడి విషయము లన్నిటిని సాకల్యముగా గ్రహించి కవీంద్రుఁ డిందు మనోహరశైలినందుఁ బొందు పఱచి యున్నారనుట నిస్సందేహము

దాస మహాకవీంద్రుల సాహిత్య గ్రంథములు కాక యాయుర్వేదమునకు సంబంధించిన, పరమాద్భుత మైనపరిశోధనగ్రంథము 'మన్కి మిన్కి'. అథర్వణసంహిత కృష్ణయజుర్వేద తైత్తిరీయా రణ్యకము, ఋగ్వేదము, మున్నగువాని పరిశోధించి శ్రమఁజేసివ్రాయఁ బడినదీగ్రంథము.

విష్ణు సహస్రనామ సంకీర్తనకు నచ్చతెలుఁగునఁ బద్యానువాదముగా "వెన్నుని వేయిపేర్ల వినకరి" యను నామమున రచించిరి. ఇందు నాంధ్రకవు లుపయోగింపని యర్ధసమవృత్తముల నుపయోగించిరి. ఈ రచన, మద్భుత మత్యంతానందకరమ్ముగానుండెను.

సారంగధర నాటకముగూడ మహాకవీంద్రు, లద్భుత కథాసంవిధానముతో, హాస్యకరుణాసమ్మిళితముగా రచించిరి.

సహజముగా ననువాదరచన లందుఁ గవిప్రతిభావిశేషంబు లెక్కువగా గోచరింప నవకాశములేదు. అత్యంత సమర్థవంతుఁడగు కవి నిజప్రతిభలందు బ్రయత్నించినను దద్విశేషంబులను దన్మూలకర్తకే చెందుననుట నిశ్చయము. అందుచేత స్వతంత్రరచనలందు నాకవి తన ప్రతిభావిశేషంబులఁ బ్రకటింపఁజేయ నవకాశముండును.

---

Love is a smoke made with the fume sighs
Being purged a fire sparkling in lovers eyes
Being veted. a sea nourished with lovers' tears
What is it else : a madness most discreet
A choking gall. and preseving sweet
(Romeo and Julier)

గీ॥ వలపనఁగ వెచ్చ నూర్పులఁగలిగిన పొగ
కాముకుల కన్నులందునఁగ్రాలునగ్గి
నాయికా నాయకాశ్రుల బ్రబలుకడలి
వెఱ్ఱియున్, జంపఁబెంపఁగ విషమమృతము

O, she doth teach the torches toburn bright
It seems she hangs upon the cheek of night
Like a rick jewel in an Ethips' ear
Beauty too rich for use, for earth too dear



So, shows a snowy dove trooping with crow
As yonder lady our her fellows shows.
(Romeok and Juliet Act I)

శ్లో॥ ఆత్యంతం బ్రజ్వలితుమ బలాశిక్షతేఽఘో ప్రదీపాన్
రాత్రౌ కాశీ శ్రవణ విచల ద్రత్న భూషేనభాతి
సౌందర్యం చాను భవితు మతిశ్రేష్ఠముర్వ్యా అమూల్యం
వాయసౌఘే చరతివరటానత్సభీమండలేసా

గీ॥ చిలుకల కొలికి దివిటీల - వెలుఁగు నేర్పుఁ
గలిగి వజ్రంబు పగిదిఁ జీ - కటివి మెఱయు
నంద మందనత్యధికంబు - నవనికరుదు
కాకులందంచ, యదితోడి - గరితలందు

ఆకవి భావనా పటిమయుఁ, గల్పనాచాతుర్యము, లెల్లెడ ద్యోతకమగు స్వంతత్రకావ్యములే, ప్రశంసార్హము లైనవి. దాన మహాకవీంద్రుని యనువాదపద్ధతి, శ్లాఘనీయమైనది. మూలములోని భావములను జెడనీయకుండ స్వతంత్రరచనమా యనిపించు నట్లొనరించెననుట నిస్సందేహము. ఆంగ్లమహాకవులలో నగ్రగణ్యులైన, షెక్స్పియరు, రోమియో, జూలెట్ మున్నగు వారిరచనలను కవికుల గురువు మహాకవి యగు కాళిదాసు రచనలను, చక్కఁగ నాంధ్రీకరించి వాని యందున్న సొగసులను దేటతెల్లముగా విశదీకరించినాఁడు. ఒక మహాకవి రచనలను నాంధ్రీకరించునప్పుడు సామాన్యముగా నంతటి వ్యక్తియైనఁగాని

వాని నర్థము గావించుకొని తెనిఁగింపునకు జాగరూకత వహించి యుండగలఁడు.

---

శ్లో॥ అధమధు వనితానాం నేత్ర నిర్వేశనీయం
మన సిజతరు పుష్పంరాగ బంధ ప్రవాలమ్
అకృత విధి సర్వాంగీ ణమాకల్ప జాతమ్
విలసిత పదమాద్యం యౌవనం సప్రపేదే॥
(రఘువంశము)

గీ॥ అంతఁ జెలువల కన్గవ లానుకల్లు
చిగురు విల్తుఁడన్ ప్రమాకు పూతగులు తలిరు
తొడ వొడలికెల్లఁ దనకుఁదాఁదోఁచు గడన
హొయలు తొలిపెంకి జవ్వన మొందెనతడు

శ్లో॥ శరీరక్షామాంస్యాదసతి తయితాలింగనసుఖే
భవేత్స్రాసం చక్షుః క్షణమపి నసాదృశ్యత ఇతి
తయా సారంగాక్ష్యాత్వమపి, నకదాచి ద్విరహితం
ప్రసక్తే నిర్వాణే హృదయ పరితాపం వ్రజసికిం
మాలవికాగ్ని మిత్రము

గీ॥ చెలియ కౌఁగిలి దొరకక చిక్కు మేను
నెలఁతఁ గానక కనులు నీరునించు
కాని సుంతయుఁ బాయవు గదకలికిని
డెందమా నీవువలవంతఁ బొందనేల!



ఊహాతీత మైనది ప్రపంచఖ్యాతి జెందిన దగు మేఘ సందేశము నందలి యుత్తర భాగమునఁ గల 'తన్వీశ్యామా' అను శ్లోకమునకు నాంధ్ర సీసమందలిఁ గవీంద్రుఁడు జూపిన ప్రతిభ నిరుపమానము. రఘువంశకుమారసంభవ మేఘసందేశ అభిజ్ఞాన శాకుంతల మాళవికాగ్నిమిత్రాది మహాకావ్యములందు, సహజ సిద్ధముగా నుపమాలంకారములను మనోహరముగాఁ బ్రయోగించిన శ్రీకాళిదాసుమహాకవి వలె శ్రీ నారాయణదాస కవీంద్రుఁడు విందుగాఁ బసందుగాఁ స్వభావ సిద్ధముగా నుపమాలంకారములను ననేక విధములుగాఁ బ్రయోగించి మహాప్రతిభనుజూపెను

హృదయోద్యోగము, మానవ జీవితోల్లాసకర మైనది, శృంగారరసము. భక్తిలో, శృంగారమును, శృంగారము నందున భక్తిని నంపుటీకరించి, తరించిన మహాకవి పోతనామాత్యునివలె దాసమహాకవి శృంగారరసమును జక్కఁగాఁ కనులకుఁ బ్రత్యక్షీకరణశక్తి ప్రసాదిత మగునట్లు వర్ణించు శక్తియు సామర్థ్యము పాండిత్యము లోకదాని కన్న నొకటి మిన్నఁగా నున్నవి.

---

శ్లో॥ తన్వీశ్యామా శిఖరిదశనాపక్వ బింబాధరోష్ఠీ
మధ్యేక్షామా చకిత హరిణీ ప్రేక్షణానిమ్ననాభిః
శ్రోణీ భారాదలసగమనా స్తోకనమ్రాస్తనాభ్యాం
యాతత్రాస్తే యువతి విషయే సృష్టిరాద్యేవధాతుః
(మేఘసందేశము)

సుస్థిరకీర్తిని సంపాదింపఁగల మహత్తర కావ్యములను గవితను రచించి కృతార్థజీవియయినాఁ డనుట నిస్సందేహము భాషా సౌందర్యము నన్నయ కవితవలె ప్రకాశిల్లుచు భావ సౌందర్యము తిక్కన కవితామృతమువలె రాజిల్లుచు వివిధ రూపములలో హృదయమునకు హత్తుకొనునట్లు గవితను వ్రాయఁగల నేర్పు నాపదముల కూర్పు భావములఁ జేర్పు దాస కవీంద్రులకే తగియున్నది. ఏపద్యమైన మఱల నొకసారిఁ జదువుటకు నాసక్తిఁ గలిగించినచో నదేకవిత్వము. అట్టి యాసక్తిఁ గలిఁగించి రంజింపఁ జేసి యనురక్తిఁ వ్యక్తీకరింపఁజేయు

సీ॥ పలచని మైదీఁగఁ బరగెడి నెలనాగ
నడు జవ్వనంబునఁదనరు చామ
సూది పల్చూపుల సొంపగు ముద్దియ
నిండారఁబండిన దొండపండు
నగెడు వాతెఱఁ గల ననఁబోడి సన్నని
కొనుకులెక్కుడి మచ్చెకంటి బెదరు
లేడిచూపుల వన్నెలాడి లోతైన పొ
క్కిలిఁగల్గు చిలుకులకొలికి పిఱుఁదు

గీ॥ బరువుమై నడుచు మెల్లన వంగుసుంత
చన్నుఁగవ, వ్రేఁగుతోడనే యన్నుమిన్న
యలరుచుండెడిఁ జెలువల సలుపఁదలఁచి
నలువ యొనరించు తొలమచ్చు నాఁగనచట



శక్తి దాస మహాకవీంద్రుని కవితయందు బంగారమున ఁగాంతి సహజమైన రీతిగానున్నది. పదాడంబరముతోఁ బరిఢవిల్లు కవిత్వమునకు భావప్రధానమై సర్వలక్షణశోభితమైన కవిత్వమునకుఁ దారతమ్యమును విస్ఫురింజేయునట్టి కవితాసంపద గలిగిన మహాకవి యగుటచే నేతద్గ్రంథము లత్యంత ప్రకాశమానము లధిక ప్రజానురంజకము లతిప్రచార ప్రభావ సంజనకములై యున్నవనుట నిర్వివాదాంశము, అందులకుఁ గారణము దాసకవీంద్రునిఁ గవితాకన్య స్వయముగా వరించినదేకాని వీరుగా దానిని వరింపలేదు. బాల్యమందే యాశుకవితను నేర్చిన వాఁడగుటచే నది పరిపక్వ దశ 'ఇంతింతై వటుఁ డింతై మఱియుఁ దానింతై యన్నట్లు' పొంది యాంధ్రహృదయాంతరాళము లందు సుస్థిర స్థాయిన నిలిచియున్నది.

శ్లో॥ నిత్యంతే బంధుబద్ధస్య తిష్ఠతో భ్రాతృసౌహృదే
ఆర్యమార్గం ప్రపన్నస్య నానుమన్యేతకః పుమాన్.
వాల్మీకి రామాయణము.

ద్వి. ఆనయంబు చుట్టాలయందునఁ దగిలి
తోఁబుట్టువులన్ గూర్మితోఁ జూడఁ గలిగి
తగువారి త్రోవ దిన్నఁగ నడుచు నిన్ను
మగవాఁడెవండు వెంబడిఁ బోవకుండు

శ్లో॥ ఉరసి నిపతి తానాం స్రస్తధమ్మిల్లకానాం
ముకుళిత నయనానాం కించిదున్మీలితానాం

ఉపరి సురత ఖేద స్విన్న గండస్థలానా
మధుర మధువధూనాం భాగ్యవంతః పిబంతి
"భర్తృహరి"

అక్కనవ్రాలి వ్రాలి బుజ నందున(గ్రొమ్ముడి వీడిచిందులన్ ద్రొక్కనగంబు మోడ్పువడు తొంగలిఱెప్పలవిప్పి చెమ్మటల్ తెక్కలఁ గ్రమ్ముచుండ మగ నేతలఁ జొక్కెడి తీఁగెబోండ్లలో దక్కిన మోవిపానకము ద్రావెడు వారెటువంటిధన్యులో.

దాస మహాకవీంద్రులు దమనిజకవితామృతమును ప్రవహింపఁజేసి, సంఘమునకు ప్రాచీన పౌరాణిక గాధలకుఁ ప్రాణమిచ్చిరి. పైనవానికి నుత్తేజమును గలిగించిరి. ఇందులకు దాస కవీంద్రులు భక్తాగ్రగణ్యులగుటయే ప్రధానకారణము. తాము జీవితములో వివిధానుభవములను బొంది వానినిఁ ప్రజానీకమునకు జాటిన సాటిలేని మేటి కవి.

---

"వీడినరైకతో సగము వీడిన కొప్పునరాలు పూలతో
బేడి సమీలకన్గవను వింతగు నిద్దురమబ్బు చొక్కుతో
వీడినసీవి నొక్కకయి వెల్లఁగఁబట్టి మహానుభావనన్
గూడుము ప్రాణముల్ నిలిపి గొబ్బునఁ బ్రోవుము చేదెఁజంపఁగా
గూడద టంచునాడు పలుకున్ వినవాయదినీవెఱుంగవా!
వేడితమిన్పయింబడిన వెట్టఁగఁ గూడినఁ బాపమున్నదే!
కూడుమ టంచునన్ను మునుకొంగున లాగునొయారమైన నీ
జాడలు గంటిఁగాదె! యిఁకఁ జాలదె! స్వర్గము వేఱెయున్నదే!"



సరస శృంగార సాహిత్య చక్రవర్తు లనఁదగు దాస కవీంద్రుఁడు దమ యష్టావధానమున నొకపృచ్ఛక పండితుఁడు "నవవధూవరులను గూర్చియాశువుగాఁ జెప్పు మన నందులకు గవీంద్రుఁడు వారి ప్రథమ హావభావములను వార లొనరించు పనులను ప్రకటించు ప్రేమవిధానములను వివరించి సీసపద్యమున జక్కఁగాఁ దెలిపినారు. ఆపద్య మందలి మాధుర్యము అందుప యోగించిన మృదుపద సముదాయము మనోజ్ఞము అమృత పూరితము నై యున్నది. ప్రేయసినిఁ గూర్చి, మఱొక పండితుఁ డడిగిన సమస్యకు దాసకవీంద్రుఁడు ప్రేమికునకుఁ గల భావములను దేటతెల్ల మగునట్లు విశదీకరించెను. రససిద్ధులైన దాసకవీంద్రుల వాగ్వ్యాపారము కావ్యమార్గానుషంగికము లనుట సత్యేతరము కాదు. అందుచేతనే వారి వివిధభారతి కూడ సర్వ లక్షణ సంశోభితమై యలరారుచున్నది. శృంగారమునందు-భక్తి

---

సన్నపు మోటికల్ గలుగు చక్కని చన్నులఁ బై టఁజారఁగా
చెన్నగు వీణమోపి శ్రుతిఁజేయుచు మెట్టులమర్చి తీగెలన్
క్రొన్నెలవంకలొప్పు కొనగోళ్ళను మీటుచు నీదుచెంత నా
చిన్నన వాద్యగానముల నేఁతఁ దలంచెద భీమశంకరా,

చిగుర కెమ్మోది తేనెలఁ జిందుదాన
గునిసి యాడెడి చక్కనికొప్పుదాన
గండుమీలను బోలు వాల్గనులదాన
మనసు నిన్నెదబాయదేమొ నెలఁతా,

భక్తి రసమునందు - శృంగారము - పూవులోని మకరందము వలె స్వభావసిద్ధముగా నొదిఁగియుండును నమట నిస్సందేహము.

దాసకవీంద్రుని వివిధభారతి మిక్కిలి ప్రశంసనీయమైనది. వివిధసందర్భములలోను, వివిధ విషయములను గూర్చి హృదయంగమముగా విరచించిరి. కవిసార్వభౌమ శ్రీనాథకవి-తెనాలి

---

సీ. పరులకు గనరాని వెరవున నొండొరు
　　　　సొలపునఁ గ్రీఁగంటఁ జూచుకొంట
వంగిలేచుచు బరస్పరము లాఘవమున
　　　　దోసిళ్లఁ దలఁబ్రాలు పోసికొంట
లంకెపడిన చెంగుల నప్పసదిద్రొక్కు-
　　　　దడఁబాటున మిథము దగులుకొంట
మనసులఁ గల్పిన కనుల కన్యోన్యముల్
　　　　జల్వక ప్రపుబుక్కఁ జల్లుకొంట
　జలువసంతపు బిందెలోఁ బరగుమంగ
　రంబు వెదకుచుఁ గెంగేల రాచుకొంట
　మొలకనవ్వులు నవ్వుచు ముద్దుగొంట
　నవవధూవర చేష్ట లందములపంట.

వలపుల మీరిమీరి నునువాతెఱ తేనియలాని యానుగు
బ్బలనెద గ్రుమ్మిగ్రుమ్మి పలుభంగుల ముద్దుల పెట్టిపెట్టి నే
వలచిన వన్నెకాఁడ యిఁక వద్దుర జాగని పైకిలాగు విన్
దలఁచిన గుండెఝల్లు మనితల్లడ మంధుఁగ్గజే తల్లోదరీ



రామకృష్ణకవి మున్నగువారు శృంగారరసమును, సద్యోహృద్యముగను, రసజ్ఞవేద్యముగను, దను తమ పద్యగద్యము లందుఁ గూర్చిరి. అట్లే దాసకవీంద్రుడు దమ రచనలందు సౌందర్యానురాగ శృంగారరసములుధ్వనించునట్లు, పద్యరచనమును గావించినారు. అలంకారములను గూర్చుటయందు నాకవీంద్రుఁడు జూపిన శ్రద్ధ యనన్య సామాన్యము. కవితారచనలోనుపమ కధికప్రాచుర్యమును జూపినాఁడు. "ఉపమా అదిభట్టస్య" అను కీర్తికిఁ గవీంద్రులు దోహదమైరి.

దాసమహాకవి రచనాశైలి మృదుమధురమైనది. వారు నిరుపమానమాధుర్యమును స్వచ్ఛమైన తెలుఁగు నందే కాక సంస్కృత మందును గూర్పఁగల నేర్పుఁగలవారు. ఎంత విస్మృతమైనవిషయమును గూడఁ జక్కని చిక్కని తెలుఁగు నందుఁ గూడ లిఖింపఁగల సాటిలేని మేటి నేర్పరి.

---

"ధనమారాదు దురాశపోదు పరతత్వజ్ఞాన మాలేదు కృ
ష్ణునియం దామది నిల్వఁబోదు సుమబాణున్ నోఁగారాదు ని
న్నెనయన్ లోకములోన వాదు విరహంబిట్లుండఁగా నీదు పా
వనవంశంబు స్వతంత్ర మీదు చెలియా వాంఛల్‌దుదిన్ ముట్టునే
కోరిక దీరదాయె నినుగొబ్బునఁ జూడఁగ దూరమాయె నీ
వారికి భారమాయె సుమబాణుని వైరము ఘోరమాయె నీ
నేరపు నేరమాయె మఱినిందలు నాగులు నూరులాయె నా
పేరున లోపమాయెఁ గద భీతమృగాక్షి యికేఁమి సేయుదున్!

ప్రశంసాపూర్వకమైన వ్యక్తిత్వము, దాసకవీంద్రుని కవిత్వమందు వ్యక్తమగు చుండును. ఒక్కొక్క విషయమును సమగ్రముగా బరిశీలించినచో వారి నిశితప్రజ్ఞ వివిధగ్రంథ పరిశీలనము తేటతెల్లమగును.

---

(వేసవి)

"కాలువ కంపులన్ బరుగు గాడుపు లెల్లెడఁ దేఖ్ముకట్టి గ
గ్గోలుగ నేడ్చునేడుపులు కుక్కల వేటలు రేగువిఱూచులు పొక్కు పుండునున్
ప్రేలెడి సోదెబోచులును రేగువిఱూచులు పొక్కుపుండ్లునున్
గాలెడి నిండ్లుగగ్గి నరకంబయి వేసవి వచ్చెనిచ్చటన్
"దంభపురప్రహసనము"

గీ॥ చెలఁగి, తలిదండ్రుల యభీష్టములను దీర్చు
పుత్రులకు, నిశ్చయంబుగఁ బొందరాని
పదవు లుండునె! ధరణిలోపల సమస్త
జనులకుం బిత్రృభక్తిసాధనంబు (భీష్మచరిత్ర)

గీ॥ తమకు లాభ మేదియుఁదలపోయ కెంతయుఁ
బరులకొరకుఁ బాటు పడుచునున్న
పిన్నవారి కైనఁ బేదలకైనను
మంచిచెడ్డఁ దెలుప మనసె సాక్షి



# హరికథా సాహిత్యము

ఆట - పాట - మాట - మిక్కిలి చక్కని శ్రుతిఁ గొన్న సాహిత్యరూపము యక్షగానము, అట్టి యక్ష గానములను శ్రీ ఆనాదాసకవీంద్రులు మనోజ్ఞముగా రచించిరి. వానికి హరికథలను నామ మొసంగి నూత్నతేజో తేజములను నుత్కంఠోన్నత స్థానములను మానవహృదయాంతర్నాళములందు సుస్థిరస్థానము నొసంగిన మహనీయులు, అంబరీష చరిత్రము- జానకీశపథము - మార్కండేయ చరిత్రము - హరిశ్చంద్రోపాఖ్యానము భీష్మచరిత్రము - ప్రహ్లాదచరిత్రము - గజేంద్ర మోక్షము - సావిత్రీ చరిత్రము - యథార్థ రామాయణము - మున్నగు హరికథలను రచించిన మహానుభావుఁడు. ఆ హరికథలు - వారి బహుముఖపాండిత్యమును - వెల్లడిఁ జేయుచున్నవి. తద్రచనా పాటవము సాటిలేనిదయ్యెను - నల్లేరు మీఁదబండినడకవలెఁ దత్ప్రతిభ - హరికథలందు నభంగతరంగములవలెఁబరవళ్లు దొక్కుచుండుననుట విస్సందేహము, అందుచే నవి తెలుఁగునాట బహుళ ప్రచారమును గలిగియున్నవి.

---

సీ॥ పసుల జన్నమునఁ పంపఁగ నేలనాకలి
గొన్నభూతముల కన్నమిడుఁడు
నోరు నొవ్వఁగ వేద పారాయణము లేని
నందటి మ్రోల సత్యము వలుకుడు

దాసకవీంద్రులు ప్రజలకు నీతిబోధకములై యాదర్శప్రాయము లైన పురాణగాథలను దీసికొని యక్షగానరూపములుగా రచించిరి. వారు ముఖ్యముగా భారత భాగవత రామాయణములను మూఁడు పురాణ గాథలను గ్రహించి కీర్తనలు పద్యములు వచనములు గూర్చి మనోహరముగా రచించిరి. భాగవత, మాముష్మికమును భారతమును నైహికమును దెలుపుననియు మఱియు భాగవత ముద్రేక మానందసంధానకర మవి కవీంద్రుల యభిప్రాయము. అందుచేతనే భాగవత మందలి ధ్రువచరిత్రము గజేంద్రమోక్షము - అంబరీషచరిత్రము రుక్మిణీకళ్యాణము - మున్నగు వానిని గ్రహించి - భక్తిరస ముట్టి పడునట్లు రచించిరి. వానివి స్వకపోలకల్పితము లైన భావములతోను, స్వీయ పదములతోను, కల్పనలతోను, స్వతంత్రరచనలుగా విరచించిరి. ప్రహ్లాదచరిత్రము భాగవతము నుండియే తీసికొని పద్యగద్యాత్మ

---

తీర్థయాత్రల దప్పి తిరుగులాడఁగనేల
నార్తుల కెల్ల సహాయపడుఁడు
సన్న్యాసి భిక్షనెంచగనేల మనతోటి
పాటివారలకునై పాటుఁబడుఁడు

---

గీ॥ ఎందు కిఁకవేయిమాట లీయిలను సర్వ
జనుల కుపకారముగ నడువని మనుజుఁడు
జపతపంబులు విష్టలు సలుపు టెల్ల
బూడిదంబోయు పన్నీటి పోల్కి-కాదె (భీష్మచరిత్ర)



కముగా ప్రత్యేక ప్రబంధముగా రచించిరి. శ్రీకృష్ణ కథనంతయు మూఁడు కథలుగా) (శ్రీకృష్ణ జననము-పితృబంధమోచనము-ధర్మ నంస్థాపనము) విరచించెను. భారతము నందు హరికథ కుపయోగించు. భీష్మచరిత్రము-సావిత్రి చరిత్రములను గ్రహించి రచించిరి, సావిత్రీ చరిత్రము, మార్కండేయ చరిత్ర, గౌరప్ప పెండ్లి - మఱికొన్ని పురాణంబులనుండి గ్రహించిరి.

---

"ఎన్నఁగఁ గోర నవ్వు లభించును సంపద జాతిబొమ్మకున్
సన్నుత పూజమాడ్కి పెలుచందను గోరినరాదులచ్చిబల్
చన్నులు మాచకమ్మకటు చావకతీరని గూనివంపులా
గున్నది స్వేచ్ఛలేని బ్రతుకో జనులార యిఁకేటి సౌఖ్యముల్
(సావిత్రీ చరిత్రము)

"పరమార్థ మెటు చిక్కు-దంభము సేయ
రంగు బాగాజుట్టి దొంగలంచముపట్టి
పొంగుచు మీసలు పెనవెట్టి
ఎంగిలైన కాకి కిడఁబోక తినగ్రొవ్వి
వెంగలి సంపదలంగొనువారికి--
(హరిశ్చంద్రోపాఖ్యానము)

సీ॥ సద్యశ్రుతి స్మృతి శాస్త్రంబులకుమూల
కందమై విఖ్యాతిఁ జెందె నెద్ది?
సంతత జపతపస్స్వాధ్యాయ సత్యవ్ర
తావనీ సురులచే నలరె నెద్ది?

మహాకవీంద్రులకు భాగవతమనిన నత్యంతాభిమాన మగుటచే, నమ్మహా కవీంద్రుని కవితలోని సొగసులు అందలి పదగుంఫములిమ్మహా కవీంద్రుని కవిత యందు నటనటఁ గనఁ బడుచుండును. గజేంద్ర మోక్షణమందలి సహజ పాండిత్య - పోతనామాత్యుఁ డెంతటి నిపుణతను గనఁబఱచెనో, యీ సహజ

---

స్వచ్ఛంద రాజ్య సంపద గల్గిపావన
చరితులౌ నృపతుల వరలె నెద్దీ!
గణియించుటకు నశక్యంబైన కాలము
నుండి నాగరికత నిండెనెద్దీ!

గీ॥ మొదట దేవుని యున్కినీ భూజనముల
నందఱకు నెద్దిఁ దెల్పెనో యట్టిభరత
ఖండమునఁ జెట్టు చచ్చెడి కాలమునకు
ముఱుగు పిందెలవలెనిప్డు పుట్టెజనము. "హరిశ్చంద్ర"

సీ॥ జపము భిక్షయుఁ దపస్స్వాధ్యాయములను మాని
బానిసగాఁగోరు బ్రాహ్మణుండు
పరులెత్తి యిచ్చిన భరణముల్ మ్రింగుచు
శౌర్యముల్ దొలఁగిన క్షత్రియుండు
బ్రాందిని దోడుగా భక్షించు బ్రాహ్మణ
బ్రౌపెసర్లచే వీపు ముక్కజూచి
ముసలిముద్దకుఁగడు బసిపాపకర్థపుం
బేరాసతోఁజేయు పెండ్లి సూచి



పాండిత్య - దాస మహాకవీంద్రుఁడుగా - రంతే నిపుణతను బ్రద ర్శించిరి. ఇందు దశావతారములను నత్యద్భుతముగా సృష్టిక్రమ ముగా వర్ణించిరి.

కథలకు వీలయినచోట సరసకల్పనలఁ జేర్చి పెంచి వ్రాయఁ బడుటచే నివికూడ స్వతంత్ర రచన లని చెప్పఁ దగును. ఒక్కొక్కచోటఁ బురాణకథ మార్చి వింతసొగసును జేకూర్చిరి. అంబరీష చరిత్రలో గోవర్ధనోద్ధారణము - బ్రహ్మగోపుల గోపా లుర మాయ మొనరించుట పార్వతీ శివులు జగన్మోహనావతార మును జూచి యుత్సాహపడుట యనునీమూఁడు కథలు భాగవత మందక్కడక్కడఁ జెప్పఁబడినవి. మహాకవీంద్రులచే నీ మూఁడు కథలును నంబరీషోపాఖ్యానము నందు సందర్భౌచిత్యమును గలిగి యిందుఁ బొందుఁ బఱుపఁ బడినవి. వర్షాధి దేవతనని మహేం ద్రుఁడు - మన్మథ విజేతననిపరమేశ్వరుఁడు లోకస్రష్ట నని

---

గీ॥ ఎట్లు నైఁచుచున్నావొ యింతజాలి
మాలి పాపాటవీదవకేలి యోగి
భావిత గుణాళి త్రైలోక్య దేవమౌళి
యాశ్రితావనికేళియయ్య వనమాలి

గీ॥ బలయుతుని శూలజాడ్యంబు పట్టినట్లు
ఉత్తముని దుష్టకామిని యొడిసినట్లు
ధ్యానవంతుని నిద్దురఁ బూనినట్లు
సమదగజమును మొసలి వాచాచిపట్టె. గజేంద్రమోక్షము,

విరించియు గర్వించి, తుదకు - శ్రీమహావిష్ణువుచేతఁ బరాభ వింపఁ బడి తమ తమ గర్వములను విడనాడిన కథలను తపో గర్వమున నిష్కారణముగా నంబరీషుని బాధించిన దుర్వాసుని కెఱఁగించి శ్రీహరినే శరణు వేడు మని కోరిరి. ఇట్టి యనల్ప కల్పన గావించిన, మహా కవీంద్రుని సంకల్ప మద్వితీయముగదా!

వాల్మీకి రామాయణమునకుఁ గొలఁది - మార్పులు - చేసి - యథార్థ రామాయణమును రచించెను. ఇంద హల్యాశాప

---

సీ॥ ధనముల నాశించి తగని బేరము చెప్పు
వర్తకుని నోటికి వడఁకి వడఁకి
దీనుల కొంపలు దీసెడు ప్లీడరు
కూట సాక్ష్యంబులఁ గుందికుంది
మిగుల లంచము మేసి నెగడెడు నుద్యోగి
కలమునఁ గన్నీరు కార్చికార్చి
సోమరిపోతులై సోదెలు పల్కెడి
మతగురువుల చెంత మాడి మాడి

గీ॥ ఎట్టులుంటివి, చెప్పుమా యెల్లవేద
సరసులం బొల్పురాయంచ సాధుమైత్రి
... ... ... ...
సువ్రతమ్ముల ముఖ్యంబు సూనృతంబు

హరిశ్చంద్రోపాఖ్యానము



మోచనముపట్ల-వాలివధ సందర్భమునను సీతాలక్ష్మణుల సంవాద విషయమునందు నింక వివిధ విషయములందుఁగూడ భిన్నముగా రచించి పండితామోదమునకుఁ బాత్రుఁడై, కృతకృత్యుఁడయ్యెను. శ్రీరామాయణా విర్భవమునకు నిందు మూడుకారణములను జూపి నారు. మొదటిది, జయవిజయశాపము దశరథునకు మునికుమారుని శాపము - శ్రీమహావిష్ణువునకు నారదశాపము : ఇందు మొదటి రెండు శాపము లందఱెఱిగినవే! మూఁడవశాప, మేగ్రంథ మందలిదో లేక కవీంద్రుఁడే కల్పించెనో యనూహ్యము. అహల్యా శాపవిమోచనా నంతరము, విశ్వామిత్రుఁడు శ్రీరాము నకుఁ గావించిన తత్త్వబోధ - యతి మనోహర ఘట్టము - ప్రశంసనీయమైనది. సావిత్రీ చరితము భారతములో ఎఱ్ఱాప్రెగ్గడ రచితారణ్య పర్వశేషమందలిది. అందున్న స్వల్పకథను గ్రహించి

---

చం. చనిచనికాంచె నుల్లసిత చారుపయోరుహసన్మరందభా
దన మద మత్త బంభర వితానరవ ప్రతిమానగానమా
ననియమితోరు భంగపటనాద మృదంగరవానుకూల చ
క్ర వివహా రావతాళరవరమ్యవిశాల సరః ప్రధానమున్.

ఒకలెల్లన్ వడకంగఁ జొచ్చెనిఁకఁగాలూనంగ లేనియ్యెడన్
గడుమూర్ఛన్ స్మృతిఁదప్పెఁ బ్రాణములు నాకంఠములోఁ దల్లిడి.
లైదురా, వచ్చిదిరానఁ బ్రోవర! హరీ! యాశా! హృషీకేశ! నా
జడుపుం దీర్పర ప్రాణముల్ నిలిపి కృష్ణా! వేగనన్బ్రోవరా!

గజేంద్ర మోక్షణము"

దానికి మనోహర మైన కల్పనా విశేషములతో మధురభావ పరంపరలతో నశేషధీసంపన్నతతో గవీంద్రులు రచించిన హరికథా రత్నము ఇందు సావిత్రీస్వప్నము సత్యవంతుని దయార్ద్రి హృదయము చిత్రించు నాత్మగత భావములు రమ్యాతి రమ్యములై సామ్యము లేనివై హృదయంగమములై యున్నవి. మహారణ్యము నందు సత్యవంతుఁడు లేడినొక దానిని వ్యాఘ్రము నుండి కాపాడి లేఁబచ్చిక లందు మేపి విశ్రాంతి నొసంగి పరమేశ్వరు కృప తనకుఁ బ్రసాద మైన విధమున కానంద

---

సీ. నంజుడుకలనైన నమలక యుండుట
పలుమార్లు నీపేరు దలఁచుకొనుట
లాఁతియిల్లాండ్రపై లలిఁగొనకుండుట
పొన్ను నీదద్దడంబునకతుకుట
తనకొఱకై కల్లనఁ బోవకుండు టె
న్నాళ్లైన నీతిరునాళ్ళఁ గనుట
ఇరుగుపొరుగులకు పెబ్బర సల్పకుండుట
నీకు గుర్జాల కానికల విడుట,

గీ॥ "తనకుఁ గల్గిన దానితోఁ – దన్విఁగొనుట
నీకు విల్వఁదోపిచ్చుట నిక్కువముగ
మంచి నడువడిలేక నిగ్గాంచు టెట్లు
రెంటఁద్రాగుఁడు తిండి మెట్టంబువేల్ప" "వేల్పువంద"



పడుచు దయకన్న వేఱొకటి మిన్న లేదని సృష్టియందే భూతంబుల కన్యోన్యంబు లాహారంబు. అని తెలుపఁబడినది.

హరికథారత్నములందు వారెచనెడ రచింపుచుండు దీర్ఘ వచనము లర్థాలంకార బంధురములై యనుప్రాసాది శబ్దాలంకారముల కాలవాలములై వినువారికి వీనులవిందుఁ జేకూర్చుచుండును. పద్యరచనము మృదుమధుర పదప్రయోగము నవరస భరితమునై యుండును. స్వభావసిద్ధము లైన వర్ణనలు భావగంభీరములునై యా దృశ్యముల పఠితలకు సాక్షాత్కరింపఁజేయఁ జాలియుండును. దాసకవీంద్రులకుఁ దెనుఁగుభాష యందలి తియ్యఁదనముపై మక్కువ యెక్కువనుట నిక్కము. అందుచేతనే వారు తమరచనలను బెక్కచ్చ తెలుగుననే రచించి రనుట నిర్వివాదంశము.

---

బడి : తెల్లము గానచ్చతెలుఁగుతోఁ జెప్పు
మేలబల్కిన్ జేయు నెగ్గెఱింగియును
మానిసి నాయరమర తీర్పు మప్ప
అనఁ బిన్ననవ్వున ననె నల్లవేల్పు
కడముట్టవెట్టి, తోకలితలచుట్టు
మనుచునట్టు లడిగెదోయబ్బాయి ! నీకుఁ
జెవిపట్టలేదు, నాచెప్పినమాట
మఱువకు సరిగ నీ మది నిల్పుకొనుము
కోరికెతప్ప నీకుఁ బగవాఁడెవఁడు
నీ రూపుకోరిక నీకు నీవెదిరి. "వేల్పుమాట".

హరికథా రచనలందు మృదుమధురముగా స్వభావసిద్ధముగా నలంకారములను జాతీయములను గూడఁ గూర్చి రచించుటయందుదాసకవీంద్రులకీర్తియతులితమైనది. శృంగార రస వర్ణనములందుఁ గూడ వారసమాన విహారమొనరింతురు. భావములందుఁ గూడ నపూర్వకల్పనము లండే వారిదృష్టి ఆ కారణమున

సీ. "నీజడఁజూచినన్ - జిలువతేఁడుస్ఫురించె
రంగదుత్తుంగ సారంగ గమన
నీనెన్నుదురుఁ గన్న - నెలవంక తలఁపయ్యె
రాజితభీతసారంగ నయన !
నీవళు లరయ గం - గావీచికలు దోఁచె
రమ్యవిలోల సారంగ చికుర
నీకొనుఁ గాంచినన్ - నిన్ను జ్ఞప్తికిఁదేల్చె
రమణీయ బాలసారంగ పాణి

గీ. చెలువమునఁ గొంత పోలిక - గలదు, మనకుఁ
గాని యిసుమంత యైన నామానసంబు
మాడ్కి నీమనసున్న మన్మథుని పీడ
నన్ను నోఁకుట యెట్టులో సన్నుతాంగి."

"క్రొవ్వాడి వాల్చూపు గాలంబులందగులు కొన్నామనో
మీనంబున్ జప్పునంబైకి నాగితన మిటారంపు !
గబ్బిగుబ్బ జక్కవలకున్ విందొనర్చి జారిపోనీయనట్లు
వయారంబుగఁ బయ్యెదన్ సద్ది" అంబరీష చరిత్రము.



నితరకవుల గ్రంథము లందుఁ గల మనోజ్ఞ భావంబులను గ్రహించి వానిని స్వకపోలకల్పితము లనఁజేసి లిఖింపఁగల నిశితప్రజ్ఞ వీరియందు నాకుమఋంగుపిందెవలె నిబిడీకృతమై యున్నది: జాతీయ పదములును వినూత్న భావములును మేఘమునందు విద్యుల్లత వలె మెఱయుచుండు ననుట స్పష్టము. వీరి కథారచనము లందుఁగూడ రసానుగుణశైలి యుత్తమ భావస్ఫోరకజాతీయపద సంఘటనము వర్ణస్వరూప సాక్షాత్కారితము మున్నగు మహాలక్షణములు తేనెయందలితీపివలె నిమిడి యుండును. అవి యన్నియుఁ బెక్కురకు దుఃఖాంత సుఖాంతములుగానే యుండును. దాసకవీంద్రులు నిజజీవితమును లోకమున భక్తి ప్రబోధము కొఱకం కితమును గావింప దలఁచిన వారగుటచేఁ దమగ్రంథములందంతట కాంతాసమితములుగ ప్రబోధము లెల్ల వితియఁబోసె ననుట దేటతెల్లము. లోకపరిశీలన - మెంత - సునిశిత మైనదో - వారిపద్యము లందుఁ గానఁదగును.

గీ. "సహజ పాండిత్యమునఁ గావ్యసరణిఁజేసి
నెల్లరి హితంబు గోరెద నేకదంత
నేను నిన్నేది యడుగను గావినీదు
నంబికొండయ్య సాయమే నాకుఁజాలు".

"తొయ్యలి నెమ్మోము పున్నమ చందరు
త్రోసి రాజనిపించురా
వయ్యారి కొప్పు చమరీ మృగవాలము
పైకోఁత కోయించురా ! అంబరీష చరిత్రము

"పేదలకు సంతానముండును. కోటీశ్వరుని భార్య నిస్సంతతిఁ గలిగియుండును. సమర్థుఁడైన, సౌందర్యవిహీనుని మందయానఁ బొందు గోరదు. సుందరవంతునికి లోన హంగుండదు. ఆరోగ్యహీనులకు మృష్టాన్నము గలిగియుండును, తిననేర్చిన వారికెప్పుడు దిండియుండదు. వదాన్యునికడ సంపదఁ గలిగియుండదు. లుబ్ధుని లక్ష్మి మనసారఁ బ్రేమించును. ఉన్నవార లున్న దని లేనివారు లేదని శోకింతురు. ఈలోక మంతయు దుఃఖమయముగదా" యని వాకొనిరి. ఇందు "లోకం శోక

---

సీ. నీలికొండన్ బోలు నెమ్మేనఁ దొగరుదు
పవటి సంజకెంజాయ పగిది మెఱయ
స్వప్రతాపానలజ్వాల లనంగ నౌ
దలమీఱి నల్లజడలు వెలుంగ
నఖిల (జగజ్జయ) ప్రాప్తకీర్త్యంకురా
కారత నెలవంక కోరలలర
నోలి ముప్పిరిఁగొన్న యుక్కు దూలమ్ముల
నఁదగు చేతులఁ బెద్దగద చెలంగ

ధరణి యడుగుల కదర నమరుల బెదర
దిక్కులన్ గెల్చి వచ్చెద దీవనలిడు
మన్న యనినాకు మ్రొక్కి స్వర్ణాక్షుఁ డేఁగె
ననుజువిన్ మళ్ళి గననోచ నైతినకట !

"అంబరీష చరిత్రము"



హతంచ సమస్తం" అను శ్రీశంకర భగవత్పాద సూక్తికిది వివరణము. ఇందుఁ జెప్పఁబడిన విషయము లన్నియు యథార్థంబులైనవే, యయినప్పటికి నెల్లర మనస్సులకు హత్తుకొనునట్లు హాస్యపూరితముగాఁ జెప్పబడినవి.

బ్రాహ్మణాది చాతుర్వర్ణముల వారి నిజధర్మముల పై భారతదేశాతిశయము నాధారపడియున్నదని వానినివిడనాఁడి బాహ్యవేషములమాత్ర మవలంబించి వారు నిర్వీర్యులగుటచే దేశము వినాశకరమైనదని హరికథలందుఁ బ్రబోధించినారు, ఉద్యోగులు

---

సీ॥ రాలనీ, చుక్కలు కూలనీ, కులగిరు
లిలఁ గ్రుంగనీ - వార్ధులింకిపోనీ
ఆకస్మికముగ సూర్యాచంద్రముల్ గతుల్
దప్పనీ - జగమెల్లఁ దల్లడిలనీ
పిడుగులుగురియనీ పెటిల్ బ్రహ్మాండముల్
పేలాల పోలికం బేలిపడని
ప్రళయము పుట్టనీ - భైరవుండు త్రిశూల
ధారుఁడై ఫాలనేత్రము తెరువని

గీ॥ యేదియెట్లనఁ గాని యొక్కింతయైన
నా ప్రతినఁ దప్పిపోవ నమ్మవలయు
నఖిలపావని నా తల్లి యయ్యేనేని
ధర్మ మెప్పుడు నా తండ్రి తప్పఁడేని "భీష్మచరిత్ర"

"వన్నెఁగల పాగాను జుట్టికొని - లంచములను బట్టుకొనుచు మీసములను మెలవేయుచు గాకికి నెంగిలికూడైన నీయకుండెద రని సర్వశాస్త్రపురాణాదులకు మూలమై తపోదానాదుల కాలవాలమై పవిత్ర చరిత్రులైన భూకళత్రులకు స్థానమై యాధ్యాత్మ చింతనలకు సంస్థానమై భక్తి రక్తి సక్తి ముక్తి—భుక్తులకు నాస్థానమైన మనదేశమున బరదేశావ్యామోహ పిశాచి—తాండవించుచున్న దని యాందులకు భారతమాత వేఁడి కన్నీటిధార చిమ్మెలై చిదుపలై జాలై తరంగములై ప్రవహించుట యెంతో శోచనీయమని వారు హరికథ లందు మనస్సులు

సీ॥ విరిగెడు నరదము లొతిగెడి గుఱ్ఱముల్

దెగివడు సిడములు-ద్రెళ్ళుకరులు

బంతుల వలెఁ ద్రెళ్ల చటులశిరంబులు

మొత్తమ్ములై యాడు మొండెములును

కొడియగు శస్త్రాస్త్రములు మూలఁబడిన సా

రథులు మూర్ఛిల్లిన రథికవరులు

ఘనరాశులౌమాంసఖండము లేఱుల

సొబగునఁ బాఱెడు శోణితంబు

గీ॥ గలుగునట్టుల పాండవబలము ద్రుంచు

భీష్మవిక్రమముం జూచి బీరమెడలి

యున్నయర్జునుఁ బరికించి వెన్నుఁడపుడు

తలనుఁ బంకించి యిట్లనె దాల్మిఁ దొరఁగి" భీష్మచరిత్రము



హత్తునట్లు తెలిపెడివారు, నేటి ప్రభావపరిస్థితులను జూచి భగవంతుఁడు మిన్నకున్నాఁడని మిన్నఁగా ఖిన్నపడినారు.

చరాచర భూయిష్ఠమైన లోక మంతయు 'సత్యమేవ జయతే' యనుజయశీలమగు సత్యము కూడఁ గళంకిత మగుచున్న

సీ॥ ననుఁగని గర్వించు నాయమ్మ లావింత

సంతుష్టిఁ బొందిన జనకుమద్దు

పెన్నిధివలె ననుఁ గన్నారఁ జూచిన

యగ్రజన్ముల పొంగునాడు తోడు

జాలితోఁ జూచిన జట్టుదారులు ముద

మందినకోవిదు లలరుకులము

ముఱ్ఱుపాల్సేపుచు మొదవునాకెడు లేగ

మేటి చదువు కొల్వు మిద్దెటిల్లు

గీ॥ పొలములుం దోటలు - జేతిపుస్తకమ్ము

నిన్నుఁ బాడెడు వీణియ - నీలకంఠ

అనవరతమును నాకుంచి - కనికరించి

కాలపాశంబు విడిపించి - కావుమయ్య.

"మార్కండేయ చరిత్ర"

గీ॥ ఎవఁడు ప్రభువనఁదగిన వాఁడెవని యిచ్ఛ

కడ్డులేకుండు, నెవఁడు సత్య స్వరూపుఁ

డాది కారణ మెవ్వాఁడి - యఖిలమునకు

నట్టి సర్వేశు నద్గురు - నాశ్రయింతు

"మార్కండేయ చరిత్ర"

దని వాపోవుచు సేవావృత్తి శ్వవృత్తిఁ గావునఁ గుక్షింభరిత్వ మునకు నెటులో దాని నవలంబించిన వాఁడును, న్యాయముతోఁ బ్రవర్తింపవలెనని తననామంబును సార్థకపఱచుకొనఁదగు న్యాయవాదియుఁ బదులకుఁ జేతనైనంత యుపకార మొనరించి సత్ప్రవర్తన మందు సంచరింపవలెనని, మహోద్యోగియు మహాగర్వమునఁ దిరుగుట మహాపాపమని వారు హరికథారచన లందు మెల్ల మెల్లఁగాఁ జల్లఁజల్లఁగా జీవాట్లనిడిరి. ఎంతటి మనోధైర్య ప్రవృత్తిఁ గలవారో యీప్రబోధము లందు సులభముగా దేటతెల్లమగును. ప్రజలందుఁ గల మాలిన్యమును గడంగి భక్తిని వారి మనస్సులందు స్థాపించుట కొఱకు వారు గావించిన యమూల్య సందేశ సద్భావములు సర్వే సర్వత్రా సంస్తోత్రార్హము లైనవి.

---

"మర్మంబెద్దియు లేని మానవులకున్ బల్వాదుఁ బుట్టింపుచున్
ధర్మస్థానములోన వారి దర్శనమున్ వ్యర్థంబు గావింపుచున్
దుర్మార్గంబున న్యాయవాది మిషనెంతో కూటసాక్ష్యంబులున్
నిర్మాణించెడి వారినాలుకలు ఖండింపింతు బాపోజులన్.
"సావిత్రీ చరిత్రము"

"పాలకులు దమపెట్టు జీవనముకన్న
రెండురెట్టులు గుఱ్ఱంపు బండి కొఱకు
సానిపాపకు మఱియు సీసాల కొఱకు
విచ్చు నుద్యోగికిఁ గప్పెచ్చు వచ్చుటెట్లు ?
(మార్కండేయ చరిత్రము)



అందుచేతనే వీనికి యక్షగానప్రబంధము లనిపేర్కొనఁ దగును. వీని యందు సాంద్రప్రబంధంబు లందున్న ఉత్పలమాల చంపక శార్దూలము మత్తేభము లను వృత్తము లను దఱచుగాఁ బ్రయోగించి యున్నారు. మత్తకోకిల తరళ లయగ్రాహి స్రగ్విణి తోటకము మంగళమహశ్రీ మాలిని పంచామరము మున్నగు వృత్తములను ప్రబంధముల వలెఁ బ్రయోగించిరి. కందము సీసము తేటగీతి ఆటవెలఁది ద్విపద మంజరి తరువోజ రగడ మున్నగు జాత్యుపజాతి పద్యములను వాడియున్నారు.

---

సీ॥ ఎఱుక దొఱంగి నక్తీలల యుండెదవు స
      ర్వజ్ఞుడ వయ్యుఁ బావన చరిత్ర
యదఁకువఁ జూపెదేలా త్రిలోకైక వీ
      రాగ్రణీ వయ్యు సత్యప్రతిజ్ఞ
అర్థి విధంబున నగపడె దేలాస
      మస్తేశ్వరుఁడవయ్యు నార్తపోష
బతిమాలెదేల నీభటుల జగన్నియా
      మకుఁడ నీవయ్యు ధర్మస్వరూప

గీ॥ జాతినాతిగఁ జేసిన రామచంద్ర
యెఱుఁగ శక్యమె నీతత్త్వ మినకులేంద్ర
సాధు సంరక్ష జానకీ స్వాంతచోర
భక్తమందార భవదూర పరమపురుష
"యదార్థ రామాయణము"

మాత్రాచ్ఛందజన్య మైన గేయములను మార్కండేయ సావిత్రీ చరిత్ర అందుఁ బ్రయోగింపఁబడినవి. ఇందుఁగల పద్యగద్యచూర్ణి కాదులు గాన మొనరింపవలసినదేకాని వేఱువిధమున పఠియింపఁ దగినవి కావు. అందుపయోగించిన ప్రతిగేయము తుదియందు గథార్థములకు - భంగము లేకుండ రాగనామంబును దెలిపిరి. వీరు మాత్రాకాలమును దాళమునకు సరియగునట్లు సాహిత్యము నకుఁ బ్రాధాన్యము గలుగునట్లు గీ_ర్తనలు విశిష్టస్థాయిని రచించి నారు. యతిప్రాసాది ఛందోనిబంధనములను బాటించడమే కాక యౌచిత్యమును ననుసరించి యనుప్రాసలు యంత్యప్రాసలు స్వేచ్ఛగాఁ బ్రయోగించిరి. అందుచేతఁ బండితకవీంద్ర కృత మైన కీ_ర్తన పద్య గద్యము లతిరంజకములై పండితపామరజన రంజకములై యున్నవి. మఱియు నివియెల్ల రూపలక్షణ మాంధ్రప్రబంధ లక్షణములు గలిగియుండుడచేత యక్షగాన ప్రబంధము లని పేరొందినవి.

---

సీ॥ కలవోవ గష్టముల్ దొలఁగిన యట్టుల
నప్పుఁదేలిన నూపిరాడనట్లు -
పెనునగాధము దాటివెల్లడిఁ గనునట్లు
చెదిరినసిరిమళ్ళి చేరినట్లు
సతతశంతిమ విస్పష్టంబునై నట్లు
మూర్ఛదేరినఁ దెల్వి మొనయునట్లు -
ఆసవిడుచు వర్ణమది యుట్టిపడ్డట్లు
ముప్పును గారడి ముగియునట్లు



దాసమహాకవీంద్రుని యక్షగాన ప్రబంధములలో మిక్కిలి విశిష్ట స్థానమును జెందినది. "జానకీశపథము". ఇందు ద్వంద్వా ర్థముగా సూచింపఁబడినది. జానకి + ఈశ = శ్రీరామచం ద్రుని. పథము=మార్గము. జనక మహారాజ కుమార్త సీతాదేవి గావించిన శపథ వృత్తాంతము. ఇందుఁ బద్యరచన గేయరచన నూతనఫణితిని వ్రాయఁబడినది. ఇందున్న గేయములలోఁ గొన్నింటికిఁ దప్ప మిగిలిన వానికి శాస్త్రసాధనసిద్ధ రాగములనే

---

గీ॥ హాయిగా రాచదంపతు లర్భకుఁడు
బ్రతుకుఁగని కౌశికమునీంద్రుఁ బ్రస్తుతించి
యెల్ల దేవతలకు మ్రొక్కి ఋషుల కెరఁగి
యెంతయుం గల్మిపుట్టిలో యిల్లుఁజేర

"హరిశ్చంద్రోపాఖ్యానము"

చల్లనిగాలి నిండుఁగల జాబిలి యామిని పండుతోటలో
నల్లిన మల్లిపువ్వుపొద యచ్చటఁ జిన్కులఁ జిమ్ముకంతమా
మొల్లపు చిల్కపాట యంటమోహము దీరుట వన్నెకానితో
మెల్లన నోయగంబు నడమీఱుట యబ్బునె యట్టిముచ్చటల్
లాలనఁ బొందఁ గోరికనులంబడు దబ్బర వంతము త్రెపుం
జాలెగఁ జిమ్ముచుం బెదలిచాటొనరించుఁ గోఱజూపులన్
గేలుల నొద్దుకొంచు గిలిగింత కొకింతట నవ్వి ఫక్కునన్
దూలిమి దూలనోలు నెలఁతం దమిఁదీఱఁగ ముద్దులాడెదన్

"సారంగధర చరిత్రము"

యేర్పరిచిరి. ఇవి సంగీతవిద్వాంసులకు సాహిత్యవేత్తలకు మాత్రమే సులభసాధ్యము. ఇందలి సంగీతసాహిత్య రచన దాస మహాకవీంద్రుల యఖండ పాండిత్యమునకుఁ బ్రతిబింబ మనుట సత్యదూరముగాదు. ఈ మహత్తర యక్షగాన ప్రబంధము లందు విభావానుభావములను బ్రదర్శించి వానిచేత సంచారిభావము లను స్థాయీభావములను విస్ఫురింపఁజేసి తత్సాంగమ సంపద చేత శృంగారహాస్యాది రసములను సంజనింపఁ జేసి యేతత్కథ లకు జీవము వోసిన దాతలు.

---

" చెలఁగి నెలయేటి యిసుకతిన్నెపైఁ జెరలాడు శార్దూలములు"

" కఠిన జ్యాఘోష మాశా ఘనకరటి ఘటాకర్ణముల్
ప్రక్కలింపఁగన్"

" ఒకచోట రాజులయొద్ద నిచ్చకములు బల్కుచు
నెగడు విద్వత్కులంబు"

"ఒకచోట లంచంబు లొడిసి మ్రింగుచుఁ జూపు
దంభ మొయ్యనఁ జూపు నుద్యోగిగణము" "మార్కండేయ"

" మంచి జీతంబు లనుభవించియుఁ
లంచములను దిననేటికో" "హరిశ్చంద్ర"

ప॥ పల్లికన్నియను సామీనా - పైనీకీమనసేమీ
అ॥ తల్లిదండ్రుల చాటుదాన
తత్తరపడనేలా ! యిదివీలా! "భీష్మ చరిత్రము"



శ్రీనారాయణదాసకవీంద్రు లీ ప్రబంధములందుగమ్మని తేటతెలుఁగు నుడిగారము లచ్చుతోసినట్లు పామరులుమెచ్చు నట్లు పండితులు నచ్చునట్లు గూర్చినారు. కానివానిలోసంస్కృత శబ్దములు స్వల్పముగా నవల్పభావములను విస్ఫురింపఁ జేయు నట్లు రచించిరి. రౌద్రభయానకాది దృశ్యము లందు గూఢనభంగ తరంగ సంయుక్తమగు నదీప్రవాహమువలె సంస్కృతశబ్దములు ప్రయోగింపఁ బడుచుండును. అన్యాయాధర్మములను నిశిత ముగా సందర్భశుద్ధిగా విమర్శించుటలోఁ గవీంద్రులు పురోగ మించుటకు వెనుకంజ వేయలేదు. దాసకవీంద్రు లలంకారనిధి యని చెప్పుటకు నిదర్శనముగా జానకీ శపథము నందుఁ బ్రయో గించిన యుపమాలంకారవైచిత్ర్య స్తోత్రపాత్రముగానుండుననుట చిత్రముగాదు. ఇందు శ్రీరామ చంద్రుని విరహము పట్ల వ్రాసిన

---

"వల్లెయని యబ్బాలకులు తుమ్మెదరొదల మాడ్కిఁ - దంత్రీనాదంబులు. మనంబుల హెచ్చరింప - కోయిలలు మ్రోఁగు నట్లు, నెమళ్ళుఁగూయుభంగి - నొల్లు పేలుకరణి - తారాజువ్వ లెగయు లాగున - డింకీసావురంపు మొగ్గల దీరుప - మేల్ప టాసామొనర్చినగతిఁ - జక్రంబులు దిరుగు చాడ్పున - సన్న జాజులు జల్లు దెలంగున - గపురంపుటనఁ పండ్లొలుచుభంగి - పలయ మాగుతము వీచు సొబగున - నెలయేటి కెరటంబుల విధంబునఁ - బూలచెండ్లాడు పొలపున - గవ్వలు గిలకరించురీతి- తేనియలూరు - దెన్నున - జిత్తజల్లులాగున" "జానకీశపథము"

గేయాదులు మఱచి పోలేని మణిపూసలు. ఇందలి పరిదేవనము-సహృదయ - హృదయ - ద్రావకమై యలరారెననుట సమంజసము. భక్తి నీతి ప్రధాన యుక్తమై - హరికథారత్నమై సహృదయ రంజకమైన అంబరీషోపాఖ్యాన గజేంద్రమోక్షముల గవీంద్రుల ధిషణాశక్తి - వర్ణనా ప్రాగల్భ్యము - పరాకాష్ఠకుఁ జెందినది. రౌద్రహాస్యరసములందు సంస్కృత సమాస భూయిష్ఠముగా భయమును గలిగించు రీతిని లిఖియించి విశ్రాంతినిం గలిఁగించు పట్టుఁబట్టించెడి గట్టిదిట్ట. గౌరమ్మ పెండ్లియను పార్వతీ పరిణయమును, నచ్చతెలుఁగు పలుకులతో విరచించిరి మహాకవి కాళిదాస

---

"కరియు మకరియును గరకరి
దెరయుచు జరిపిరపుడు.... ఘోరాజిన్
పరి బలముల రాతిరిప వలనకను
దిరముగ విరువురు నోజన్"

"కరిమకరిదిగుచు దరికి మకరియును
గరిని దిగుచు లోపలికిన్
దిరదిర దిరుగుచు బిరబిర
నెడయుచు నరివలఁగలయుచు నలుకన్"

"ధరాధరము వలె శరీరము మెఱయ గరాగరిగజలచరేంద్రు తనువును గరంబునఁ బెనచి బిరానవిసరగ కరేణువులయ్యారె భళిభళిరేయనగందుర మొనరించె పదపడి రాహువు భానువుఁబట్టిన పగిదిని" "గజేంద్ర మోక్షము"



కృత కుమారసంభవ మందలి కథకు నిందున్నకథకుఁ గొంత సంబంధమున్నది, శివునిఁబెండ్లాడఁ దలంచి పార్వతీదేవి తపమొనరింప నటకు మాయారూపమున శంకరుఁ డరుదెంచి యామెను పరీక్షఁజేయుట తుదకామె యచంచలభక్తికి మెచ్చి ప్రత్యక్షమై యామెను నుద్వాహమొనరించుకొనుట యిందలి కథాభాగము. స్త్రీపురుష సమ్మేళనమున నీమాయా ప్రపంచ మంతయు సంజనించిన దని యిందంతరార్థమని తెలియఁబరుపఁబడినది. ఇందు రచిత పద్యగద్యగేయములు రసజ్ఞ మనోరంజకములుగా నుండును.

---

సీ॥ అభ్రం లిహోదగ్ర విభ్రమాభ్రమ
కృష్ణిల దీర్ఘ శరీరమమరఁ
బ్రళయ కాలానల ప్రథమ చక్రీకృతే
క్షణముల రౌద్రమక్షయముగాఁగ
త్రైలోక్య కబళనోత్సాహ సూచకఘన
వక్త్రతి యోగ్రిత వాసికెక్క
బర్బుర ఖర్బుర కేశపాశారుణ ప్రభ
కాలసంధ్యారాగ కాంతిదనర
గ్రకచకఠిన కరాళదంష్ట్రలు వెలుంగ
బదయు గోర్ధూత పాంసుపుల్చదలు గప్ప
నేలపదములు నింగిని నిడతల
నత్తికొని వచ్చి కృత్తు తామి తు పగిది.
"అంబరీషోపాఖ్యానము"

ఈ యక్షగాన ప్రబంధములందు వర్ణన విషయములలోఁ గూడఁ గావ్యగౌరవమును దివ్యనవ్య ప్రతిభలతో సవ్యముగా నడచినదనుట నిస్సందేహము. హృద్యము లైన పద్యములు నడక పడక లేక వడివడిగా సాగించుటలో దాసకవీంద్రు లప్రతిమానముగాఁ జూపిరి. వీనికి నివి యేసాటిగా నున్నవనుట నిస్సందేహము దాస మహాకవీంద్రులు తమ నైజ సత్ప్రవర్తనమును లోకజ్ఞతను బహుముఖములుగా నందుఁ బ్రదర్శించెను. వారితరులకుఁ బరుల కుపకార స్వభావులగుటచే 'మారొనర్పకుమేయపకారికైన' ననియు నితరుల సంపదలకు నీర్ష్యఁ జూపని వారగుటచే "ఒరుల గొప్పఁజూచి యోర్వలేకుండిన వాఁడుం దప్పకుండఁ గీడుబొందు" ననియు. లోకమున సహజముగా ధనవంతులదోషము లెంచరనియు, బేదవారినేరము లెంచుట కెల్లరు పెద్ద లనువిషయము నుజక్కఁగా "దుడ్డుఁగల్గు గొప్పవారి దోసములెక్కింపరెవరు గుడ్డలేని పేదవాని - కీలమెంచఁగఁ బెద్దలంత" యనియు, ధరణి యందు సహజముగాఁ గ్రూరాత్ములకుఁ గారుణ్యము లేదనువిషయ మెల్లరెఱింగినదైను "క్రూరకర్ములకున్ దయ దూరముగద"

---

"అయ్యో, జీవేశ్వరీ - యింతయ్యె నామన బ్రతుకు"
ఎయ్యెడనుంటివో - ఏమనుకుంటివో
అరయఁగ మనశోకము - జన్మావధిగాఁ జేసెనా
నిండు గర్భిణి నిన్నునేడు విడువవలెనా
వెండియు మనయాసలెల్లఁ జెరిగి - పదటఁగలిసెనా



యనియు, నీతిఁగల్గిన, సర్వభూతములకు, హితమగునని, యెట్టి ధర్మహీనమైనపనిని విరించి వచించినను మంచివాఁడాలించఁడను నీతినిఁ జక్కఁగా "నీతిఁగల్గిన సర్వభూతహితంబగు, పనువు మాలినపని బ్రహ్మచెప్పినఁగాని. నీతిమంతుఁడు సేయనెట్టు కొనునె" యని యు, సామాన్యముగాఁ గవీంద్రులు స్వభావమే. పెద్దలమాట పెడచెవినిఁబెట్టకుమనియు, చిన్నవారి కైనను, మంచి చెడ్డఁ దెలుపమనసే సాక్షియనియు. వినయవంతుల కసాధ్య మైనది లేదనెడి భావయుక్తులగుటచే "నిర్మల వినీతికిం బ్రాపునెనరుచేవు - అడఁకువగలవానికగపడు నిజము" అనియు -

---

చెలులకు నను జూపి చిరునవ్వునండల
యూచి గర్వించెద వొక్కమారు
నిరుపమ సుందర నిఖిల జగద్వీర
యోనాథయనిపిల్తు వొక్కమారు
ప్రాణనాయక నిన్నుఁ బాసిన క్షణమైన
యుగమని చెప్పెద నొక్కమారు
ఎడఁద లొక్కటిగదా యొడళుల వేరేల
నోయంచుఁగౌగలిం చొక్కమారు

సర్వ సద్గుణపుంజమా చక్కఁదనము
ప్రోవనా పూర్వపుణ్య స్వరూప మామ
దీయ హృద్దీపమా యోవిదేహతనయ
నాదు జీవంబసీతవిన్నావసినాను" "జానకీశపథము"

సాధ్వీమణియగు శ్రీనివారు ముదసి సంతానవతియగు ముదిత యైన - పతియెడ నానుపించు, లోపములనైచు - కన్నవారి కత్తింటికిన్వన్నె దెచ్చి - మగనితో స్వర్గమేగెడునదిమగువ మగువ యనియు, ప్రాణమిడియైన భర్త కుమానరక్ష భార్య యొన రించుటయే సుమ్ము పరమ నీతియనియు. సత్ప్రవర్తనమునుగూర్చి వినయంబునఁ బెద్దలఁ గాంచు గనికరముచ దీనులఁ బెంచు - ననయంబు విగర్వితమెంచు - నన్యకాంతను దల్లిగనెంచు ననియు, నన్యోన్యమైత్రికి హేతువై ధర్మవర్తన మెప్పుడైనఁ దప్పఁజన దనిరి, సత్యస్వభావులగుటచే దాసకవీంద్రులు, సువ్ర తంబుల ముఖ్యంబు సూనృతంబు. దుష్ట సంపర్కమునఁ దుర దృష్టమునను గల్ల నిందను బొంది యిక్కట్లు పడయు సత్య వంతులకు దుదకు ప్రశస్తకీర్తి అను పెక్కునీతులను భీష్మచరిత్ర ప్రహ్లాద - జానకీశపథ - సావిత్రీచరిత్ర - మున్నగు యక్ష గాన ప్రబంధము లందు మనోజ్ఞముగా మనస్సులకు హత్తుకొను నట్లు పొందుఁ బఱచినారు, ఇట్టి ధర్మనీతులను నెన్నియో మిన్నఁగా నితరకృతులందుఁ గూడఁ జిత్తము లెల్లెడఁ దక్కొత్తు నట్లు గూర్చి చరితార్థులైరి.

మహాకవీంద్రులు - సారంగధరరూపకమును రచించిరి. ఇందులోని భాషగ్రాంధికమైనప్పటికి - వాడుకభాషకు సమీపము గానుండును, జరిగినకథకుఁ గొన్ని మార్పులు చేర్పులు చేసిరి. చిత్రాంగి పాత్రను పోషించి యామె కుత్సితవాంఛకు బలీయ



మైన కారణములను నగపరచి యామెపై సానుభూతిని జూపఁ దగు నట్లొనరించెను.

ప్రథమమునఁ జిత్రాంగి సారంగధరునకే యేర్పాటుఁ జేసిరి. పటములను బంపించుకుండిరి. ఆ దినమునుండి చిత్రాంగి సారంగధరునిపై మమత నిలిపికొనినది సారంగధరుఁడు కూడ నామెపై ప్రేమను నింపుకొనినాఁడు. ఇంత జరిగిన పిదపఁగూడ ముదుసలి రాజా మెను వివాహ మాడినాఁడు. చిత్రాంగికీ విపరీత పర్యవసానమును బ్రతిఘటింప శక్తిసామర్థ్యములు సన్నగిల్లినవి. ఆమెకు మతియొకచోట మన్నన మతియొకచోట నుండు నట్ల య్యెను. తానొకటిఁ దలఁచినఁ దైవమొకటిఁ దలఁచినట్లయ్యెను. వివాహ మైన పిదపఁజిత్రాంగి తనమనంబు సారంగధరునిపై నిల్పుట పాపహేతు వనియామె తలంచెను. సారంగధరునిఁగలి యుట కనేకవిధములుగాఁ దటపటాయించెనుగాని వానిపై వల పును విదల్చుకొన లేకపోయినది.

తుదకు నాతని స్వాధీనమొనరింపఁ జూచెను, అతఁడు చలింపక విదలించుకొని పోయెను. అందులకామె విఫలమనోరథు రాలై మహారాజుకు దెలుపుట యాతఁడు దనపుత్రుని శిక్షించుట మున్నగునంశముల గూర్చి రచించెను. సారంగధర పద్యకావ్యము లందు గూడ నిట్టి విధము లేదని తలపఁదగును.

సారంగధరనాటక మందలి పాత్రౌచిత్య సంభాషణము విదూషకుని హాస్యము న్యాయస్థాన విచారణము సారంగధరునికి

శిక్ష యంత్యమున నెల్లరకుఁ గల్గిన వైరాగ్యము లిందుఁ బ్రతిపాదితములైనవి. ఇందు మాటలు పాటలు పాటలు రచనాపాటవమున రమ్యాతిరమ్యములై సామ్యములేనివై యున్నవి.

మొత్తము మీఁద శ్రీదాసకవీంద్రుల గ్రంథములను జదివినచో వారికిఁ గవిత్వ మందుఁ గూడ విశిష్టస్థాన మీయక తప్పదు. వారు మహాకవీంద్రు లని యనుట కూడ సమంజసము స్వభావసిద్ధము స్తోత్రార్హము.

---

సీ॥ తనయంత గోరిన పెనిమిటి యెదకుబ్బ
రైకగుట్టుల చెలుల్గి కొనంగ
సిడుజోడులనెంచి యెదుటఁ జిత్రముగాంచు
నప్పుడు గన్నీళ్ళు లలము కొనఁగ
రేపు మాపను మాటపై పనికొవ్వాడి
కోరికయున్ వెఱలూరు కొనఁగ
ముందు చెల్లెడి కోర్కె చందము దలఁచిన
యంత నిట్టూరుపు లల్లుకొనఁగ

గీ॥ రాయబారంబు వచ్చిన రేయి గడఁచె
నోయి నిద్దురఁ గన్గవ మూయలేక
తెప్పపాటులు యుగములై కప్పురముల
నేడిములఁజిందిఁ గండిన విరులపాన్పు



# పరిశిష్ట సాహిత్యము

తారకమును దాసకవీంద్రులు తాము స్వయముగా నన్వయించుకొని చదువుకొనిన వ్యాకరణ విజ్ఞానమును నగపఱచుటకు సంస్కృతమున వ్రాసిరి. ఇందుఁదారకావతరణమున దైవాంశసంభూతుఁడగు నాతని దేవతలు సంస్తుతింపుచున్నారని తమ యాధ్యాత్మిక తత్త్వజ్ఞాన ప్రదర్శనమునకుఁ గూడ నవకాశమును నందు గల్పించుకొనిరి. గంభీరమగు నౌపనిషదవిజ్ఞానమును నందు సులభముగా బోధించిరి.

---

గీ॥ నిందఁ బాల్జేసి నన్నుఁ జంపందలంచి
వలపు విరుపుగ విసమున వానిఁ దెరచి
పోఁదలంచితే నెరజాణ పూలబంతు
లాలవాలంపు నదినుడి యందులేదొ

గీ॥ వలపు కొనసాగఁ జూచు జవ్వనపుపెంపు
కన్నెప్రాయము మొదలునిన్నను తలంపు
పొందుఁబరచిన నీవాని మందలింపు
లింకుకుడువని నిందలకేళతములు

గీ॥ మేనులన్ మదుల నొక్కటిగా నొనర్చి
రక్తిలోనఁ బ్రపంచ విభ్రమము దొరగి
వాసిమీరఁగ నిప్పుడ ద్వైతసిద్ధి
జెందుదమురార యీభేద మందనేర

"సారంగధర నాటకము"

"వారి తరంగములకు వలెనే దేవా నీకును జగత్తునకు భేదములేదు. స్థాణువు నందు దొంగ యను భావము భ్రాంతిచే గనుఁజీకఁటి యందుఁగలుగునట్లు నీయందీ జగద్భ్రాంతిఁ గలుగుచున్నది. దిగంతరేఖవలె దృశ్యమగుచున్నను వాస్తవమును విచారించినచో నదృశ్య మగుచు సదసత్స్వరూప మగు నీమాయయే యిట్టిభ్రాంతిని జగత్తునకుఁ గలిఁగింపుచున్నది. కాన నీతత్త్వమింద్రియవేద్య మెంతమాత్రము గాదు. చూచునది - చూడఁబడునదియు - నభిన్నమైనపుడు - తద్భిన్నసాధనమొకటి యవశ్యకమగునుగద" యను ప్రబోధములకు నాలవాలముగా నాతారకమును రచించిరి.

మహాకవీంద్రులు దాము గురు కులక్లేశము నంటకపోయిలను దామెంత కష్టపడి యిట్టి పాండిత్యమును సంపాదించినారో యందుపమానముగా విశదీకరించిరి. అందుచేత నీతారక గ్రంథ

---

శ్లో॥ భేదోయథాకాండ తరంగయోర్న
స్యాత్తేఽస్యలోకస్యత ద్వైవదేవ
సర్వః ప్రపంచఃత్వయి కల్పితోవా
స్థాణౌ భవేద్దస్యురివభ్రమేణ (తారక 1-23)

శ్లో॥ దృశ్యాప్య దృశ్యాసద సత్స్వరూపా
త్వదీయ మాయాభ్రమకారణంసా
దిగంతరేఖావద తీంద్రియంతే
తత్త్వం జగన్నాటక సూత్రధార (తారక 1-15)



మునకు ప్రొఫెసరు గెల్డనర్ (మల్‌బార్గు యూనివర్శిటీ - పరిషియా) ప్రశంసించి రెండు శ్లోకములను - విరచించి - పంపిరి.

---

శ్లో॥ భక్త్యైవతేఽధీశ్వర దేవతాఽపి
శక్నోతి వేత్తుం పరమార్థతత్త్వం
దృష్టిస్వరూపం ముకురాశ్రయైవ
విలోకితుం శక్యత ఆదిదేవ (తారక 1-17)

శ్లో॥ స్వభావ పాండిత్య బలేనకుర్వేకావ్యం
పత్రీ సహసేవనీడమ్ (తారక 1-2)

శ్లో॥ అనాఘ్రాతంపుష్పం కిసలయ మలూనంకరరుహై
రనావిద్ధం రత్నమ్మధు నవమనాస్వాదితరసం
అఖండం పుణ్యానాం ఫలమివచతద్రూపమనఘం
నజానేభోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః

అభిజ్ఞానశాకుంతల

క్రోలవిక్రొఁత్తతేనె, మొనఁ గ్రుచ్చనిమావికె గోరునాటులన్
దాలచనట్టి లేఁజివురు తావిఁ గొనంబడనట్టి పూవునుం
బోలినదాని నోయగము ముందిటనోముల మేటిపండుగా
బోలును దాని నేలుటకు బుట్టిన యాతని దెంతపున్నెమో!

శ్లో॥ మందః గవియశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్
ప్రాంశులభ్యే ఫలేలోభాదుద్బాహురివ వామనః

"రఘువంశము"

సంస్కృతనాటక రత్నమైన యభిజ్ఞానశాకుంతల నాటకమునఁగల శ్లోకములకు నాళువుగా నష్టావధానములందు ననువాద పద్యములు, మూలమునకు వ్యతిరేకము గాకుండ జెప్పిన పద్యములు - ప్రశంసార్హములైనవి. సముద్రమునకుఁ దీరమును గనుఁగొనుటయు - నక్షత్రముల గణనఁ జేయుటయు సులభమగు నేమోకాని శ్రీ ఆదిభట్టనారాయణదాస మహాకవీంద్రుల కవితా విశేషములను, వర్ణించుట సులభముగాదని సహజముగాఁ దలఁపఁదగును.

---

క॥ వెడగున్ గయిపెంపుననేఁ
బడయంగాఁ గోరి, నవ్వఁబడియెద నాసన్
బొడవగు నతనికిఁ బొందం
బడువండునకు గయిసాచు మరుగుజ్జువలెన్

పాతుంనప్రథమం వ్యవస్యతి జలంయుష్మాస్వపీతేషుయా
నాదత్తే ప్రియమండనాయ భవతాం స్నేహేనయా పల్లవమ్
ఆద్యేవః కుసుమప్రసూతి సమయే యస్యాభవత్యుత్సవః
సేయంయాతి శకుంతలాపతి గృహం సర్వైరనుజ్ఞాయతామ్
"అభిజ్ఞాన శాకుంతల"

ఎవ్వతె ముందు మిమ్ముఁదనియింపక త్రాగదునీరుఁ దాల్పఁబో
దెవ్వతె మీపయిం జెలిమి నింపయినం జివురాకునొమ్మ మీ
పువ్వసమత్రై యెవ్వతెకుఁ బొల్పుఁగుపండువు చెల్వువించు నా
జవ్వని యీశకుంతకుల యొసంగు నొసంగుడి యాన నెల్లరున్.



హరిదాస జగద్గురువు

"దాను నారాయణునకు నీ తండు, వీని
దాను లెల్లడఁగల హరిదాసు లెల్ల"

— తిరుపతి వేంకటకవులు

# సంగీత సౌరభము

(హరికథాసేవ)

సర్వజనైకవేద్యము - హృద్యము. భగవన్నైవేద్యమైనది సంగీతము. అందునానారసప్రధానమైనది హరికథా కథనము. అది ధర్మ భక్తి ప్రబోధమునకు, నిర్మలసాధనము. అది నృత్తగీతములలో మనోరంజకముగా సాధింపఁ దగియున్నది. భగవత్సాన్నిధ్యమును బొందుటకు యోగసంగీత మార్గములు దప్పవేరులేదు. సర్వవస్తువులయందు వాసుదేవ భావనచే మనోవాక్కాయ కర్మలచే భగవంతునిఁ బూజింపుచు సర్వప్రజలకు దైవభక్తిని బోధింపఁ దగు మోక్ష సాధనము సంగీతము కన్న వేరు లేదని నారదమహర్షి ప్రబోధించె. అందుచేత పురందర విఠలాది వాగ్గేయకారకు లిక్కలి యుగమున గీతప్రబంధములు, విరచించి యాడుచుఁ బాడుచు బరులఁ దరింపఁజేసి తాముతరించిరి. రామదాస-

---

శ్లో॥ రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని — అభిజ్ఞానశాకుంతలమ్

గీ॥ అందములఁజూచి తీయనద్దాలకించి
వసరు సుకమున్న పజ దేనివలవనాక
తంబుచేఁ దొలిపుట్టు లందలియితములఁ
దెలియకెద నాటినవి మదిందలఁచుచుండు.

త్యాగరాజాదులు గూడ భగవంతుని గానామృతముచేఁ బ్రసన్నునిఁ జేసికొని ముక్తిని బొందిరి. హరికథాశ్రవణము వలన శ్రోతలు నిఖిల శ్రేయోభివృద్ధినిఁ బొందుదురు. కథకులకుఁ గూడ ధర్మార్థ కామ మోక్షములు లభించుననుట నిస్సందేహము. అట్టికథలకు శ్రుతిస్మృతి విజ్ఞానము శబ్దానుశాసజ్ఞత అభిదాన ప్రవీణత ఛన్దః ప్రభేదవేదిత్వము అలంకారకౌశలము రసభావ పరిజ్ఞానము నానా

---

శ్లో॥ శిశుర్వేత్తి పశుర్వేత్తి గానరసంఫణీః
కోవేత్తి కవితాతత్త్వం శివోజానాతివానవా"

శ్లో॥ వీణావాదనతత్త్వజ్ఞో శ్రుతిజాతివిశారదః
తాలజ్ఞశ్చా ప్రయాసేన మోక్షమార్గం
నియచ్ఛతి "యాజ్ఞవల్క్యస్మృతి"

శ్లో॥ గాయంశ్చరిత్రాణిరథాంగపాణేః
నృత్యన్నిరస్తాఖిలకర్మబంధః
నిరంకుశస్సర్వసమోవిరాగీ
కైవల్యమభ్యేతిముకుంద భక్తిః॥నారద స్మృతి॥

శ్లో॥ తస్యగీతస్య మాహాత్మ్యం కేప్రశంసతు మీశతే
ధర్మార్థకామమోక్షాణా మిదమేవైకసాధనం"
"ఆదిభట్టీతఁ డయ్యెనా హరికథలకు
ఆదిభట్టీతఁడయ్యె గేయంపు ఫణితికి
ఆదిభట్టీతఁడయ్యె నాట్యంపుఁగళకు
ఆదిభట్టీతఁడయ్యెలోకాదృతులకు" శ్రీ చె. వెం. శాస్త్రి



భాషా వైశద్యము కళాశాస్త్ర నైపుణి వాక్పటుత్వము సభావిజయ సామర్థ్యము ఉచితజ్ఞత రమ్యరూపము మున్నగు లక్షణంబు లుండ వలయును.

ఇట్టి యత్యంతాకర్షణమై రమణీయమై కళాత్మకమై యిహపరలోక సాధనమైన సంగీతసాహిత్యనృత్య కళాభారతిని నారాధించి హస్తంగత మొనరించికొని హిమాలయ శృంగసదృశ సద్యశో సముపార్జితులైన మహనీయ మూర్తి శ్రీయాది భట్ట నారాయణదాస మహాకవి. వారి హరికథా సేవ యాంధ్ర దేశచరిత్రలో సువర్ణాక్షరములలో లిఖింపఁ బడి రనుట నిస్సందేహము. సదాచారుఁడై నిజజీవితమును గథగాఁ బరిణమింపఁ జేసికొని దాసకవీంద్రుడు చిరస్మరణీయు డయ్యెను. వారు సంగీతసాహిత్యములలోనే కాక బహుభాషా పాండిత్యము మధురవచో నైపుణ్యము విశిష్టకవితాశక్తి లోకజ్ఞత నిరంతరభావస్వాతంత్ర్యము

---

సీ॥ "ఘనశంఖమో యనఁగంఠంబు పూరించి
మేలుగ శ్రుతిలోన మేళవించి
నియమము తప్పక నయఘనంబులఁ
బెక్కురాగ భేదంబులు రక్తిఁగలిపి
బంతులెగర్చిన పగిది కాలజ్ఞతన్
జాతిమూర్ఛనలొప్ప స్వరముపాడి
చక్కని నృత్యము సర్వరసానుకూ
లంబుగాఁగ నభినయంబు సేసి

గలిగియుండుటచే హరికథాపితామహ రత్నమకుటమును ధరించిరి. వీనికిఁ దోడుగా సుందరవిగ్రహము శీతవాతాతపవర్షంబులకు భీతిఁజెందని ధైర్యసాహసములు వారికిఁ జన్మహక్కుగా సంతరించుకొనినవి. వారు నిరంతర మందహాసభారవదను లగుచు నాకర్షణీయ దేహచ్ఛాయతో నసాధారణశక్తితో నమితపరిశోధనాసక్తితో వివిధ గ్రంథరచనానురక్తితో-నూత్న విషయగ్రహణాసక్తితో భూతదయాసంయుక్తాత్మతో నసమానభోగవిరక్తితో-సహజసంగీతసాహిత్యయుక్తపరిణితితో జీవితమహోస్యందనమును భారతదేశ సర్వదిశాస్థలుల - నిరాటంకముగా - నిర్వైరముగా - నిరాశాయుక్తముగా - నిత్యానందముగా - నడిపి భృశము యశమును సంస్థాపించి - మించి విస్తార బహుముఖ ప్రజ్ఞాశాలిగా శ్రీనారాయణ దాసకవీంద్రులు పేరెన్నిక గనిరి. వారు నిజహరికథోపదేశ మూలమున సర్వమనోక్షేత్రములందు భక్తిబీజములను

---

గీ॥ స్వకృతమృదుయక్షగాన ప్రబంధసరణి
వివిధదేశంబులం బిన్న పెద్దలుగల
బలు సభల హరిభక్తి నుపన్యసింప
లేని సంగీతకవితాభిమాన మేల"

గీ॥ "దాసు నారాయణునకు నీతండు వీని
దాసు లెల్లెడలఁగల హరిదాసు లెల్ల
రొక్క-హరిదాసు లేకాదు నిక్కమతని
ఘెడలనాదృతిలేనివాఁడెవఁడుపుడమి"



నాటుటచే నవి క్రమ క్రమముగా లతాప్రతానములై పుష్పించి ఫలింప దన్నిజసుగంధబంధురములు సర్వదిశల సంవాసములై ధ్రువనక్షత్రములవలెఁ బ్రకాశించినవి.

వారిని త్యాగరాజువలె సకలకళాపరిపూర్ణ మగు సరస్వత్యవతార మని, భారతమాత గర్భశుక్తిముక్తాఫలమని చెప్పఁదగును. వారికథాసేవాకథలు – ఆంధ్రహృదయాంతర్నాళములందు సుస్థిర స్థానసంవాసితములైనవి. ఆచిఱుత ప్రాయముననే దాస మహాకవీంద్రులు బహుముఖప్రజ్ఞావంతులై స్వతంత్రజీవన మందభిలాషాపరులై యుండిరి. సాహిత్య సంగీతాష్టావధాన రచనాసామర్థ్యములను సంపుటీకరించి హరికథాకథనము లందు నూత్నవిధానములను సృజించి నృత్యాదులను దోడుఁజేసి భక్త్యనురక్తులను జేదోఁడుఁజేసి మధురాతి మధురమైన వాఁదోడుగా వానిఁజెప్పి మెప్పించుటయే విధ్యుక్తధర్మమని వారు నిశ్చయించిరి.

ఇట్లుండ నొకనాఁడు కుప్పస్వామినాయడను నొక దక్షిణదేశపుభాగవతారు విజయనగర మందొక సంపన్నగృహస్థుని గృహంబున గథాకాలక్షేప మొనరింపుచుండెను. ఈవిషయమును దాసకవీంద్రు లెఱిఁగి యచ్చటకుఁబోయి తత్కథనునామూలాగ్రముగా విమర్శనాదృష్టిని నాలించెను. అప్పు డాకవీంద్రుల మనంబునఁ "గథ స్వవిరచితమై పద్యగద్యములతోఁ గూడియుండి నృత్యాభినయరసానుకూలముగా దానినిఁ జెప్పినచో నది రక్తిని వ్యక్తీకరించు"నని విద్యుల్లతవలె మెఱసెను. వెంటనే యింటికిఁ

జని యారాత్రిని మహాభక్త ధ్రువచరిత్రమును బద్యగద్యగేయ సమ్మిశ్రితముగా రచించెను. మఱునాఁడా కథను విజమిత్రుల సమక్షమున వాద్యాదుల సమ్మేళనముతో నొకదేవాలయమున ననవద్యధీప్రతిభను వెల్లడింపుచుఁ జెప్పెను. అదివిన్న వారెల్లరు దాసకవీంద్రులను మిన్నఁగా మెచ్చుకొనిరి. దాసకవీంద్రుని అన్న సీతారామయ్యగారు చాటుగానుండివిని మనస్సునననానందించి "వీనికి సభారంజనము సేసి జనవశీకరణమును గావించుకొనెడి శక్తిని దేవుఁడు ప్రసాదించినాఁడు ఇంక వీనిని నుద్యోగ మొనరింపు మని వేధింపఁబని లేదుకదా" యని సంతృప్తినిఁ జెందెను. అదియే శ్రీదాసకవీంద్రుల హరికథా చరిత్రకు నాంది యయ్యెను.

నాఁటి నుండి దాసకవీంద్రులు వాచికాంగికాభినయ విశేషం బులనవరసంబు లుట్టిపడునట్లు స్వరభేదంబుల నుపన్యశించి శాస్త్ర పాండిత్యమును బహుముఖముగాఁ బ్రదర్శింపఁజేయుచు శంఖము వలె గాత్రమును బూరింపఁజేయుచు సర్వజన మనోహరరూపవేష ములతో హరికథలను జెప్ప మొదలిడిరి. శ్రోతలు వారి నృత్య విలాసమునకలరి ఘనశంఖ ధ్వనిఁ బోలిన త్రిస్థాయీ గానగాత్ర ముల కానందించి తత్సమయస్ఫూర్తికి సంతోషరసాబ్ధిని నోల లాడు చుండెడివారు. భ్రాతృమూర్తి సహజసంగీత విద్వాంసుఁడగు పేరన్నగారు అగ్నికివాయువుతోడగునట్లు సహకారగానాదులసలుపు చుండఁగా దాసకవీంద్రులు విజృంభింపు చుండెడివారు. వారు హరి కథా గాన ప్రదర్శన మొనరించు నప్పుడు సహస్రాక్షితో నున్న



విధమున సభాశ్రోతల నెల్లరఁ వారి కింపు సొంపుఁ బెంపొదవు నట్లు నర్తింపుచు విజధోరణులను జలనచిత్రము వలెఁ బరివర్త నమునుఁగావింపుచు సంగీతవిద్వాంసులున్న యెడల నిజసంగీత ప్రతిభలను బ్రదర్శింపఁ జేయుచు నందు సాహిత్యవేత్తలున్నచో విజకవితాసుధను వారానఁ బ్రవహింపఁ జేయుచు నానాశాస్త్రంబు లందలి క్లిష్టసమస్యలను బ్రసంగవశమునవిచ్ఛిన్నమును జేయుచు నచ్చట పామర జనము నున్నయెడల వినోద విలాసవికాస కథలను దెలిపి యుల్లాస సల్లాపములను గలిగించుచు మహోత్సాహమున వర్తించెడివారు.

రాజమహేంద్రవరమున శ్రీసోమిన కామేశ్వరరావుగారి పుత్రిక వివాహము జరిగెను శ్రీరావుగారు సాహిత్యప్రియు లగు టచే శ్రీచెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి వంటి మహాపండితకవుల నెల్లర నాహ్వానించెను. వా రాసందర్భమున దాసకవీంద్రులచే హరికథాగానమును గూడ నేర్పరించెను. వారు సీతాకళ్యాణమును గథాగాన మొనరింపుచు సీతాదేవి తన వివాహమునకు ముందు దుర్గాదేవినిఁ బూజించె నని సంస్కృతమునఁ జదువుచుఁ బూజ నేయుచు వ్యాకరణజ్ఞాన మగపరచుఁ బ్రౌఢప్రయోగప్రదర్శనము లను విమర్శకుఁ దావుఁ జూపక జూపింపుచుండెను. హరికథ ముగిసిన పిదప చెళ్లపిళ్లశాస్త్రిగారులేచి దాసమహాకవీంద్రా! మీ యత్యల్పసాహిత్యపాండిత్య జ్ఞానములు నిత్యారాధనము నవి. మీకు మీరే సాటి యని" శ్లాఘించెను. అందులకు దాసకవీం ద్రుఁడు వినయవిధేయుఁడై "మీ ప్రశంస నాకుఁ బ్రోత్సాహకర

మైనను గురువులకడ నభ్యసింపని విద్య గ్రుడ్డిదేకదా !" యని పలికెను.

ఆ పలుకులకు శాస్త్రిగారు ముదమొంది "మీ రాచందము డెందమున నొందఁదగదు. సరస్వతీప్రసన్నులకు గురువుతో నిమిత్తము లేదు. అందులకొక యుదాహరణమును జెప్పఁగలను. మాగ్రామ మందొక యంధుఁడున్నాఁడు. రాత్రిం బవలు లాతఁడు సంచరించు ప్రదేశములందు నొకయగాధ మైన యగడ్త గలదు. ఎంద తెందటో యందుఁ బడుచుండెడివారు. కాని యాతం డెన్నం డందుఁ బడలేదు. అది భగవత్కటాక్షముకదా యని" పలికెను. ఆనాఁటి హరికథాగాన ప్రశంసాకీర్తిరథమే దాసకవీంద్రులను బురోగమన మత్యంత వేగముగా నడఁచిన దనుట నిస్సందేహము.

---

దాసకవీంద్రుల గాత్రము ఘనశంఖము వలె నొకమైలు దూరము వినఁబడు చుండెడిది. వారు తన్మయత్వమును జెంది శ్రోతలను గూడఁ దన్మయత్వమును జెందించెడివారు. కరుణారసము నభినయించెడి వేళ సభికులను దుఃఖపూరితులుగఁ జేయుటయు గలదు. హరికథాగానమొనరించు నప్పుడు దానొక్కరే కథ యందున్న యనేకపాత్రలను ధరించెడి వానివలె నటింపుచు నవరసము లొలికింపఁ జేయఁగల నేర్పరి. శ్రీరామచంద్రుని సంబంధ పద్యమును జదువుచోఁ బురుషగాంభీర్యము సీతాదేవి పద్యమును పఠింపుచో స్త్రీలాలిత్యమును బ్రదర్శింపఁ జేయుచుండెడివారు.



శ్రీకృష్ణారావు గారను డిప్యూటీ కలక్టరు తమపుత్రుని వివాహసందర్భమున శ్రీదాసకవీంద్రులను తంతిమూలముగా నాహ్వానించి గౌరవించి "దాసకవీంద్రా ! తమరునేఁడు హరికథాగానప్రదర్శనమును గావించి మమ్ము ధన్యులజేయుఁ డని కోరెను. అంతట దాసకవీంద్రుఁడు రుక్మిణీకళ్యాణమును జెప్పుచు 'రుక్మిణీదేవి శ్రీకృష్ణునిఁ దలఁచిన పాటయగు "ఎక్కడ నున్నావో ! కృష్ణా ! నీవేమితలఁచినావో!" యని గానమును జేయుచు నాహ్వానకర్త శ్రీకృష్ణారావు' అని స్ఫురణకు వచ్చుటచే నందలి శ్రోతలనెల్లరఁ బరికింపుచు మఱల నాచరణమునే పునరుక్తిఁ జేయుచు శ్లేషగాఁబాడెను. అప్పుడు శ్రోతలెల్లరు కడుపుబ్బునట్లు నవ్విరి. అచట నున్న శ్రీకృష్ణారావుగారులేచి "దాసమహాకవీంద్రా! మీరు

---

"గీతం - వాద్యంచ - నృత్యంచ - త్రయం - సంగీత ముచ్యతే" అని యున్నందున వానినిఁ దెలిసి యున్నవాఁడే సంగీతవిద్వాంసుఁ డని వారి నిర్ణయ మగుటచే నటులనే నిజప్రతిభలను బ్రదర్శించెడివారు. మనోజ్ఞహాస్యముతో గూడిన వక్తృత్వధోరణియు సకలరసానుకూలాభినయము మధురగానము లయజ్ఞానప్రకటిత నృత్యమైశద్యము అమృతపూరిత విమలకవితాసంపన్నత నానాశాస్త్ర పరిజ్ఞానముతోఁ గూడిన సమయస్ఫూర్తి యివి యన్నియు నొకదాని కన్న నొకటి మిన్నఁగా నుండుటచే దాసకవీంద్రులు హరికథాపితామహులై యాంధ్రావనియందు 'ఆటపాటలమేటి' యని కీర్తిఁ బొందెను.

వేరు తలంపు నిలుప వలదు. మీ మామూలు కట్నమునకు గొఱఁతయుండ" దనిపలికెను. అంతట సంతోషాద్భుతరసములను శ్రోతలకుఁ గలిగింపుచుఁ గథముగించెను. డిప్యూటీకలక్టరుగారు దాసకవీంద్రులను గొప్పఁగా సత్కారాదులచే మెప్పించెను.

ఏతత్కథగానాదులను విన్న యఁటగల యొకప్రభుత్వోద్యోగి "దాసకవీంద్రా! మీగాననృత్యాదులు మామనస్సులనుసంతోష సముద్రము లందు నోలలార్చినవి. మీ నృత్య ప్రదర్శనమును జూచునప్పుడు రంభయో యూర్వశియో వచ్చి నృత్యమొనరింపుచున్నదని భ్రమంచితిమి. తెప్పవాలక మీయందే దృష్టిని నిల్పితి" మని తెల్పెను.

బరంపురమున శ్రీజయంతికామేశము పంతులుగారి గృహమున నున్నప్పు డొకనాఁడు వారి కోరిక మేరకు రాత్రి తొమ్మిది గంటలు మొదలు తెల్లవారుజాము వఱకు ధ్రువచరిత్రము దాసకవీంద్రు లాడుచుఁ బాడుచుఁ జెప్పెను. అందులకు పంతులుగారు

---

శ్రీదాసకవీంద్రులు కీర్తన లందలి రాగములు స్వరములు పాడుట పద్యముల నుచితరాగమున గాన మొనరించుట- సంగీత సాహిత్యములు పూసలలో దారమువలె సరిగాఁ జూచుటమున్నగు విశేషంబులను జక్కఁగాఁ బాటించుట యేమరకచూచెడివారు. సంగీతసాహిత్యప్రతిభ లున్న వారగుటచే నారెంటిని సమన్వయపఱచి యాధ్యాత్మికవిషయములను వివిధార్థము లందుఁ బోధించుటయే పరమార్థముగా భావించిన పుంభావసరస్వతులు.



ముద మొంది వారినిఁ బరిక్షించుటకు నై దురూహ్యములను నొసఁగెను. యథాలాభసంతుష్టిపరు డగు కవీంద్రు డందులకు నానందమును జెందెను. పిదప పంతులుగారు "దాసకవీంద్రా! యీకథయందలి పద్యగద్యములు హృద్యములుగా నున్నవి. ఇది మీ రచనకు సాధ్యపడినవేనా!" యని పలికెను. అందులకు దాసకవీంద్రుడు మందస్మితులై "అందులకు మీరు డెందమున సందేహింపఁ బనిలేదు. మీయభిమతకథ నేదేని నొసఁగినచో దానిని ననవద్య పద్యగద్య మిళితముగా రచియించు బాధ్యతను శిరసావహింపఁ గల" నని పలికెను. అందులకు వారు "మహాభక్తాగ్రగణ్యుఁ డగు అంబరీషోపాఖ్యానమును యథాతథంగా-హృదయభేదనగా - రంజన-మొదవఁగా రచింపుఁడు. అందాఁక మాగృహ మందే యుండి నా ప్రక్కన భోజన మొనరింపుఁడు. ఆదివారము నాఁడా కథను బుధుల సమక్షమున బ్రదర్శింపఁ జేయుఁ" డని పలికెను. పిదప నాఁటి రాత్రి దాసకవీంద్రు లంబరీషోపాఖ్యానమును సర్వ జనహృదయానందకరముగా రచించి యావిషయమును మఱు నాఁడు పంతులు గారికిఁ దెలిపెను. ఆదివారము నాఁడు పంతులు గారు సభను నేర్పాటుఁ జేసిరి. నాఁటి సభకుఁ పండితపామరు లెల్లరు నాహ్వానింపఁ బడిరి. అప్పుడు సభయందు నా నంబరీషోపాఖ్యానమును - వినిపించిరి. అచ్చటఁ జేరిన పండితశ్రోతలు పామరులు వారికథారచనానై పుణ్యమునకు నృత్యగానవిశేషాదులకు వారి వివిధశాస్త్ర పరిచయజ్ఞానమునకు నబ్బురపడి పెల్లుబ్బిరి. పిమ్మట పంతులుగారు దాసకవీంద్రులకు సింహతలాటపు మురు

గులు రెండు శాలవలు బనారసు పట్టుపీతాంబరములు ఆరువందల రూపాయలను నొసఁగి సన్మానించిరి.

ఒకనాఁడు విజయనగర దివాను శ్రీపెన్మత్స జగన్నాథ రావుగారు దన వీధి యరుగుమీఁదఁ గూర్చుండెను. ఆమార్గమున దాసకవీంద్రుఁడు పోవుట జూచి దివానుగారు "దాసకవీంద్రా కేశము లందము చిందునట్లు దువ్వినావు. శ్రీ పిఠాపుర సంస్థానాధీశులకుఁ బరిచయలేఖ నొసంగెదను. అచ్చటకుఁ జని నీకథాగానాదులచే మెప్పింపు"మని పలికి యప్పుడే లోనికిం జని వ్రాసి తెచ్చి యిచ్చి "నీకేశములు మాత్రము జాగ్రత్తసుమీ" యని మందహాసమునఁబలికెను. దాసకవీంద్రుఁ డందులకు భయమొందఁ బని లేదని దానిఁ గొని చని మఱునాఁడు పేరన్నగారితోఁ గలిసి పిఠాపురమునకుఁజేరి యాసంస్థాన దివానుగారిని దర్శించి నమస్కరించి యాలేఖ నర్పించెను. అందుల కాతఁడు సమయమును

---

వారు స్వరశుద్ధికొఱకు వీణావాద్య మభ్యసించి వివిధసంగీతగ్రంథములను బరిశోధించి నిజగానమును నిర్దుష్టముగా నొనరింపఁ జేసికొనిన నారదాపరావతారవ్యక్తులు - గానసభలందును - శ్రీరామనవమీ ఉత్సవములందు - దాసకవీంద్రుని - కథాగాన కాలక్షేపాదులు - రాజమహేంద్రవరమునందును - బరిసరగ్రామములందును - జరిగి - యనేక సన్మానములను వారు పొందఁ గలిగిరి. "చింతామణి హాలునందుఁగూడ టికెట్లఁనుబెట్టిగూడ హరికథలను జెప్పిరి.



జూచి రాజదర్శనమును జేయించెద నని యందాఁక తమగృహమున నుండు మని పలికెను. దివానుగారా నాటిరాత్రిఁ దమ గృహమునదాసకవీంద్రులచే గానకాలక్షేపమును జేయించి యాలించి యానందించెను. మహారాజావారా విషయమును పరోక్షమున విని దాసకవీంద్రులను గోటలోని కాహ్వానించి గౌరవించిరి. పిదప దాసమహాకవీంద్రులచట రెండు హరికథలను హృదయంగమముగాఁ జెప్పిరి. శ్రీవారు వానిని విని వారి సంగీతసాహిత్య ప్రతిభలకు మెచ్చుకొనిరి. పిదప దేవరవారిని వీడ్కొని దాసకవీంద్రులు దమ బసకుఁ బోయిరి. మఱునాఁడు దాసకవీంద్రులకు నాహ్వాన మంపి పిలిపించి యుచితాసీనులఁ గావించి యొక సేవకుని బిలిచి కైజారును దెమ్మని పంపించెను. ఆమాటలను వినినంతట దాసకవీంద్రులకు పిఠాపురం దివాను గారి పలుకులు జ్ఞప్తికి వచ్చి తాను నిర్దోషినిఁగదా యిట్టివిపరీత మేల జరుగు నని మిక్కిలి ధైర్యముతో నుండెను. పిమ్మట సేవకుఁ డద్దానిఁ గొని దేవ దానిని శ్రీవారుగైకొని 'దాసమహాకవీంద్రా! మీప్రతిభ నిరుపమానము. చంద్రునకు నూలుపోగన్నట్లుదీనిని దీనికిఁ దోడుమూడు వందలరూపాయలను మీకు నొసఁగుచున్నారము. ఇందులకు మీకు సంతుష్టియేనా? అసంతృప్తిఁగల బ్రాహ్మణుఁడు నష్టపడుఁడుగదా' యనిపలికెను. అంతట దాసకవీంద్రుఁడు ముదమందుచు "ప్రభూ నాకెప్పటికి సంతృప్తియే" యని వానినిఁ గొనియెను. పిమ్మట మహారాజు నవ్వుచు నొక విలువైన శాలువను గూడఁ దీసి యిది కూడ మీరలంకరింపఁ దగునని పలికి దానిఁ బ్రేమతో దాసకవీం

ద్రుల కలంకరించెను. అంతట దాసకవీంద్రుఁడు "మహాప్రభూ! నేనెప్పుడు సంతుష్టిపరుఁడనే పరులను పలుకులకు పై పలుకు స్వభావమును గలిగియుండువాఁడ నగుటచే నిట్లంటిని. నన్ను మన్నింపఁ గోరుచున్నాఁడ" నని విన్నవించెను. అందులకు మహారాజు ముద మంది "బహుమానము ప్రతిసంవత్సర మీవిధముగనే జరుగు" ననిపలికెను. అంతట శ్రీవారిని వీడ్కొని తిరిగి పిఠాపురమునకు జేరి దివానుగారి కాబహుమానములను జూపెను. అందుల కతండు సంతసించి "బాగున్నది. మీరు కేశములను భద్రముగాఁ గాపాడు కొని వచ్చినందులకు మిక్కిలి సంతోష" మనిపలికెను.

ఖాసింకోట జమిందారు తన కుమారుని వివాహసందర్భమునఁ బ్రఖ్యాత సంగీతవిద్వాంసుఁ డగు పప్పువెంకన్నను హరికథా కాలక్షేపమునకు శ్రీ దాస కవీంద్రులను నాంధ్రదేశ మందలి ప్రఖ్యాతి పండితులను నాహ్వానించెను. వెంకన్నగారి సంగీతసభ యొకనాఁడు జరిగెను. మఱునాఁడు దాసకవీంద్రుల హరికథ యయ్యెను. వెనుకపాటపాడు పేరన్నగార్లానాఁడు రాలేనియందునఁ దనకు సాయ మొనరింపు మని వెంకన్నగారిని గోర నతడందుల కంగీకరించెను. ఆనాటి హరికథలో దాసకవీంద్రులు విద్వాంసులు మెచ్చునట్లు పాండిత్య ప్రకర్షణములను బ్రదర్శించి సంగీత ప్రతిభావంతుఁడగు వెంకన్నగారికిఁ దనసంగీతపాండిత్యమును జూపి యాతనికిఁ దనపై సదభిప్రాయము సంపాదింప వలెనను కోరికతో సర్వవిధసంగీత విశేషంబులను ప్రదర్శింపు



చుండెను. సంగీతనిధి వెంకన్నగారు విసిరినప్పుడు దాసకవీంద్రులాపైని రాగమును బాడుటయు - నతఁడు ముక్తాయించి నప్పుడు పై ముక్తాయింపు జూపుటయు నొడలెల్ల లయజ్ఞాన మగపరచు నృత్యకళావిన్యాసము ప్రకటించుచు హరికథాగాన మత్యద్భుతముగా నొనరించెను. హరికథానంతరము తిరుపతి వెంకటేశ్వర కవులు మహదానందభరితులై యాశువుగా నభినందనపద్యములను జదివిరి. పిమ్మట పప్పువెంకన్న గారు దాసకవీంద్రులను బరిష్వంగ మొనరించుకొని "దాసకవీ! నీకుగురుకటాక్షము లేకుండగనే సరస్వతీ వీక్షణమునఁ సంగీత సాహిత్యాదులు నీకు సంప్రాప్త మైనవి. ఇంతియేల? నీకు వాణియే నీజిహ్వాగ్రమందుఁ దాండవించుచున్నది. నీయందు ముందు నాకొందిన దురభిప్రాయము నేటి సంగీత ప్రావీణ్యాదులను గాంచి నంతట వాయువు ప్రసరించిన వారిదము వలెఁ బరుగిడినది." యని పలికెను.

క్రీ॥ శ॥ 1923 సం॥ కాకినాడలో కాంగ్రెసు సభలు జరిగెను. ఆసందర్భమున కార్యనిర్వాహక వర్గము వారు శ్రీదాస కవీంద్రులను హరికథా కాలక్షేపమునకు నాహ్వానించిరి. అప్పుడు దాసకవీంద్రులు రుక్మిణీకళ్యాణమును గాన మొనరించెను. ఆనాటి సభకు మహాకవయిత్రి సరోజినీనాయుఁడు అలీసోదరులు ఉత్తర దేశీయప్రముఖులు విచ్చేసిరి. దాసకవీంద్రుల కథాగాననైపుణ్యాదులను విని కవయిత్రి సరోజనీనాయుఁడు మిక్కిలి యానందించి

లేచి కవీంద్రులకడకుఁ జని మీనృత్యము మనోజ్ఞముగా నున్న దని (your dance is exquisite) ప్రశంసించిరి. ఉత్తర దేశీయులు గూడ మిక్కిలి యందులకు యానందించిరి.

క్రీ॥ శ॥ 1912 సంవత్సరమున రాజమహేంద్రవరమున దాసకవీంద్రులు హరికథాకాలక్షేపము లొనరించిరి. ఆసభలకు నాంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావు పంతులుగారు రాయబహదూరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు సూక్తిసుధానిధి వసురాయకవిగారు వైయాకరణ శ్రేష్ఠులు మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు సభికులుగానుండిరి, దిగ్దంతసమాన సమ్మిళితమైన యాసభలో దాస మహాకవీంద్రులు జూపిన సంగీత కవితానృత్యకళావిలాసంబులు వర్ణనాతీతము లయ్యెను. మహాదాసకవీంద్రులకు పురప్రముఖుల సమక్షమున నవరత్నఖచితమగు భుజకీర్తిని శ్రీవీరేశలింగముపంతులుగారిచే నిప్పించి యధిక సన్మాన గౌరవము లొసంగిరి. అనాఁటి సన్మానసభ చరిత్ర ప్రసిద్ధమైనది.

ఒకపరి సర్వవిద్యల కాణాచి యగు విజయనగరము నందు, బండితసభ జరుగుచుండెను. అందు దిగ్దంతు లనందగు శ్రీచెళ్లపిళ్ల శాస్త్రిగారు వ్యాకరణనిధియగు శ్రీరాయుడు శాస్త్రి గారు మున్నగు వారందుఁ బాల్గొని యుండిరి, సభయందు సంగీతసాహిత్య వ్యాకరణాదులను గూర్చి చర్చింపఁ బడుచుండెను. ఈవిషయమును విని దాసకవీంద్రు లచటికిఁ జనెను. అప్పు డొక



పండితుఁడు "దాసకవీంద్రా! ఇది పండితసభ. ఇందు సాహిత్యాదులను గూర్చి చర్చింపఁ బడుచున్నవి. మీరు హరికథా పితామహులుగదా" యని పలికెను. అందులకు దాసకవీంద్రుఁడే మాత్రమును గించపడక మందస్మితమున సంగీతశాస్త్రజ్ఞుఁ డిందున్నచో నన్నురావలదని సాహిత్యధనుఁ డిటఁ నున్నచో నన్నుఁ బాల్గొనవలదని వ్యాకరణ పండితుఁ డిచట నుండినచో నన్నుఁ బ్రవేశింప వలదని యనఁగలరు. ఒకవేళ నట్లున్న నన్నిశాస్త్రములు మీకే స్థానమన్న నాకెందైన స్థాన మున్నదా!" యని పలికెను. అప్పుడు శ్రీ చెళ్లపిళ్ల శాస్త్రి గారు నవ్వుచు "దాసపండిత కవీంద్రా! మీరిందు విషయమున డెందమున నాలోచింపఁ బనిలేదు. మీకన్నిటి యందుమీకుఁ బ్రత్యేకమైన ముఖ్యస్థానమొకరొసంగఁ బనిలేకుండగ మీరే స్వాధీన మొనరించుకొంటిరి కదా" యనెను.

---

గీ॥ తానెఱుంగుదు, ననెడి విద్యలకు మేర
అలఁది గంతపురేఖ హద్దట్లుతోఁచు
గాన సంపూర్ణ పాండిత్య మూనితన
నులికి సభనాఁడుటలు, పిచ్చికళలుకావె (శ్రీ శాస్త్రిగారు)

దాస కవీంద్రులు - ముఖప్రీతి వాక్యములకు వ్యతిరేకి; నిర్భయముగాఁ బలుకసాహసి. అందుచేత పండిత బృవు లీతని నిరశించుటయుకలదు. పరోక్షమున దాసకవీంద్రుని విమర్శించుటయు కలదు.

ఏలూరు నందుఁ బ్రముఖ న్యాయవాది యగు సోమంచి భీమశంకరముగారితో దాసకవీంద్రులకు స్నేహిత మొనఁ గూడెను. అచ్చటఁగల వేశ్యాంగనలు తమగురువగు సంగీత విద్వాంసునకు దాసకవీంద్రునకుఁ బోటీపడిన యెడలఁ జూడ నిచ్చగించి తమగురువులను బ్రోత్సహించిరి. అతఁడు ప్రతిమాన సంగీత విద్యావిశారదుఁడే. ఒకనాఁ డిరువురకు బోటీ జరుగు చుండెను. అన్యోన్య జయాపేక్షలతోఁ బాడుచుండిరి. శారీర గాంభీర్యగాన మాధుర్యాదు లా సంగీత విద్వాంసునకు లేకుం డుటచేతను గర్ణాట హిందూస్థాని బానీలను జోడించి గాన మొన రించు నేర్పు లేకుండుటచే విద్యుద్దీపము సన్నిధి దీపమువలె నతని సంగీతము దాసకవీంద్రుని గానమునకు సరిగాకుండెను. అందుల కాతఁడు పల్లవి పాడుట మొదలిడి యొక గతిలోనుంచి మఱియొక గతిలోనికిఁ దాళమును మార్చి గాన మొనరింపఁ దొడఁగెను. అంతట దాస కవీంద్రు లదిచూచి "మీరు వెనుకటి

---

గీ॥ ఎఱ్ఱచీరఁ జూచి - వెఱ్ఱియొనలుబెట్టి
పరుగులిడుచు - నార్చు బఱ్ఱెవోలె
ప్రతిఁ జూచి యోర్చు ప్రాజ్ఞతలేమిపై
కుబ్బి శక్తిహీనుల్బల్కు చంద్రుగాదె.

"విన్నమురా - పాట - గన్నామురా నృత్య
విన్యాసవీచికల - విహరించు మధురిమలు"
(దాస కవీంద్ర హరికథా భంగులు)



తాళమును జేతితో వేయుచు రెండవ గతిలో నోటపాడినయెడల మఱింత బాగుండును. అప్పుడు మీకు శాస్త్రబద్ధమైన సంగీత జ్ఞాన మున్న దని తలంచెద" నని పలికెను. అందుల కతఁడు సమ్మ తించి యట్టులఁ బ్రయత్నించెను, గాని విఫలమనోరథుఁ డయ్యెను పిదప దాస కవీంద్రులనుగాంచి "నాకుఁ దేలికగాఁ జెప్పితివి. నీ వాపోలిక లైనఁ బ్రదర్శింపగలవా!" యని పలికెను. అందు లకు దాసకవీంద్రుఁడు "అదికూడ నొక విద్యయేనా" యని సుల

---

"పిఠాపురం మహారాజాగారు బ్రాహ్మణునిపైఁ గోపము వచ్చినప్పుడు అతని కేశములు కోయించి పంపునను ప్రతీతిఁ గలఁదు."

"బహుముఖ ప్రజ్ఞాశాలి యైనను హరికథా ప్రాశస్త్య మును సంపాదించుకొన్నను దాసకవీంద్రులు నిలుకడలేని చిత్త వృత్తితో లోకమును లక్ష్యమును జేయక పోకిరి వలె బాహ్య ప్రవర్తనమును గావింపుచు స్వేచ్ఛాసంచారియయి యుండెను. అప్పటికి స్వయముగాఁ బ్రస్థానత్రయము వేదాంత గ్రంథములు ఇతరగ్రంథములు రచనావ్యాసంగమును గావింపు చున్నను వైరాగ్యభావ మింక సంతరించు కొనకుండెను. పైన భంగు నిషాకు నలవాటు పడిరి. ఆనాటి సంగీత విద్వాంసులు 'పొడుగు మహలక్ష్మి' యను వేశ్యాంగన గృహమున దానిని దయారు చేసికొని సేవించి నిషామత్తులో తమతమ గానప్రావీణ్యతలఁ బ్రదర్శించెడివారు.

భముగాఁ దాను జెప్పిన విధముగాఁ జేసి చూపెను. అందుల కా విద్వాంసుఁ డపరిమితానంద భరితుఁడై "దాసమహాకవీంద్రా మీసంగీత కళాకౌశల్యము- నిరుపమానము. అప్రతిహతము నీవు నాకన్నఁ బ్రాయమును దక్కువ వాఁడవగుటచే నీసంగీతశక్తి సామర్థ్యములకు నాహృదయపూర్వక వందనము లనిచెప్పి వీడ్కొనెను. దాస కవీంద్రుఁడు - ఏలూరునం దనేకపర్యాయములు టికెటు మీఁదను ధనవంతుల గృహము లందు హరికథాగానము లొనరించెను.

దాసకవీంద్రులు బందరులో దనమిత్రుఁడగు పెద్దన్న గారిచట బసఁజేసెను. ఒకనాఁడు వారి యింట గానసభ జరిగెను. ఆ సభకు చెన్నపట్టణము కాంచీపురములనుండి సంగీతవిద్వాంసులు వాద్యనిపుణు లనేకు లరుదెంచి యందుఁ బాల్గొనిరి. అం దిరువదిమంది సంగీతవిద్వాంసులుకూడి పల్లవి బాడుచు వాయింపుచుండిరి, దాసకవీంద్రులు కూడ నుండిరి. అప్పుడు దాసుగారు గృహయజమాని కోరిక మేరకు నదివఱకు నాల్గవ కాలమున ,నారక్షరములు జాగాచేసి గాన మొనరించు పల్లవి నైదవకాలము విలంబముగా మార్చి యేకాక్షరమును జాగాఁజేసి మూఁడావృత్తములనుగాన మొనరించెను. అందలి వాద్య నిపుణులేవిధముగా సాధ్యపడక తడఁబడఁ జొచ్చిరి. అప్పుడు దాస కవీంద్రులు "ఎంతటి యాశ్చర్యము. ఇంతటి సంగీతవిద్వాంసులుండి కూడ యొకఁడైన జాగా గ్రహించి జాగాకు రాలేకుండుటయాశ్చర్యకరముగా నున్న"దని పలికెను. మృదంగవాద్య నిపు



ణుండైనను నొకసారి యైనను ముక్తాయింపఁ జాలకుండెను. సభికులెల్ల రది చూచి దాసకవీంద్రులఁ బోలిన పండితుం డిందాఁక రాలేదని వారిని మిక్కిలి శ్లాఘించిరి.

బందరులో పంతులు గారి గృహమున నష్టావధాన మొనరించిరి. అందు వేరు వేరుగా రెండు చేతులఁ దాళమును వేయుచు రెండు పాదముల రెండు తాళములను వేయుచు కోరి ముక్తాయింపులతోఁ బల్లవిఁ బాడుటయు కవితాసంభాషణ లొనరించుటయు మున్నగు నద్భుతకృత్యము లొనరించి సభికుల మెప్పునుబొందిరి.

అచ్చట దాసకవీంద్రుల సంగీతసాహిత్యములఁ జూచి యీర్ష్యఁ జెందిన పండితు లనేకు లుండిరి. వారు దాసకవీంద్రులను నోడించి పరాభవింపఁ దలఁచి సభ కాహ్వానించిరి. శ్రీవారి స్నేహితుని ప్రోత్సాహబలమున నాసభకుఁ బోయెను. అందు షుమారు రెండువేలమంది ప్రజలుండిరి. అందుఁ బ్రతికక్షులు దాసకవీంద్రులకు వర్ణములు కృతులు రావనియు వచ్చినచోఁ దాము పోలిన వర్ణములు కృతులు గాన మొనరింప వలె నని యనిరి.

---

ఈ విషయము 'బుధవిధేయిని' అనుపత్రికలో జాలఁ జుల్కనఁగా వ్రాయఁబడినది. అది చూచి "కలుషహారిణి" యను పత్రికలో నష్టావధాన మత్యద్భుతముగా దాసకవీంద్రులనేఁ జేయఁబడిన దని వ్రాయఁబడినది.

ఖాసింకోట పప్పువెంకన్నగారను సంగీత విద్వాంసుఁడు పిఠాపురం రాజాగారివెంట మదరాసు పోయిరి; వారితో ఆదిభట్ల

ఆ మాటలకు మహాకవీంద్రుని శిష్యుఁడు సంగీతసాహిత్య విధి - ఆశుకవితా ప్రజ్ఞావారధియైన మహాపండితునకు వర్ణము లడుగుట సమంజసము గానేర దని వారుకోరిన గ్రంథ మంతయు వారి శిష్యుండ నగు తాను బాడెద నని పలికెను. అప్పుడు దాస కవీంద్రులు శ్రోతృరంజక స్వరసందర్భము సంగీతము గాన నిచ్చటఁ గల సంగీతవిద్వాంసులు గాని వీరిలోఁ గొందఱు గాని యొక గంట గాన మొనరింప వలయును. పిదప నేనొక గంట గాన మొనరించెద ననిపలికెను అంతఁ బ్రతికక్షులు వారిలో వారు దర్కిం-ంపుకొనుచు నట్లు గావింపఁ జాలక యందుండి తిరోగమించిరి. పిదప దాసకవీంద్రు లద్భుతసంగీత ప్రదర్శన ప్రకర్షణములచే సభారంజన మొనరించి స్తోత్రార్హుఁడయ్యెను.

---

పేరన్నగారు కూడనుండిరి. అచ్చట విక్టోరియామహలులో సంగీతసభలు జరుగుచుండెను. మహారాజావారు ప్రతిదిన మరిఁగి విని యానందించెడివారు. ఒకనాఁడు నిర్ణీత మైన నాయకుఁడు రాకుండుటచే వెంకన్నగారు గానమొనరించుటకు నేర్పాటయిరి. సభ యథాక్రమముగా బ్రారంభ మయ్యెను. వెంకన్నగారి పాటను విని శ్రోతలందరు హెచ్చుగామెచ్చుకొనిరి. మహారాజావారు గూడ విచ్చేసి విని గాయకునిఁ జూచి వేంకన్నగా రని పోల్చి యద్భుతముగా గాన మొనరింపుచున్నారని యాశ్చర్యపడిరి. గానసభాకార్యదర్శి గారు సభానంతరము వేంకన్నగారి సంగీత కళాకౌశల్యమునకు మిక్కిలిశ్లాఘించిరి. మహారాజుగారు వేంకన్న



దాసకవీంద్రులు పేరన్నగారితోఁ గలిసి చెన్నపట్టణమునకుఁ జేరిరి. అచ్చట సోమంచి భీమశంకరము గారింట బసఁ జేసిరి అప్పుడొకనాఁడు హైకోర్టున్యాయవాది యగు రెంటాల సుబ్బారావుగారు అచ్చటకు వచ్చిరి. వారు దాసకవీంద్రులను జూచి వారికవిత్వాదులను విని యిద్ద రన్నదమ్ములను దమగృహమునకుఁ గొంపోయెను. పిదప గుజరాతి పేటలో నున్న గుజరాతీ బ్రాహ్మణుఁడు హైస్కూలు హెడ్మాష్టరును చంద్రశేఖరశాస్త్రిగారు దాస కవీంద్రుల శక్తిసామర్థ్యములను గుర్తెరింగి వారిచేత హరికథా

---

గారిని మిక్కిలి ప్రశంసించెను. వెంకన్నగారికి దాసకవీంద్రులపై నభిమాన మున్నను దాసకవీంద్రుల సంగీతమును గూర్చి యంత సదభిప్రాయము లేకుండెను. అందులకు దాసమహాకవీంద్రుఁడు సరస్వతీ ప్రసన్నత నార్జించి యుండుటయే. పిదప దాసకవీంద్రుని ప్రతిభను గుర్తించిన పిదప వారికడ ప్రహ్లాద చరిత్రములోఁగల మేళకర్తరాగములతోఁగూడిన కీర్తన లభ్యసించెను.

శ్లో॥ నవరసరుచి వేది - సర్వభూతాను వాది
లలిత చరణ చారీ - సాధ్వలంకారధారీ
పరవశసుఖ యోగశ్చిత్ర సంకల్పభోగ
అతులలలితరూపః సర్వవేద ప్రశాంతిః
సకల జన సమానః సర్వతంత్రః స్వతంత్రః
విజిత మనయసోక్త విద్యయా సద్యసస్కః

(హరికథకుని లక్షణములు)

గాన కవిత్వప్రదర్శనలఁ జేయించి ఘనముగా సత్కరించిరి. శ్రీ పనప్పాకము ఆనందాచార్యులుగారా దాసకవీంద్రుల సంగీత సాహిత్యముల కత్యామోదమునఁ దనగృహమున నొకహరికథను జేయించి మిక్కిలి సత్కరించెను.

ఆచార్యగారు దాసకవీంద్రులను రివిన్యూబోర్డు మెంబరు అగు గ్రోలుదొరగారి యొద్దకుఁ గొనిపోయి వారికిఁ బరిచయ మొనరించెను. అచ్చట దాసకవీంద్రులు నిజసంగీత కళానైపుణ్యములను బ్రదర్శించెను. దాసుగారి గానమునకు దొరగారిసతి మిక్కిలి యానందించెను. మెంబరు దాసకవీంద్రుల మిక్కిలి సత్కరించి "రామనాథరాజాగారికి సిఫార్సు లేఖ నొసఁగెదనని యచ్చట సత్కారగౌరవాదులు లభింపఁ గల" వని పలికెను. అందులకు దాసకవీంద్రు లంగీకరింపలేదు. నిష్కామయోగులకు ధనసంపాదన మీఁద నెక్కువ యాశ యుండదుకదా!

ఆచార్లుగారి ప్రోత్సాహమున బెంగుళూరు పోవుచున్న మధ్యమార్గమున దాసకవీంద్రులకు రేంటాలసుబ్బారావుగారి తంతి నందెను. వెంటనే తిరిగి మరలఁ జెన్నపట్టణమునకుఁ జేరిరి. మఱునాఁడు గానసభజరిగెను. ఆసభలో దాసకవీంద్రులు భైరవీరాగమును బాడుచుండిరి. సభికు లానాఁడు దాసకవీంద్రుల యపూర్వసంగీత కళాప్రావీణ్యమునకు ననూనశారీర సౌందర్యమునకు సమయస్ఫూర్తిగఁ బ్రకటించు వివిధశాస్త్రజ్ఞానబోధలకు వివిధభాషా సంబంధములకు శ్లాఘింపుచుండిరి.



వాద్య ప్రవీణులా దాసకవీంద్రుల గానమునకు వాయింపలేక తడఁబడుచుఁ బల్లవి యందుఁ గూడ నొకసారి యైనను జాగాకు రాలేక మదపుటేనుఁగుచేఁగొట్టఁబడిన కమలముల పలె బిక్కమొగములతో నుండిరి హైకోర్టున్యాయమూర్తి ముత్తుస్వామయ్యగారి కోరికపై దాసకవీంద్రు లానందభైరవి రాగమును బాడుచు ఫ్లిడ్లైరా రాగము లెంతో చక్కఁగా వాయింపుచు వారిని రంజిపఁ జేసెను. సభానంతరము న్యాయమూర్తి దాసకవీంద్రులను శ్లాఘింపుచు నీ మహాదాస పండిత కవీంద్రుల గాన ప్రావీణ్యము శారీరలావణ్య మగణ్యమైనది ఔత్తరాహుల లయజ్ఞాన మత్యుత్తమమై శ్రోతల చిత్తముల కింపు దళ్కొత్తుచుండును. ఇతఁడు పల్లవిలో సాటిలేని మేటి. ఈ మహాదాసకవి పాడిన హిందూస్థానీరాగము మాకంత దెలియలేదు. ఇం దీతఁడు గొన్నాళ్ళున్నచో నిచ్చటి మెచ్చెడిగాయకుల నచ్చుదలఁ గ్రహిం

---

కారణజన్ముఁడై విబుధకాండ శిరఃప్రశిధానయోగ్యుఁడై
సారములేని కావ్యవిభవంబుల కెల్లను బైడిగడ్డయై
భూరికళావిభూతికిని బుష్కలమైన మనోజ్ఞపీఠమై
ఏరికి సాటిరాని పరమేశ్వరు డీతఁడనంతశక్తిచేన్

ఆయత పుణ్యకర్మముల నాంధ్రియొనర్చినదానికిన్ ఫలం
బీయనఘాత్ముఁ డీభువి జనించుట తజ్జనిఁ జేసి సత్కళా
శ్రీయవతార మొందె గుణసింధువు వీణదితంబు లొచు నా
రాయణదాస నామము నిరంతరమున్ భువి నిల్పి పోవఁగన్

చుట నిశ్చయు"మని పలికెను సన్మానాంతరము సభముగిసెను.

తరువాత శ్రీ సుబ్బారావుగారు దాసకవీంద్రులను గాంచి "దాసకవీంద్రా నాపంతము నెగ్గించిన నిన్నుఁ గొనియాడుటకు నాకు సాధ్యముకాదు. ఇందలి సంగీతవిద్వాంసులకు నాకు మిమ్ములఁ గూర్చి జరిగిన వాగ్వాదము నకు తుదకు వారికి మనః ఖేదము నాకు మోదము పండితామోదము - పామరసమ్మోదము లభింపఁ జేసితిరి. నిజముగా మీరు మానవరూపమున నున్న గంధర్వులే" యని శ్లాఘించిరి. ఫిడేలు వాద్యమునఁ గీర్తిఁ గన్న విద్వాంసుఁడు మృదంగవాద్యమున నభంగయశోసంగుఁడు నాటి సభవదాసకవీంద్రులచే శృంగభంగపడిరి. నాఁటిదినపత్రికలన్నియు నేతద్గానహరికథాప్రావీణ్యతలను గొప్పఁగాఁ బ్రశంసించినవి.

---

శాస్త్రఘను లుండ వచ్చునుఁ బ్రశస్తి గన్న
కవులు గాయకుల్ మఱి నటకజనులుండ
వచ్చుఁ గాని సర్వకళల పార మెఱిఁగి
జనుల యెదఁ బుచ్చుకొన్న సజ్జనుఁడితఁడె
(శ్రీ చెల్లపిళ్ల వేంకటశాస్త్రిగారు)

భంగుపాట

మాలచ్చి భంగుపాట - నేర్పర్చుచున్నపూట - కడు
హెచ్చు నాచుపాట - జగమెల్ల నాకొకరుూట ॥మా॥
చెలు లైన నోటిచుట్ట యొకచేతఁబొడుము చిట్ట
తొలుదొల్త సన్నపుటొడ్డు - తెలవారేదాకలడ్డు ॥మా॥



బెంగుళూరు నందు మదరాసు వాసి యగు ఆనందాచార్యుల వారి సోదరుని గృహము నందు పేరన్నగారు దాసకవీంద్రుల బసఁజేసిరి. వారు విశ్రాంతి జూచుకొని దాసకవీంద్రుని గాన మొనరింపు మని కోరెను. అంతట దాసకవీంద్రులు తంబురా శృతిఁజేసి సావేరీ రాగమును మధురాతిమధురముగా గాన మొనరించెను. ఆచార్యావారి సోదరుఁడు సంగీత విద్వాంసుఁ డగుటచే దాసకవీంద్రుల గానామృతమును గ్రోలి మిక్కిలి యానందించి శ్లాఘించెను.

మహారాజావారి దర్శనము గలుగుటకు ముందు దాసకవీంద్రులు నచ్చటి పరీక్షకుల యాదేశము మేరకు పేరన్నగారు తంబురా శృతివేయఁగా, ధన్యాసీ రాగమును గాన మొనరింపఁ దొడఁగెను. ఆరాగధ్వని బంగళా యంతయుఁ బ్రతిధ్వనియాయెఁ దొడఁగెను. అప్పు డొక బిక్షి వచ్చి దాసకవీంద్రులను గాంచి మీగానమును బరోక్షమున నాలించిన మహారాజ మహదానందమును పొందిరి. ఈ రాత్రి మీప్రదర్శనము మహారాజావారి సమక్షమున జరుగుటకు కల వైన దని పలికెను.

---

గుంటూరు గానసభ

ఉ॥ సర్వభారతీయాపి పరస్పర మైత్ర్యామోదాన్తమ్
ద్రు॥ ఉర్వీమండలేఽ నవరతం - కృతయుదీర్మేవ ర్తీన్తామ్
మే॥ వాగ్దేవీ కృపయానితాన్తమ్
చ॥ ప్రతివత్సర మీదృగ్గానసభాః పత్తనేషు జాయన్తామ్
సతత మానేతు నగం నత్సంగ గుణాగియన్తామ్

ఆనాఁటి రాత్రి సభాస్థలిని మహారాజా వారొక సోఫా పైఁ గూర్చుండిరి. ఒక ప్రక్క ప్రభుత్వోద్యోగులు మఱియొకదిశ మహారాణి వారు పరివారము లాసీను లయి యుండిరి. శ్రీ దాస కవీంద్రులు - దేహ మంతయు జందనపుఁబూఁతఁ బూసియు నేత్రములకుఁ గాటుక నీటుగాఁ నలఁది, ఫాలతలంబుపై దిలకమును దిద్ది సిగముడికి బూలదండను జుట్టి మెడలో నొకపూలమాలను ధరించి పీతాంబరమును ధరించి కాశీశాలువను నడుమునకుఁ గట్టి కాళ్ళగజ్జెలతో జేతనొక శ్రీరామ పట్టాభిషేక చిత్రపటమును ధరించి చొక్కాపాగాలతో తంబురా పట్టికొని పేరన్నగారు వెంట రాఁగ సభాభవనమునఁ బ్రవేశించి తనచేతి పటమును నొకకుర్చీ పైనునిచి దానికొక పుష్పమాల నలంకరించెను. వెంటనే మహారాజా వారొక పూలమాలను దాసకవీంద్రుని కంఠమున నలంకరించెను. ఆహా! దాసమహాకవీంద్రుల సుకృత మెంత వర్ణనాతీతము! ప్రథమమున దాసకవీంద్రుఁడు ప్రార్థనాశ్లోకమును ఖమాచిరాగమునఁ గాన మొనరించెను. పిదప వినాయకస్తోత్రమును జక్కఁగా మధురాతిమధురముగాఁ బాడెను:

---

వాగ్దేవీకృపయావితాన్తమ్

పిఠాపురం :

గీ॥ కుక్కుటేశ్వర మాధవులొక్కరొక్క లిఢఁడ
నెచ్చటన్ రావుదొర లభివృద్ధిఁ గంద్రు
తెలుపుఁ జిన్నిపూఁదేనె జనుల యెద నెంట
కల్మి కాపురమా పీఠికా పురంబు



ఆ దాస మహాకవీంద్రుల గానమాధుర్యమును గ్రోలుచు నానందాతిశయమునఁ దలనూపుచు "మీపాట - మిక్కిలి తీపిగా నున్న దని పలికిరి, ఆనాడు దాసుగారు అంబరీష చరిత్రమును సంస్కృతాంధ్రము లందుఁ బాడుచు కథాభాగము నంతయు నాంగ్లము లోనికి ననువాద మొనర్చు చుండుటచేత మహారాజా వారికిఁ గథాభాగము నంతయుఁ దేటతెల్ల మయ్యెను. మహారాణీ వారికిఁ గూడ నర్థమై సంతోష జనక మయ్యెను. అందము చిందు శరీరసౌష్టవమునకుతోడు మృదుమధుర గంభీరకంఠారావము దానికి నైఁదోడుగా సత్యుత్తమ వృత్తవిలాసము గలిగిన దాసమహాకవీంద్రుల కళానైపుణ్యమునకు సభ చిత్రమున లిఖింపఁ బడినట్లై

---

శ్లో॥ హేరంబ లంబోదర వక్రతుండ!
సదావతంసీకృత చంద్రఖండ!
సమస్త భక్తాభయదానశౌండ!
నిజప్రభాభాసిత పద్మజాండ!

కళ్యాణి : మిశ్రగతి :

ప॥ కరిరాజవదన సజ్జనచిత్తసదననేఁ- గనిపెట్టుకొంటి వీరాక
పపపాపపపామాపదపాదనిదపమగా - మగారి నీసారిగారి

అ॥ కరమరుదుగ నెల్క గుఱ్ఱమెక్కి వేగకదలిరా వేలపరాక
సనిసనిససరీరి గామా పదనీదపమగరీ-నిదపమగరీనీపామగా॥

౧. భోగిభూష సంతతభక్తపోష బెబ్బులితోలు నీవల్లెవాటు
వేగమమ్ములఁ గావవేంచేయుదేవ నీపాతొల్లి మొక్కుటొగ్గేటు.

మూఁడు గంటల సేపు నిశ్చేష్టులై సభికు లాలింపుచానందింపు చుండిరి. మహారాజావారి యాదేశమున దాసకవీంద్రులు కథను ముగించి మంగళమును బాడెను. రాజదంపతులు హారతి నందుకొని లోనికిఁ జనిరి,

కొంతసేపటికి బక్షి దాసకవీంద్రుల సన్నిధికి వచ్చి అయ్యా! "మీసంగీత కథాకాలక్షేపముచే మహారాజావారు మహా

---

౨. కారుణ్యసాగర మాయింటనాగర గణనాథ యేకదంత
నారాయణదాస మానసోల్లాస నిన్ ప్రస్తుతింపఁగ నేనెంత.
పపపాపపప సాప పదపాదని నిదపమగాని దపామగారిసీ సరిగా మగరీ ససపాసీససరీరిగామా పదసీదపమగరీ నిదపామాగారిరీగమ పామగారి—

విశాఖపట్టణము!

గీ॥ "నీలగిరిమించు నెటఁజల్వ - వాలతేరు
రెండు రాజుసంస్థానఁబు లుండు నెచట
ఎల్ల పొగయోడల న్గావ నెద్ది రేవు
స్వర్గతుల్యంబు వైశాఖ పట్టణంబు"

గీ॥ "బొజ్జ నుండ్రాళ్ల నించిన గుజ్జవేల్ప
సాపజన్నిదములు నెల వెంకదాల్ప
రమ్ము భక్తుల భవసాగరమునఁ దేల్ప
తగునె నాబోటి నీదుతత్త్వంబు దెల్ప. "వినాయకస్తుతి"



దానందమును బొందిరి. ఇంతవర కింతటి మనోహరసంగీతమును దా మాలింప లేదని శలవిచ్చిరి. ఎల్లుండి మఱియొకసారి మీయాట పాట మాట చిత్తగించెద మని శల విచ్చి వీడ్కొనెను. అచ్చటి విద్వాంసు లెల్లరు దాసకవీంద్రు లసమానప్రతిభావంతు లని మెచ్చికొనిరి.

మహారాజావారి నిర్ణయదినమున దాసకవీంద్రులు వారి సమక్షమున గజేంద్రమోక్షకథాగాన మత్యద్భుతరసవంతముగాఁ బ్రదర్శించెను. అప్పుడు మహారాజావారు పేరన్నగారి వెనుకపాటను యకుంఠితమైన యాకంఠధ్వని శ్రీవారిని జోకొట్టి నట్లుండెను.

---

అప్పటికి దాసు కవీంద్రుల ప్రాయము ముప్పది సంవత్సరముల ప్రాయము. మహారాజావారి సమక్షమునఁ జరిగిన కవితా సన్మాదులు – సాహిత్యసౌరభము నంకోఁ దెలుపఁబడినవి.

సీ॥ బ్రతికియున్నంతకు స్వర్గనరకముల
సంగతిఁ దెలియ నసాధ్యముగద
తరలిన వారలు పరలోకవార్తలు
జెప్పిరా మనతోడ నెప్పుడైన
మర్త్యుల నోళ్ళలో మలయు వేదములకు
గనగన నొకముక్క— మొనయుఁగలదె
దీప మారినయట్లు దెల్వి శూన్యంబగు
దేహాంతముల యందుఁ దెల్లముగను

మహారాజావారు సావధానముగా దాస కవీంద్రుల సంగీత కళాకథాకాలక్షేపమును వినుచుండిరి. ఆ విషయమును దాసకవీంద్రులు గ్రహింపక పదిగంటలు కాఁగానే యింగ్లీషులోఁ గథ ముగిసెనని విన్నవించెను.

భువిలోని తేనియలోనితీపిఁ దనముకన్న, దివిలోని యమృతము సందలి మాధుర్యము కన్న, తెలుఁగుఁ దోఁటయందలి పూసిన మల్లెల సువాసనల గుభాళింపు కన్నఁ, జల్లఁగా మెల్లగా వీచు పిల్లగాలు లందలిహాయిఁ దనము కన్న మిన్నఁగా నున్న దాస కవీంద్రుల కంఠస్వర మాధుర్యమును గ్రోలుచుఁ దన్మయులై నమహారాజున కింకఁ నాలించుట కభిమత మున్నను విధిలేక బాధతో సభ ముగించి దాసకవీంద్రులను వీడ్కొలిపి తాను లోనికిఁ జనియెను.

కొంత సేపటికి బక్షీ దాసమహాకవీంద్రుల సన్నిధికిఁ జనుదెంచి "అయ్యా! మీగానామృత మును నెంతగా విన్నను శ్రీవారికి సంతృప్తిఁ గలుగ లేదు. మైసూరులో సింహాసనము పైనుండి శ్రీవారు మీకు నఖండసన్మాన బహుమానములను నొసఁగెద నని శల విచ్చినారు దసరాయుత్సవములకుఁ దమరు తప్పక వేంచేయ

---

గీ॥ మనకు గగనారవిందవర్ణనము లేల
ఇహము నందున స్వమతాభివృద్ధి మీర
లెల్ల రన్యోన్యమైత్రికి హేతు వైన
ధర్మప్రవర్తనమెవృద్ధైన దప్పఁజనదు.



మని శలవిచ్చినారు. అందులకు ఖర్చులకు రెండువందల రూప్యములను మీకొసఁగ మని నార" లని యొసఁగెను. మహారాజు సన్నిధినిఁదానట్లు సంతృప్తిని గలిగించి నందులకు దాసమహాకవీంద్రు లానందమును జెందిరి.

మఱునాఁడు దివాను గారు దాసకవీంద్రుల సంగీతకళాకౌశలమును వినఁ గోరి సభ నేర్పరించెను. ఆసభకుఁ బురప్రముఖులనేకులు విచ్చేసిరి. అందు దాసమహాకవీంద్రు లద్భుతముగా హనుమత్తోడిరాగము పల్లవి బాడిరి. సభికు లానంద పరవశులైరి. సభానంతర మాదివానుగారు లేచి "దక్షిణదేశ సంగీతమునకు - ఉత్తర దేశసంగీతమునకు హస్తిమశకాంతరభేదము గలదు. శ్రీనారాయణదాసమహాకవీంద్రుల గానప్రతిభ యనన్యసాధారణ మైనది. సభారంజక మైనది. కంఠస్వర మందు రసాలఫలరసమాధుర్యము సుధామాధుర్యము సమ్మేళన మును జెంది యున్న దని చెప్పఁ దగును". అని ప్రశంసించిరి. దాసకవీంద్రులు విజయనగరము చేరిరి. తరువాత మఱల శ్రీవారిచే నాహ్వానింపఁబడెను.

అచ్చట మైసూరు మహారాజావారిచే ఘనసన్మానమును బొంది వారిచే శలవు నంది కలకత్తాకుఁ జేరిరి. పిదప బళ్ళారిలో మహాకవి నాటకకర్త ధర్మవరము కృష్ణమాచార్యులు గారి యధ్యక్షతను గధాగానాళుకవితాదులను బ్రదర్శించెను ఆ సందర్భమున శ్రీఆచార్యులవారు "శ్రీదాస మహాకవీంద్రుల సంగీత కథాగానాదులు - జీవితమునందు - మఱుపురానివి. వారు - మానవరూప

మున - జన్మించిన - గంధర్వులే" యని మిక్కిలి శ్లాఘించిరి. అచ్చట నుండి చోడవరము జేరి బుఱ్ఱారాజలింగము గారింటఁ బెండ్లిలో నొకహరికథాగానామృతమును సభికుల నానందరసాంబుధి నోలలార్చెను. అచ్చటనుండి విజయనగరమునకు కీర్తిపరంపరలతోఁ జేరెను.

విజయనగరము మహారాజు శ్రీ ఆనంద గజపతి వారు పండితకవులేకాక పండితకవిపోషకులుగూడ నై యుండిరి అంతేకాక సంగీతకళాభిమాను లై యుండిరి. విజయనగర మందు దాసమహాకవీంద్రుని కథాగానము లెన్నియో జరుగుచున్నవి కాని కోటలో మాత్రము జరుగలేదు. చందనపు వృక్షము చుట్టు సర్పము లావరించి యుండునట్లు పండితబ్రువులు దుర్మార్గు లైన పండితులు వారి కడ నుండుటచే దాసకవీంద్రులకు శ్రీవారి యాదరణము లభింపలేదు. దాసకవీంద్రుల కథ విన్న మైసూరు మహారాజావారు మృతిఁ జెంది రని దుష్ప్రచారమును గూడఁ జేసెరి. అందువలనో యేమో కాని మహారాజావారు మహాకవీంద్రులను సన్మానింపలేదు. అందులకై దాసకవీంద్రుఁ డొనరించిన ప్రయత్నములు బూడిదఁబోసిన పన్నీరగుటయేకాక విపరీతపరివర్తనములగుచుండెను.

---

దాసకవీంద్రులకు జరిగిన మైసూరు సన్మాన విశేషములను, 71–72 పుటలందుఁ దెలుపఁ బడినది, అచ్చట మైసూరు మహారాజ మరణవార్తను దాసకవీంద్రు లువిని మిక్కిలి పరితపించిరి.



దాసమహాకవి యొకనాఁ డాస్థాన వైణికునిఁ గలిసికొని "వైణికగ్రామణీ! నీకసాధ్యమైన - మైసూరు మహారాజా సన్మానము - నాకు సాధ్యమైనది కదా! ముదిమినొదవిన దాసి వలె నీకోటనే కనిపెట్టు కొంటి" నని వయోప్రాగల్భ్యమున వ్యంగ్యముగాఁ బలికెను. అందులకాతఁడు నేయిఁబడిన యగ్ని వలె మఱింత గోపము గలిగి యానాఁడే మహారాజు గారికి నేమేమో చెప్పి మహారాజౌదాసీన్యమునకుఁ గారణభూతుఁ డయ్యెను.

మహారాజావారి గురువు శ్రీలింగం లక్ష్మాజిపంతులు. అతఁడు జర్మనీ గ్రీకు లాటిన్ భాష లందు నిరుపమాన పండితుఁడు. ప్రతిభాబృహస్పతి. అనుపమ ప్రజ్ఞాన్వితుఁడై నర సజ్జుఁడు. అమ్మహాశయుఁడు దాసకవీంద్రుల హరికథాగానామృతమును విని యానందించి మహారాజాగారికి వారిని గూర్చి సిఫార్సును జేసెను.

ఒకనాఁడు దాసకవీంద్రుల హరికథాగానాంతరమున వైణికవిద్వాంసుఁడు "నీ విషయము మహారాజావారి సన్నిధి వచ్చినది. స్వల్ప ప్రతిభతో హరికథను జెప్పఁ గల" వని శ్రీవారికి విన్నవించితి నని పలికెను. అందులకు దాసకవీంద్రుఁడు "బాగున్నది." యని ముక్తసరిగా సమాధాన మొసఁగెను. అందుల కాతఁడు "ఇంకేమని నిన్నుఁ గూర్చి చెప్పమనెదవు?. వీణ వాయించుటలోఁ గవిత్వమును జెప్పులోఁ బాడుటలో నతనికి నతఁడే సాటి లేని మేటి యని చెప్పమందువా! యిందుల కేమందు!" వనిపలికెను,

ఆమాటల విని - ఆటపాటల మేటి దాసకవి "ఏమందును - నీవు చెప్పినది సరిగాదందును. నీవెందుల కట్టు చెప్పితివో? యాశ్చర్యపడుచుందు నని యందును. అతని కన్న నీతఁడు వీణవాయింపఁ గలఁడు, ఆతని కన్న మిన్నఁగాఁ గవిత్వమును జెప్పఁగలఁడు. ఆతని కన్న నీతఁను చక్కఁగాఁ బాడఁ గలఁడు అని నీవుచెప్పిన రసజ్ఞులకు గొప్పగా నుండెడిది కదా!" యని పలికెను. ఆపలుకుల కాతఁడు శిరము పంకింపుచుఁ జనియెను.

మఱునాఁడు మహారాజా శలవైనదని దాసకవీంద్రులు శ్రీవారి దర్శనమునకుఁ బోయెను. మహారాజావారు సభాప్రదేశమునకు వచ్చిరి. అచ్చటగల్ల యందఱితో దాసకవీంద్రుఁడు లేచి నిలువఁబడి యాశువుగాఁ బద్యమును జదివెను. 'ఆశ్రయించిన వారి యందు దయ విరోధుల కడ శౌర్యము పండితుల కడ సాత్త్వి

---

"ఆశ్రితుల పాలి దాక్షిణ్య మరులయొద్ద
శౌర్యముం గోవిదుల కడ సాత్త్వికతయు
నెసఁగు నేలిన వారి కభీష్టజయము
నిచ్చుఁ గావుత సంతత మీశ్వరుండు."

శ్లో॥ జానాతేయన్న చంద్రార్కౌ జానతేయన్నయోగిన్నః
జానీయ తేయన్నధరోపి తజ్జానతికవిస్స్వయం.

శ్లో॥ వచస్సుధామయం కావ్యంపీత్వాహం తృప్తమానసం
కృతోజ్యోఒభిప్రశంసాభి భవంతం కవిశేఖరః.

"తారకప్రశంస" ప్రొఫెసరు. కె. గిల్డనర్. (పుట 180)



కతఁగలిగి పరిపాలించు దేవరవారికి నీశ్వరుఁడు కోరిన జయముల నిచ్చుఁ గావుత" యని దీవించి నారికేళఫల మొకటి యర్పించెను. అందులకు మహారాజావారు మందస్మిత వదనారవిందలగుచు 'మిమ్ములను గూర్చి వార్తాపత్రికలలోఁ బ్రకటింపఁ బడిన విశేషములను జదివి నార'మని శల విచ్చిరి. లక్ష్మాజీ పంతులు గారి యాదేశము మేరకు నిజ గానాశుకవితాదులను దాసకవీంద్రులు జక్కఁగాఁ బ్రదర్శించెను. అంతట మహారా జబ్బురపడుచు "దాస మహాకవీంద్రా! మీసంగీత సాహిత్యము - లత్యంత నిరుపమానము"లని పలికినంత వారు వెంటనే ప్రభువుల పైరచించిన సావేరీ వర్ణమును పాడి విన్పించెను. అందులకు నృపతి ముదమంది "మీకిట్టిప్రశస్తమైన సంగీత సాహిత్యజ్ఞానము లున్నవని మాదృష్టికి రాకపోవుట విచిత్ర మైన విషయము. ఇంతకు మీనివాసముఁ గూర్చి వినఁగోరెద" మనిపలికెను.

అమాటలకు దాసమహాకవి "ప్రభూ! మాదిఅజ్జాడ యను నగ్రహారము. ఏలినవారి కళాశాలలో నభ్యసించితి" ననిపలికెను. పిదప దాసకవీంద్రుఁడు దాను రచించిన భైరవి ధన్యాసి స్వరజితులను మధురముగా గాన మొనరించెను. సభికు నెల్ల రానందించిరి. కాని యాస్థానవైణికునకు నీర్ష్యాజనక మయ్యెను. మహారాజావారు దాసకవీంద్రుల గానకవితాప్రాగల్భ్యములకు నానందించి సత్కరించిరి.

ఆస్థాన సంగీతవిద్వాంసు లానాటి దాసకవీంద్రుని ఘన గౌరవాదులఁ జూచి యీర్ష్యపడిరి. వా రంద ఱేకమై దాసకవీం

ద్రునికి సంగీతసాహిత్యము లందు జ్ఞానము లేదని మఱి నేవో లేనిపోని వెల్ల మహారాజావారికిఁ జెప్పి వారికి దాసకవీంద్రుని యందు విర్లక్ష్యభావమును గలుగఁ జేసిరి.

దాసకవీంద్రు లొకపరి లింగం లక్ష్మజీ పంతులుగారి మీఁద నొకపద్యకమును జెప్పెను. అతఁడు మహారాజావారికాపద్యమును విన్నవించెను. అది వినుచున్న యాస్థానవిద్వాంసుఁ డందుఁ దప్పున్న దని పలికెను.

మహారాజావారు దాసకవీంద్రునిఁ బిలిపించి గౌరవించి "మహాకవీంద్రా! మీరు సామాన్యులుగారు. సంగీతసాహిత్యము లందుఁ బ్రజ్ఞానిధులు. పండితుల యీర్ష్యను మీరు లక్షింప వలదు. మీరు లక్ష్మజీ పైఁజదివిన పద్యమును జదువఁగోరుచున్నా'మన నందులకుఁ వారు దాని జదువుచుండిరి.

అప్పుడుప్రభువు "కవీంద్రా! మీరు ప్రయోగించిన క్త్వార్థక భిన్న కర్తృత్వ 'మొప్పుఁ గాదని యొప్పుకొందురా?' యని యడిగెను. అందులకుఁగవీంద్రుఁడు 'మహారాజా! అందులకుఁ బ్రమాణ మగపరచనిచో నేలినవారి యాదేశమును శిరసా వహింతు నని పలికెను' అందులకు మహారాజావారు 'మీరు దానిని సావకాశముగాఁ జూపింప వచ్చును. మీసంగీతగానామృతము

సీ॥ "అఖిలలోక వ్యవహార ధర్మంబుల
నడిపింపఁ జాలిన నల్లవేల్పు
జగముపై నొరిగియుఁ జలియింపని ఘనుండు
వానగాలులకుఁ బర్వతము వోలె."



లను మఱల వినఁ గుతూహలపడుచుంటి" మని శల విచ్చిరి అంతటఁ గవీంద్రులు తమ గేయపద్యములను శ్రీవారికిఁ జదివి యానందింపఁ జేసెను.

మహారాజావార లచ్చట నున్న యొకవైష్ణవ కవీశ్వరునిఁ గాంచి "కవీంద్రా! దాసకవీంద్రుల కవిత్వ మెట్లున్న దని పలికెను. అందుల కాతఁడు" వీరి కవిత్వము తెలుఁగువిజయవిలాసకారు కవితాసంపదవలె నతిశయింపుచున్న"దని పలికి "వీరు సంస్కృత మందుఁ గూడఁ గవిత్వమును వ్రాయఁ గలదిట్టయని విందు". మనిరి, అంత మహారాజావారు "సంస్కృతమందుఁ గూడ మీకవితామృత మాస్వాదింప నుత్సాహ పడుచుంటి" మని పలికెను. అంత నాకవీంద్రుఁడు సంస్కృతమునఁ గూడ నొక శ్లోకమును రాగయుక్తముగాఁ జదివెను. దానిని విని యావైష్ణవకవిశిరోమణి "తవచ మేచ సంతాపయుక్త" అనియున్న బాగుండె డిదికదండీ"యనెను, అందులకుఁ గవీంద్రుఁడు 'అయ్యా! నాఁడు సంగీతమున వైణిక శిరోమణిగారు లొకచకారమును బెట్టిరి. మీరుసాహిత్యమున రెండు చకారములను బెట్టుచున్నారని, మీసవరణలు మీప్రతిభను జాటుచున్న" వనిపలికెను. మహారాజావారు కడుపుబ్బనట్లునవ్విరి. వైష్ణవ కవిశేఖరుని ముఖము చిన్నబోయెను. మఱునాఁడు దాసకవీంద్రుఁడు దనపద్యప్రయోగములకుఁ బ్రమాణములను జూపెను. నాఁటి నుండి మహారాజావారు శ్రీనారాయణ దాసమహాకవి యందు నత్యంతానురాగములఁ బ్రదర్శింపుచుఁ దమ కాప్తులుగఁ జూచుకొనుచు గౌరవింపుచుండిరి.

శ్రీ నారాయణదాసు కవీంద్రుల ప్రతిభ యాంధ్రదేశమంతట వ్యాపించెను. వారు దగినంత ధనార్జనఁ జేయ శక్తిసామర్థ్యములను గలిగిన వారై యుండిరి. ఆ బాలగోపాలము దాసకవీంద్రుల యనన్యసాధారణ మైన ప్రజ్ఞకు నాశ్చర్యపడుచు వారి యందపరిమిత గౌరవానురాగములు గలిగియుండిరి. వివాహాది శుభకార్యముల యందు దైవకళ్యాణముల యందు దాసకవీంద్రుల హరికథాగానాదులను నేర్పాటు జేయుట యాచారమయ్యెను.

క్రీ॥ శ 1904 సంవత్సరమున బెంగుళూరులో జరిగిన గాయకసభలో దాసకవీంద్రుల హరికథ నొకనాఁడు చెప్పుటకు నేర్పాటయ్యెను. ఆనాఁటి వారి కథకు మృదంగవాద్య నిపుణుఁడగు యొక పిళ్లెగారిని నియమించిరి. అనాఁడు వారు స్వీయరచిత రుక్మిణీకల్యాణకథను జెప్పుచుండెను. కథప్రారంభించిన గొంతదినేపటికా మృదంగవాద్య నిపుణుఁడు నిజకళాప్రావీణ్యమును జూపుచు లయలో దాసకవిగారిని మించిపోవునట్లు వాయింపుచుండెను. వాని యౌద్ధత్యమును జూచి జంపెతాళపుఁ గీర్తన

శ్లో॥ నసాభయతుతూన్యవాక్ - తవచ మేపచ సంతాపయుగ్వీ
మ॥ ఇృభితసోదరీం - భయదిలోల శాతోదరీం

(53 పుటయందుఁ గలదు. విజయనగర రాజావారి గౌరవ విషయములన్నియు 53-నుండి 81పుటలవఱకుఁ గలవు.



నెత్తికొని యొక గతిలోఁ బాడుచు వేఱొకగతిలోఁ దాళపుచిప్పలతో నాకుకుఁ బోకకుఁజెంద నట్లు లయవేయుచుండెను. తాటి చెట్టెక్కువానికిఁ దలఁ దన్ను వాఁడుండును గదా!

ఆ మృదంగ విద్వాంసునకు గరఁ మాద లేదు. దాసకవీంద్రులు పాటయాగలేదు. మృదంగశబ్దము వినఁబడలేదు. కొంతసేపటికిదాసకవీంద్రు లాతని దిశఁ జూచి "యేమైనది! దక్షిణామూర్తి!" యనియడిగెను. అందుల కాతఁడు మిాలయ మేఘము ముమ్మరముగాఁ గలిసి నాయాకాశమృదంగమును గప్పిజాగా దొరుక నీయలే దని దీనముగాఁ బలికెను.

ఆమాటలకు నాటపాటలమేటి "నీశక్తినాకు - నాశక్తినీకు వ్యక్త మైనది". యని మఱలఁ జాగా ప్రకటించి తాను దిరిగి రెండు గతుల యందుఁ బనిఁ జేయుచు మూఁడవ గతి యందు నృత్యమై శద్యమును నగపరచెను. ప్రళయకాలమందలి ఝంఝూమారుతము వలె విజృంభించు దాసకవీంద్రుల యద్భుతసంగీత నృత్యకళా విలాసములు సభికుల కచ్చెరు వొందించెను. సభానంతరము మార్దంగికుఁడు వారికిఁ బ్రణమిల్లి 'యింతటి లయజ్ఞాన

శ్రీ విక్రమ దేవవర్మగారు 'భారతీతీర్థ' యను సంస్థకు సభ్యులుగా నుండిరి. దానికిఁ గార్యదర్శి డాక్టరు బుఱ్ఱాశేషగిరి రావుగారు ఆ సంస్థ వార్షికోత్సవమున దాసకవీంద్రులకు ఆటపాటమేటియను బిరుదము నొసంగి సత్కరించిరి.

పండితునిఁ గాంచుట యిదియే ప్రథమము మీరు నిజముగా లయబ్రహ్మరే' యనిశ్లాఘించెను.

క్రీ॥ శ 1911-12 సంవత్సర ప్రాంతమున బరంబర న్యాయమూర్తి సదాశివయ్యరుగారు దాసకవీంద్రులచే హరికథా గానాదుల నేర్పాటుఁజేసిరి. అప్పుడు పురజనులు వారిప్రావీణ్యము నకు నచ్చెరు వొంది ముప్పదితులముల బంగరు కడియములను బహూమతినిఁ జేసిరి.

క్రీ॥ శ 1912-13 సంవత్సరమున విజయనగర సంస్థాన మునకు ట్రస్టీగా నేర్పడిన రీవారాణి ఆనందమహారాజు సోదరి అప్పలకొండయాంబ శ్రీదాసుగారినిఁ గోట కాహ్వానించి వారిచే నాలుగైదు హరికథాగాన కాలక్షేపముల నేర్పరించి విని యానం దించి ఘనముగా సత్కరించిరి,

క్రీ॥ శ॥ 1912 సంవత్సరమున దాసకవీంద్రులు - నిజ మాతృనాదేశానుసారము సావిత్రీ చరిత్రను రచించెను. అమ్మహా దేవి కరుణాప్రభావమున క్రీ॥ శ 1903 లోఁ బుత్రిక వారికి జన్మించెను ఆ బాలికకు వారు సావిత్రి యని పేరుపెట్టిరి. క్రీ॥ శ॥ 1905లో దాసకవీంద్రులకు మాతృవియోగము గలిగెను. దాసకవీంద్రులు. తమకుటుంబముతో గాశీయాత్రను గావించిరి. అంతకుముందు కుమార్తె సావిత్రీదేవి వివాహమును గావించిరి. వారు దిరుగుఁదలలో అలహాబాదులోఁ గల ప్రసిద్ధగాయకురాలు జానకీబాయితోఁ బరిచయ మొనరించు కొని యామె పాటను విని



దాసమహాకవి కలకత్తా చేరి యచ్చట గానసభఁ జేసెను. ఆసభకు విశ్వవిఖ్యాతకవియగు రవీంద్రనాథటాగూరు కూడ విచ్చే సెను. ఆనాఁడు దాసకవీంద్రులు దాను రచించిన శ్రీకృష్ణజనన మును బాడుచు హిందీలో నుపన్యసింపుచు ననేకరీతులఁ గళావి న్యాసములను బ్రదర్శింపుచుండెను, సభానంతరము రవికవీం ద్రుఁడు దాసకవీంద్రుని మిక్కిలి శ్లాఘించెను. పిదపఁ గుటుంబ ముతో విజయనగరమునకు వారు చేరిరి.

చల్లపల్లిరాజా అంకినీడు మల్లికార్జున ప్రసాదరావుగారు దాసకవీంద్రుల నాహ్వానించి వారికిహరికథాగానాశుకవితా ప్రదర్శ నములు వినియానందించి మెచ్చి బంగరుగండపెండెరము స్వయ ముగా సభలో నొసఁగి సత్కరించెను.

క్రీ॥ శ 1908-14 సంవత్సర ప్రాంతమున బరంపురం విశాఖపట్నము - రాజమహేంద్రవరము-బందరు-మున్నగు పట్ట ణము లందు దాసకవీంద్రులు దమనిజగానకవితా ప్రదర్శనములఁ జేసి సువర్ణఘంటా కంకణములు భుజకీర్తులు మున్నగు బహు మానములను పండితపామర ప్రశంసలను బొందెను. నందిగామ వేంకటగిరి హైదరాబాదు మున్నగుపట్టణము లందు నిజసాహిత్య

సంతసించి తనగానామృతమును నామెకు వినిపించెను. ఆమె దాసకవేంద్రుల జలధగంభీరస్వరమునకు హిందూస్థాన బాణీకి మిక్కిలి యానందించెను.

సంగీత ప్రతిభలఁ బ్రదర్శించి గజారోహణాది సత్కారములను బడసెను.

ఉమ్మ్యారు నందు దాస కవీంద్రులచేఁ గథాగానకాలక్షేపమును జేయించి పౌరులు గజారోహణాది సత్కారములను గావించిరి. క్రీ॥శ 1924 సంవత్సరమున విజయనగరమున పౌరులు పండితులుగూడి దాసకవీంద్రులకు షష్ఠిపూర్తి మహోత్సవమును నొనరించిరి.

---

“కాలాహి దురతిక్రమణః” యన్నట్లు-దాసకవీంద్రులకు, సతీవియోగము 1912లో సంవత్సరమున జరిగెను.

విజయరామ గజపతిమహారాజుగారు శ్రీవిజయరామగానపాఠశాలను నెలకొల్పి దాసకవీంద్రులను నాహ్వానించి దానికి ప్రిన్సిపాలుగా నుండమనియభ్యర్థించెను. ఆపదవికి నూరు రూపాయలు వేతనము దాసుగారికి జీవితపర్యంత మొసఁగు నట్లు ఏర్పాటుఁజేసెను. అంతట దాసకవీంద్రు లంగీకరించి వీణ ఫిడేలు మృదంగము సన్నాయి డోలు గాత్రపాట మున్నగు కళలను బోధించుటకుఁదగిన యుపాధ్యాయులను నియమించి యాపాఠశాలను క్రీ॥శ 1919 మొదలు 1936 వఱకు జయప్రదముగా నడిపిరి. ఆకాలము నందు గానకాలక్షేపములకు నప్పుడప్పుడు జరిగింపు చున్నను సంస్కృత గ్రంథపఠనమునకు గ్రంథరచనకు నెక్కువ కాలమును వినియోగింపు చుండెడివారు,



శ్రీదాసమహాకవి కళాశాలాధ్యక్షపదవి నుండి విరమించుకొనిన తరువాత పుదుక్కోట తిరువాన్కూరు మహారాజాల సమక్షమునఁ గథాగానకాలక్షేపాదులఁ గావించి సత్కృతులఁ బడసెను.

విశాఖపట్నమునఁ బ్రముఖన్యాయవాది మహాపండితుఁడగు శ్రీప్రథల లక్ష్మీనరసింహము పంతులు గారు తమ కుమార్తె వివాహ సందర్భమున శ్రీదాసకవీంద్రుల నాహ్వానించి హరికథ నేర్పరించి మించిన బహుమతులచే వారిని సత్కరించెను. ఆనాఁటి సభకు జయపుర సంస్థానాధీశ్వరులుగూడ విచ్చేసి దాసకవీంద్రులు నిలువఁ బడి హరికథచు జెప్పుచుండఁ దాము గూర్చుండుటకు నభిమతమును లేక నిలువఁ బడి వినుచుండిరి. దాసమహాకవి చూచి “మహాప్రభూ! మీరు నాయందుఁ జూపిన యనురాగమునకుఁ గృతజ్ఞుఁడను. ఏలినవారు శలవిచ్చినట్లు నేను నిలువఁబడి చెప్పలేను

---

దాసకవీంద్రులు ప్రిన్సిపాలు పదవి విరమించినను జీవితకాలము నెలకు నూరురూప్యముల వేతనమొసఁగు నట్లు నిర్ణయింపఁ బడెను. వారు దేశాటనమును జేయక గృహమందే యుండి తమ గ్రంథముల రచన కవకాశమును గలిగించుకొనిరి. అందుచేత నట్టి యత్యుత్తమ కావ్యములను రచించి యాంధ్రరసజ్ఞుల హృదయములకుఁ జిరస్మరణీయులైరి. క్రీ॥ శ॥ 1924 సంవత్సరమునఁబౌరులు - పండిత ప్రముఖులు - అన్యపట్టణవాసులు - గలిసి - కవీంద్రులకు - షష్ఠిపూర్తి మహోత్సవమొనరించి - వారిని - నూరేగించిరి,

గదా యనుచుఁ నాడుచుఁబాడుచుఁ గథాగాననృత్యాదు లొనరించుచును.
అందుచేతఁ దమరుసుఖోపవిష్టులై నాకళాకౌశలమును జిత్తగించుట
నాకు శ్రేయోదాయకమగునని విన్నవించిరి. అందుల కందఱు
నవ్విరి. మహారాజావారు ముదమంది సుఖాసీనులైరి. సభానంత
రము శ్రీవిక్రమదేవవర్మగారు దాసకవీంద్రుల కొకపర్సును బహు
మానమొసఁగిపట్టణప్రజల తరపున "సంగీతసాహిత్య సార్వభౌమ"
యను బిరుద మొసంగిరి

మదరాసులో అఖిలభారతకాంగ్రెసు మహాసభను జరిగి
నప్పుడు దాసకవీంద్రులు సభాప్రారంభకులుగఁ బోయిరి. ఆవేళ
నప్పటి కప్పుడే రచియించిన గేయము తాము పాడుచు శిష్యుల
చేతఁ బాడించిరి. వారు గంభీర మైన కంఠనాదముతో "శంభో"
యని పైషడ్జమస్థాయిలో నాదమును బూరించు సరికి సభికు లెల్ల
రాశ్చర్యచకితులై మహదానందముల నోలలాడిరి.

రాజమహేంద్రవరమున గున్నేశ్వరరావుగారు మకుటము
లేని రాజు. వారు తమ నాటకశాలలో దాసకవీంద్రుల కథను
నేర్పాటుఁ జేసిరి, ఆనాఁడు హాలు ప్రేక్షకులతో నిండిపోయినది.
వారు సీతాకళ్యాణమును హరికథను జెప్పుచుండిరి. వేసంగికాల

---

శిష్టాచారము సల్పలేను మఱి దుశ్చేష్టల్ విడంజాల బల్
నష్టం బందియు నీ పదాబ్జముల డెందంబున్ గడు న్నిల్పకే
నిష్టం బుండియుఁ దెన్నెఱింగియును దుర్వృత్తి న్వడిన్మాన నేఁ
గష్టాత్ముండను గాఁచె దెట్లు! వను వింకన్ సూర్యనారాయణా!



మగుటచే వారికి జెమటఁ బట్టినది, అప్పుడు కథను మధ్యలో
నాపి "గున్నేశ్వరరావూ! ఏవో ఎలక్ట్రిక్ పంకాలు వేయించెద
నంటివి. పోని యొకవిసనకఱ్ఱ నాకిచ్చినచో నేనేవిసురుకొందును
నీవుసమీప మందున్నచో నీపైఁ గూడ విసరఁ గల" నని పలి
కెను. ఆమాటలకుఁ బ్రేక్షకు లెల్లరు గొల్లుననవ్విరి. అప్పుడు
గున్నేశ్వరరావు గారు "అయ్యా! ఆపని మాత్రము చేయకండి.
ఇదిగో మనిషినిఁ బంపుచుంటి"నని చెప్పి, విసనకఱ్ఱతో బంపెను.
సీతాకళ్యాణముతోఁ గథ మనోజ్ఞముగా మధురాతి మధురముగాఁ
ముగిసినది.

క్రీ॥ శ॥ 1920 కాకినాడలో గానసభలు బ్రహ్మాండముగా
జరిగినవి. ఒకనాఁటి రాత్రి దాసకవీంద్రులు పాదుకాపట్టాభిషేక
మును గథాగాన మొనరింపు చుండిరి. ఆనాఁడు ఎందఱో
సంగీతవిద్వాంసులు సభ యందుండిరి. శ్రీదాసుగారు కథామధ్య
మున నేదో పాటఁ బాడుచు సహజ మైన 'శంభో' నాద మొనరిం
చిరి. ఆసభాభవన మంతయుఁ బ్రతిధ్వనించినది. ఆనాద మణు
గుటకు గొలఁది సేపుఁ బట్టినది: పిమ్మట దాసకవీంద్రులు సూర్య

---

శ్రీదాసకవీంద్రులు తనవిరోధు లైన పండితు లందరి కన్న
మిన్నయగు నిజమేధాశక్తిని సంగీతసాహిత్య వైభవమును
గు తెలింగిన నత్యంతప్రజ్ఞాశాలి యగుటచే నితరులకు స్వాధీ
నుఁడు గాక తన జీవితమును దన యిచ్ఛ వచ్చినట్లు నడిపించు
కొనెను.

నారాయణమూర్తి కడకుఁ జనుదెంచి "ఏమయ్యా యింత కేక వేయుటకు నెంత కాఫీ కావలెనో? తెలియునా?" యనియడిగెను. సభికుల నవ్వులు పువ్వులయి వాని సువాసనలు దాసకవీంద్రుల కడ గుభాళించినవి.

ఆనాఁడు వాయించిన మార్దంగికుఁడు వారలొకగతిలోఁ బాట మఱొకగతిలో లయ వేయుచుండ జాగాకు వచ్చు మార్గమును గనఁబడక మృదంగమును వాయించుట మాని వైచెను. సభికులెల్ల రాశ్చర్యపడుచు వారిని శ్లాఘించిరి.

ఒకసారి చేబ్రోలులో దాసకవీంద్రులు కథచెప్పుటకై పౌరులచే నాహ్వానింపఁబడియటకుఁబోయిరి, ఆనాఁటిరాత్రి కథనుజెప్పుటకు నుద్యమించి రుక్మిణీకళ్యాణమును ప్రారంభించిరి. అంతలో

---

దాసకవీంద్రులకు నిరుపేదలపై నెంత కారుణ్యమో ధనవంతుల యందంతటి కాఠిన్యము గల స్వభావమును గలవారు. పేదవర్తకులు చందా వేసికొని పాతిక రూపాయ లర్పించినను హరికథాకాలక్షేపమును మనసారఁ జేసెడివారు. యథాశక్తిగా దానధర్మము లొనరింపు చుండెడివారు. తోటలోఁ దన కొసఁగఁబడిన పండితగౌరవవేతనము వ్యాపారస్థుల కడఁ జేసిన యప్పులకు సరిపో వుచుండెడిది. శరణాగతరక్షణ జీవహింసయందు నసహ్యము పరోపకారపారీణత అధ్యాత్మిక చింతన - ప్రాచీన ధర్మరక్షణ - మున్నగునవి దాసకవీంద్రులకు జన్మహక్కుగాఁ బరిణమించినవి.



సభలో నుండి యొకరుహేళనగా గిరికథను జెప్పు మని కోరిరి. అంత దాసకవీంద్రుఁడు మఱల సభికులను జూచి "హరికథను జెప్ప మందురా? గిరికథను జెప్ప మందురా?" యని ప్రశ్నించెను. అందులోఁ గొందఱు దాసుగారు శరీరమును మఱచి మాట్లాడుచున్నారు. గిరికథనే చెప్పు మని కోరుట కుక్క కాటుకుఁ జెప్పుదెబ్బలాగుండు నని యవివేకులు దలంచి గిరి కథనే చెప్పుమనిరి. హనుమంతుని ముందరాకుప్పి గంతులు!

దాసకవీంద్రులు విని మందస్మితమున గోవర్ధనోద్ధారమును (కొండకథను) పద్య గద్య గేయములను గల్పించి మనోజ్ఞముగాఁ బ్రేక్షకులు శరీరము మైమఱచు నట్లు వచించెను. అవివేకుల ముఖములు సూర్యుఁడ స్తమించిన కమలము లట్లయ్యెను. పౌరులు దాసకవీంద్రుల బ్రహ్మాండముగా సన్మానించిరి.

---

వారతిగర్విష్ఠ యని తలఁచినను జ్ఞానధను లగు వారు దాసకవీంద్రుల వ్యక్తిత్వమునకు సంతోషింపుచుఁ దద్బహుముఖ పాండిత్యమునకు దాసోహ మనుచుండిరి.

# చమత్కార కథా సౌరభము

విజయనగరమం దొకనాఁటి రాత్రి యొకవేశ్య హరికథా కాలక్షేపమును జేయుచు దాసకవీంద్రుల మీఁద గోపముతో నసందర్భముగా వ్యంగ్యముగా "నిప్పుకుఁ జదలంటునా" యని వారినిఁ గూర్చి విమర్శించెను. అది విని దాసకవీంద్రుఁడు మఱునాఁడు దమ కాలక్షేపములో "నిప్పుకుఁ జదలంటునా" యను సూక్తి నందున 'ని - కు - 'పు' కు జాగా చేసి పాటఁ బాడుచు హస్తముతో ముక్తాయింపు నొసఁగు చుండెను. అది విని యావేశ్యకు గన్నీరుఁ చిమ్మలై చిదువలై జాలై తరంగములై ప్రవహించి కథానంతరము దాసకవీంద్రుని క్షమార్పణను గోరెను. ఆ విడకు వీపునఁ గొట్టిన పండ్లూడినట్లయినది. ఒకనాఁటి హరికథాకాలక్షేపమునం దొక పృచ్ఛకుఁడు "అయ్యా హరికథాకథన జన్మవృత్తాంతమెట్టిది!" దానినిమీరే కనుఁగొనినారా!"యని ప్రశ్నించెను. అందులకు దాసకవీంద్రుఁడు "ఎండవేళ ప్రశాంతముగా నున్నవేళ వృక్షచాయనఁ బలువురుఁ జేరి యానందింపుచుండ నొకమాల దాసరి వేపచెక్క గంధమును బూసికొని కాళ్లకు గజ్జలు కట్టి వెనుక నొకఁడు వంతఁ బాడుచునచ్చటఁ జేర వారందఱు విని యానందించెడివారు. వాఁడు పూసిన వేపగంధమునకు బదులు మంచి గంధము పూఁత నోటి శ్రుతికి తంబురాశ్రుతి మున్నగు మార్పులను జేసినాను గానివేరుగా" దనిపలికెను.



బొబ్బిలిలో శ్రీదాసకవీంద్రులు శ్రీనందిగామ వెంకయ్యగారను సంస్థానవిద్వాంసుఁ గృహమున నఖములతో గవాటము మీఁద వాయింపుచుఁ బాడుచుండుట చూచి వెంకయ్యగారు "అయ్యా! శరీర మంతయు లయజ్ఞాన మున్నఁగాని యిట్లు పాడుట సాధ్యము గా"దని బలికెను. శ్రీన్యాపతిసుబ్బారావుగారు మఱునాఁడు దమ గృహమున జరిగిన హరికథలో ననేకవిధము-లదృష్టములను దానిని వివరింపుచు "మాసమునకు వేయి రూకలార్జించు నదృష్టము పంతులుగారి దైనప్పుడు వారి వంట బ్రాహ్మణుడు అడ్డెడు బియ్య మన్నము సులువుగాఁదిని జీర్ణునఁ దేపుట యదృష్టము గదా" యని పలికెను.

ఒకసారి విజయనగరమున దాసకవీంద్రులు టికెట్టు పెట్టి హరిశ్చంద్రోపాఖ్యానము వినిపింపుచు నక్షత్రకుఁడు హరిశ్చంద్రుని నమ్మఁ జూపు పాట "చాల - చవుకబేర - మిదియేజూండి సరగున: జనులార కొనరండీ." అని పాడుచుండఁ దనమిత్రుఁ డగు సర్కిలు యిన్స్పెక్టరుగారు లోని కప్పుడే వచ్చుచుండుట చూచి చాల గొప్పబేర గాడే వచ్చె" నని హాస్య మొనరించెను.

ఒకానొకదినమున శ్రీదాసకవీంద్రులు శ్రీకొమ్మిరెడ్డి సూర్యనారాయణ నాయడు గారితోఁ బ్రసంగింపు చుండెను. నాయుఁడుగారు "అయ్యా! మన ఆంధ్రగాయకులు దక్షిణ దేశమునకుఁ బోయి సంగీతము నభ్యసించి తమిళగాయకుల వలెఁ బాడవలె" నని పలికెను. అందులకు దాసకవీంద్రులు "అయ్యా!

నాయుడు గారు! తనకుఁ బుట్టిన కుమారుఁడు బడే సాహెబు లాగుండ వలె నని యెవఁ డైనఁ గోరుకొనునా!" యని పలికెను.

ఒకనాఁడు కాకినాడలో గానసభలో దక్షిణదేశపు విద్వాంసులు పల్లవిఁ బాడుచు రణగణధ్వనిఁ జేయుచుండ శ్రీదాసకవీంద్రు లచ్చటకు వచ్చుట తటస్థించెను. వారినిఁ లోనికిఁ దోడ్కొని పోయి యచ్చటఁ బ్రత్యేకాసనమును వేసి గౌరవించిరి. కొంతసే పయినతరువాత దాసకవీంద్రులు తమశిష్యుఁడు సుబ్బయ్యను బిలిచి పాడుచున్నవారి దిశఁ జూపి "సుబ్బయ్యా! వారేమి చేయుచున్నా" రనియన నతఁడు 'గురూత్తమా! సంగీతము పాడుచున్నా' రని పలికెను. అందులకు వారు 'తాటిచెట్టెక్కి-నా వెందులకన - దూడ మేతకన్నట్లు' సంగీత మని గుద్దు లాడుకొనుచున్నారు" అని పలికెను.

విజయనగర మహారాజా వారు దాసకవీంద్రులు విలాసార్థము దన్మారాడుచు నగ్గిపుల్ల లొడ్డుచుండిరి. అప్పుడు మహారాజా వారికి మూఁడాసులు దాసకవీంద్రులకు మూఁడు రాజులు పడెను దాసు! కవి గారత్యుత్సాహముతో బుల్ల లొడ్డుచుండెను. తుదకుఁ బ్రభువు వారు "దాసకవీంద్రా! మీరు నన్ను జయించుట సాధ్యము గాదని పలికి తన పట్టును జూపెను. అందులకుఁ గవీంద్రుఁడు "మహాప్రభూ! "తమబోలు ప్రభువులు లభించుట దుస్సాధ్యము. అట్టి స్థితిలో ముగ్గురు ప్రభువులు నాచేఁ జిక్కినారు. నాప్రాణము నైన నిప్పు డొడ్డెదను గాని పట్టును వీఁడెదనా'యని తనచే నన్ను



మూఁడు రాజులను జూపించెను. అందులకు మహారాజావారు నవ్వుచు 'క్రిందఁ బడినను మీఁద నున్నట్లే మాట్లాడుదువుగదా' యని పలికెను.

ఒకనాఁ డుదయమున నిద్దఱు బ్రాహ్మణ దంపతులు దాసకవీంద్రుని గృహమునకు వచ్చి తాము నిస్సంతుల మని రాత్రి స్వప్న మందు నారాయణదాసకవిగారి ప్రసాదము నందిన యాకొఱఁతఁ దీరునని పలుకుటచే నిచ్చటకు వచ్చితి" మని పలికిరి. అందులకు వారాశ్చర్య పడుచు వారిని మఱునాఁడు రాగిచెంబు నిండుగ మంచినీరు దెచ్చుకొను మని పలికి వారినిఁ బంపివైచెను. మఱునాఁడు వారట్లురాఁగ వారినిఁగాంచి చెంబును నీభార్య కొసఁగి యామె నీరు పోయుచుండ నీవు నాపాదములను గడుగు మని చెప్పెను. పిదప దానిని వారు పుచ్చుకొని యాచమన మొనరించి పిదప జలమును దనచేతిలోనికి వంచుకొని నిజకరమున నావధూవరుల దోసిటలోఁ బోసి పుచ్చుకొను మని చెప్పెను. వా రట్లు గావించిన పిదప "మీకుఁ త్వరలో సంతానప్రాప్తియగు" నని దీవించి పంపెను. కొన్నాళ్లకు వారి కోరిక ఫలించినదని విని సంతసించెను.

క్రీ॥ శ॥ 1931 - 1933 సంవత్సరమున విజయనగరాస్థానాధీశ్వరుఁడగు శ్రీతిలక్‌నారాయణగజపతి దాసకవీంద్రులను నాహ్వానించి వేసంగికాలములో నుదకమండలమునకుఁ దీసికొని పోయిరి. అచ్చట మోటారులో వారిని నెక్కించుకొని శ్రీరాజావారు

స్వయముగా నడుపుచు నెత్తుపల్లములు గల మార్గముపై నతి వేగముగాఁ బోనిడుచుండుట చూచి "మహాప్రభూ! దయచేసి కొంచెము నెమ్మదిగా నడుపుఁ డని కోరెను. అందులకు శ్రీవారు నేనే స్వయముగా నడుపు చుండఁగా మీకు భయ మెందులకు, నని పలికెను, అందులకు దాసకవీంద్రుఁడు "అందులకే - అందులకే"యనిరి. ఆమాటలకు శ్రీవారు నవ్వుకొనుచు డ్రైవరును నడప మని తాము దాసకవీంద్రుల ప్రక్కనఁ గూర్చుండిరి.

శ్రీచెల్లపిళ్ల శాస్త్రిగారు లోక యేకాకిని దాసకవీంద్రుల కడకు సంగీతాభ్యాసము కొఱకుఁ బంపెను. ఒకనాఁటి రాత్రి యతఁడు భోజనసదుపాయము లేక దాసకవీంద్రుల సన్నిధికి రాఁగ నదికనిపెట్టి వారు వానికి రెండు రూక లిడి దేవీ దుకాణమునకుఁ బోయి మిఠాయిఁ గొని తిని రమ్మని పంపెను.

ఒకనాఁడు దాసకవీంద్రులు ఏటియొద్దునఁ బోవు బెస్త వానినిఁ బిలిచి వాని బుట్టను బరికించి జీవించి యున్న వానికి వానికి వెలనిచ్చి వానిని నీటిలో విడిఁచి పైవఁ జూచి పేరన్నగారు "నవ్వి" అవృత్తి మీఁద జీవించు వానికి నీవెన్ని సారులీవిధముగాఁ జేయఁగలవు. నిరంతర వ్యాపార మైన దీనిని మాన్పించుటకు నీకు సాధ్యపడునా!" యనియనెను. అందులకు సృష్టిలో మనము జన్మించిన పిదపఁ దోటి జీవులకు సాధ్యమైనంతవఱకుఁ దోడ్పడుటయే పరమార్థ మనిపలికెను."



ఒకనాఁడు పాలకొండ భూముల వేలము వేయుచుండఁగా విని దాసకవీంద్రులుగూడఁ జేరి మూఁడెకరముల భూమినిఁ గొనఁ దలఁచి రెండువందల రూపాయలవఱకు బాడెను. అచ్చటఁ జేరిన వెలమదొరగారు మీసమును దువ్వుచు మూఁడు వందల రూపాయలకుఁ బైపాటను బాడెను. అక్కడఁ జేరిన వారెవ్వరు పైపాటఁ బాడకుండిరి. అంతట దాసకవీంద్రులుఁ నాపాటకుఁ బైపాట కలదా! యని వ్యంగ్యముగాఁ బలికి నాలుగువంద లని యనిరి. దొరగారు దొంగకుఁ దేలుకుట్టినట్లు మిన్నకుండిరి. అంతట దాసకవీంద్రుల పాటను ఖాయపఱచిరి.

---

దాసకవీంద్రులు దక్షిణదేశయాత్రలో నొకనాఁడు విరుధ నగరము స్టేషనునకుఁ బోయిరి, ఆ సమయమున పెన్కోట ప్యాసింజరు వచ్చినందున టిక్కెట్లు కొని సామానులతో బండి నెక్కిరి. అబాండితమగమ్యస్థానమున కర్థరాత్రి వేళ కరుగు నని యెఱింగి మఱల సామాను దింపించి ప్రయాణ మాపి కొని మఱునాఁడుదయమున వారు వేరొక మార్గమున గమ్యస్థానమునకుఁ జేరుకొనిరి. పెన్కోట ప్యాసింజరు ప్రమాద వశమున నొక వంతెన పైనుండి బడిపోయె నని దానివలన ప్రయాణీకు లెందరో మరణించి రని వార్తఁ దెలిసికొని దాసకవీంద్రులు శ్రీ కన్యాకుమారి తనపైఁ జూపిన దయకు మనస్సునఁ బ్రస్తుతించెను. పిదపఁ గొన్నాళ్ళకు నచ్చటకుఁ జేరి యద్దేవిని సహస్రనామములతో సన్నుతించెను. అదియే "తల్లి విన్కి"గా గ్రంథ మైనది.

ఒకసారి కాకినాడ గానసభలో దాసకవీంద్రులు హరికథా కాలక్షేప మొనరింపు చుండిరి. జనము క్రిక్కిరిసియుండిరి. అప్పు డొక జమిందారు అచ్చటఁ గూర్చుండి యున్న జనుల నందఱఁ ద్రోసికొనుచు వచ్చి ముందుఁ గూర్చుండి కొంతసేపుండి మఱల లేచి పోయెను. దాసకవీంద్రులది చూచి "పుట్టినతోడనే గిట్టి నట్టు తానీలోకమునకు నెందులకు వచ్చెనో యిందుండి యేమనుభ వించెనో యాదేవునకే తెలియు''నని పలికెను. ఆమాటల కెల్లరు కడుపుబ్బనట్లునవ్విరి.

ఒకసారి దాసకవీంద్రులు అష్టాదశపురాణ సారమును వ్రాయుచుండిరి, అప్పు డొక రచ్చటకు వచ్చి నమస్కరించి "మహాకవీ మీరేదో గ్రంథమును వ్రాయుచున్నారు. అది యేదో వినవచ్చునా!"! యని యడిగిరి, అందులకు వారు "అఖిలపురాణ సారమును వ్రాయుచుంటి" ననిపలికిరి. అందులకు వారు "అది యెవ్వరికిప్పుడు గావలయు" ననిరి. అందులకువారు "ఒకరికిఁ గావలయు నని వ్రాయుట లేదు. నాసంతృప్తి కొఱకువ్రాసి కొనుచుంటి"నని పలికెను.

ఒకసారి బాపట్లలో దాసకవీంద్రులు హరికథాకాలక్షేప మొనరింపు చుండిరి. సభికుల మహదానందము ననుభవింపఁ జేయుచు విశేషనృత్యగానాళుకవితాదులను వారానాఁడు ప్రదర్శింపఁజేసి ముగించిరి, కాలక్షేపానంతరము న్యాయమూర్తి వారినిఁ బ్రశంసించి పురజనుల తరపున ఘనముగా సత్కరించి "మహాక



వీంద్రా! మీజననీజనకుల యాశీర్వాదబలమెట్టిదో కాని యీ ముది వయస్సున వర్ణనాతీతముగా నాడుచుఁ బాడుచు నాలుఁగు గంటల కాలక్షేప మొనరించుటకుఁ గావలసిన బలమును గలిగి యున్నారు కదా" యనెను. అందులకు వారు మందస్మితు లగుచు "నా బాల్యదశ యందు స్వేచ్ఛా విహారమును జేయకున్న వింత కన్న బలశాలినై యుండెడి వాఁడనే" యని వ్యంగ్యముగాఁ బలికెను. అమ్మాటల కెల్లరు కడుపుబ్బనవ్విరి.

విశ్వకవి రవీంద్రనాథ టాగూరు యొక పర్యాయము విజయనగరమునకు వచ్చిరి. వారికిఁ బౌరులు బ్రహ్మాండ సన్మాన మొనరించిరి. సభానంతరం మహాకవితోఁ దమకుఁగల ప్రత్యక్ష పరోక్ష పరిచయములను దెలిపికొనుచుఁ బ్రణామములను భక్తి పురస్సరముగా నొసఁగు చుండిరి. వారు దాసకవీంద్రునిఁ గూడఁ జూచుచుండిరి. వారుమాత్రము రాక కూర్చున్నచోటనేయుండిరి. తుదకు విశ్వకవియే సభ యంతయుఁ బరికించి గవీంద్రు నరసి కలకత్తా యందలి సంగీత మాధుర్యమును గుర్తుకుఁ దెచ్చికొని లేచి స్వయముగాఁ బోయి కవీంద్రుని యోగక్షేమముల నరసి "నేను మీకు స్మృతిపథము నందుంటినా!" యనిపలికెను. అందులకు దాసకవీంద్రుఁడు లేచి ప్రణమిల్లి "నాపలుకులనే మీరు పలికి విశ్వకవి కీర్తికి మఱింత విఖ్యాతినిఁ గూర్చితిరికదా. తమోహరుఁ డగు సూర్యభగవానుని మఱచు నంతటి యవివేకము మానవునకుఁ గలుగదుకదా'' యని పలికెను. ఉభయు లానంద పరిష్వంగన సౌఖ్యము ననుభవించిరి.

ప్రఖ్యాత నటకుఁడగు స్థానం నరసింహారావు తమ బృందముతో నాటకప్రదర్శనకై విజయనగరమునకుఁ బోయి యచట నొకచో బసఁ జేసెను. అచ్చటకు దాసకవీంద్రుఁడు సరాసరి వారి కడకుఁ బోయెను. శ్రీ నరసింహారావుగారు ఎవరీతఁడు చెప్పకుండలోనికి వచ్చినాఁడు" అని తలంపుచు వారి నిండైన విగ్రహము బుగ్గలక్రిందకు మెలిఁదిరిగి తెల్లఁ బడుచున్న రోసమును జూపు మీసములు దలకు విలువైన తలపాగా మోకాళ్ళ వఱకు దిగిన గోధుమ వన్నె లాల్చి గుండీ పెట్టకుండుటచే కంఠమందున్న యకుంఠితకాంతుల వెదఁజల్లు బంగారు రంగారుసింగారు గొలుసు మడిమల క్రిందకుఁ దొడఁగిన బంగారు తోడా తొడవు నడుగుల నుండి గడ్డము దాఁక దాఁకిన చేతికఱ్ఱఁ గలిగిన యా మహావ్యక్తినిఁ గాంచి యచ్చెరువు హెచ్చైచ్చ చూచుచుండెను. వారి వెనుకనున్న వారు కనుసైఁగఁ జేయుచు వీరు ఆదిభట్ల నారాయణ దాసకవీంద్రు లని తెలిపిరి. ఆమాట కచట నున్నవారు గుండె తటతట కొట్టుకొన లేచి నిలఁబడి వారికి క్షమార్పణను దెలిపిరి. దాసకవీంద్రు లంత్లే నిలువఁబడి "మీకంపెనీలో ఆకిరిపల్లి ఘంటా లున్నాఁడఁట. వాఁడేడి" యని ప్రశ్నించెను శ్రీ మాధవపెద్ది వేంకట్రామయ్యగారు వినయవిధేయుఁడై "పనిమీఁద నెచ్చటికో వెళ్ళినాఁడు. రాగానే తమ సన్నిధికిఁ బంపఁ గల"మని పలికెను. అంతదాసకవిగారు ప్రేమలొలుకునట్లు "మీ రంద రెవరురా అబ్బి" యని యడిగెను, అంత మాధవపెద్దివారు స్థానం వారినిఁ బరిచయ మొనరించి తనను బరిచయ మొనరించుకొనెను. అంతట దాస



కవీంద్రుఁడు 'స్థానము'వారినిఁ జూచి "రోషనార వేషమును నిర్దోషముగాఁ ధరించుతావఁట కదా" యని పలికెను స్థానంవారు వినయముగా "అవునండి" యన నందులకు నీపేరు - జోరుగా - విన్నానులే. అదేమిట్రా! అబ్బి! ఇలావుండి అలా యుండఁగలవని యంద అంటున్నప్పుడు "దానికి నీవు చిక్కితివా! నీకది చిక్కినదా!" యని యడిగెను. ఆమాటల కెల్లరు నవ్వుచుండిరి స్థానం వారికే సమాధానమును జెప్పుటకుఁ దోఁచక మిన్నకుండెను. ఇంతలో ఘంటాలు వచ్చి దాసకవీంద్రులకు సాష్టాంగ ప్రణామ మొనరించి "మేఘము గనఁబడక వర్షము గుఱిసినట్టు లయాచితముగా వచ్చి మాకంతులేని హర్షమును గలిఁగించితి" రని విన్నవించెను. "ఓరే ఘంటిగా! నేటినాకథకు నీమృదంగ వాద్యము కావలసి రావలసి వచ్చినది". యన నంతట నతఁడు "చిత్తం - ఇందులకు - మీరే - రావలయునా! వలసిన వార్త పంపినరానా!" యని యతఁడు పలికెను. అంతట దాసకవీంద్రులు వారితోఁ జెప్పిపోవుచుండ వారెల్లరు వారినిఁ గొంతదూరము సాగ నంపి నాఁటి హరికథాకాలక్షేపమును గాంచి యనంతసంతోష వార్ధి నోలలాడిరి.

ఒకసారి దాసకవీంద్రులను గూర్చి యొక కవీంద్రుడు ప్రశంశాపద్యములను వ్రాసి పంపించె. ఆపద్యములందు నొకదానిలో దాసకవీంద్రుఁడు భాషాపాండిత్యమునందు ననంతుఁ డని నాట్యశాస్త్రములో భరతుఁ డని సంగీతములో త్యాగరా జని ప్రశంసించెను. అది విని వారాగ మని నవ్వుచు "అరుమాసములు - సాముఁ జేసి ఆడదాని మీఁదకు యుద్ధమునకుఁ బోయి నట్లుగా

నుండి మర్త్యరూపమున నున్న గంధర్వుఁడనగు నన్ను ద్యాగరాజుతోఁ బోల్చినా దేమి! యనియనవెల్లకు కడుపుబ్బ నట్లు నవ్విరి.

ఒకసారి మహా మహోపాధ్యాయ బిరుద మెవ్వరి కీయఁ దగు నని శ్రీ అనంతపంతుల రామలింగ స్వామివారు కవీంద్రుల నడిగెను. అందులకు వారు మాధుర్యవంతమైన రచన నెవ్వరు చేయఁ గలరో! వారి కీయఁ దగు నని యెల్లర కట్టిచ్చుట తగదని లేదేనిఁ గమ్మని నశ్యము చేయఁ గలవాని కీయ వచ్చు నని పలికిరి.

ఒకనాఁడు దాసకవీంద్రులు భోజన మొనరించువేళ పోస్టు జవాను 'శుక్లపక్షము' అను గ్రథంమును దెచ్చియిచ్చెను. దానిని శ్రీ అప్పల నరసయ్యగారు చూచుచుండ "ఏమిత్రా! అది" అని యడిగిరి, "ఇది శుక్లపక్షమను గ్రంథము తమకుఁ బంపిరని వారు చెప్పిరి. అంతవారు "భేష్. బాగున్నది. ఎండవేళ వెన్నెల వచ్చినదే!" సరే కాని వ్రాసినవాఁడెవఁడురా!" అని వారడుగ. "కృష్ణశాస్త్రిగారు వ్రాసిరని తెలిపి, యందులోని భావనా గుణ్ణము భావకవి మున్నగు శీర్షికలలోని పద్యములను వారు చదివిరి. వానిని విని దాసకవీంద్రులు విఱుఁగఁ బడినవ్వుచు "అమ్మా! బరువుగాఁ బంపినాడురా!" యనియారచనలను మెచ్చుకొనెను.

ఒకసారి దాసకవీంద్రులు కాఫీ త్రాగుచుండ శ్రీ కర్రా వెంకట్రావుగారు ఎదుట మనమల నుద్దేశించి "మీకుఁజాల విశ్రాంతి



యున్నది కదా! యీపసికూనలకుఁ జదువుఁ జెప్పరాదా!" యని యడిగెను. అందులకు వారు తీక్ష్ణముగాఁ జూచుచుఁ జదువుఁ జెప్పటమా? నాకెవ్వఁడు చదువును జెప్పినాఁడు! ఒకరికొకరు చెప్పటమా! నీకెవ్వరు చెప్పినార" నిపలికెను.

ఒకసారి దాసకవిగారు ఆచార్య స్వామితోఁ గలిసి యష్టావధాన మొనరించిరి. వారతి శ్రమమీఁద నవధానమును సమాప్త మొనరించిరి. అనంతరము వారితో "గోదెవయస్సుననున్న యాంబోతుతో ముసలి బక్కను జోడు గట్టినట్లున్నది. దాసకవీంద్రా!" యని యనిరి. అందులకువారితో "ఇంక నవధానము పూర్తిఁగాలేదు మన యిద్దరులో నెవరు జెప్పిన పద్యములు - శ్లోకములు-వారు పైపలారము-లోనలొటారముగాకుండఁ గ్రమముగా వారు మఱలఁ జదివినఁగదా!" యనిరి. అందులకు స్వామి "కవీంద్రా! మూలుగు నక్కమీద తాటికాయపడివేసినావయ్యా" అనియనిరి.

దాసకవీంద్రుల నొకసారి రామలింగస్వామిగారు" మహాకవీంద్రా! బాటసారి వంటి ప్రబంధ మొకటి మఱల వ్రాయఁగూడదా"? యని యడిగెను. అందులకు వారు "దాసుగారు పునర్జన్మ మెత్తవలయును. ముదిమి నొదవిన దేహసౌష్టవము బుద్ధివికాసము కృష్ణపక్ష చంద్రుని వలె క్షీణింపుచుండును. దేశాటనము, వివిధగ్రంథపఠనము, ననేకులపరిచయము గలిగినను నూహలెక్కువైనను, దానివికాసము తళుకు బెళుకులు చెణుకులు-నణఁగుచుండును. అవి వాతకుఁగాని వ్రాతకుఁ జేతకు బనికిరావు ఒకవేళ వ్రాసినను నూఁకతిన్నట్టులగు" నవిపలికెను.

ఒకసారి యొకకవి కవీంద్రుల కడకు వచ్చిభాషించి "రచన మెట్లుండ వలె"నని యడిగెను. అందులకువారు" ఉద్రేక పూరితమగు మనస్సునందు నుత్సాహవశమునఁ దోఁచు వింతవింత లగు సంతరించు నూహలకు యథోచిత వర్ణములను గూర్చుటయే రచన. ఇతరులను మెప్పించుట కొఱకుఁ గాని ధనాశఁ జేతఁ గాని తాత్కాలిక ప్రయోజనముకొఱకుఁ గాని వ్రాసిన వ్రాఁత కాదు. గ్రంథరచన కీర్తికొఱకుఁ గాని ధనార్జనకొఱకుఁ గాదు'' అని పలికిరి.

జయపురమునుండి కొందఱు ప్రముఖులరుదెంచి "మీ కథాగానామృతములను మఱల నొకసారి వినఁ గోరుచుంటిమి అందులకు వేయిన్నూటపదారులను సర్పించుకొందుము. మిమ్ముఁ బదిలముగాఁ దీసికొనిపోయి మఱల జాగ్రత్తగా నిచటకుఁ జేర్చెద" మనిపలికిరి. అందులకువారు నిరాకరించిరి, వారెంతయో ప్రతిమ లాడిరి. కవీంద్రులప్పుడు "బోడితలకు నంటవేడుక-రానివారివిఁ బిలువ వేడుక యన్నట్టులున్న"దనిరి.

పాలకొల్లులో శ్రీచుండూరు నారాయణరావుగారు వారికథా గానకాలక్షేపానంతరము వారు "నారాయణరావూ! అన్నిభోగాలు అన్ని సన్మానాలు - బహుమతులు - భగవంతుని దయవలనఁ బొందఁ - గలిగితిని. "ముసలికి దసరాపండుగన్నట్లు" నాకొక కోర్కెజనించినది. నాదక్షిణ హస్తమునకున్న సువర్ణ ఘంటా కంకణము వంటిది వామహస్తమునకుఁ గూడగావలె ననియున్న" దనెను. వారట్లే కావించిరి,



ఒకసారి ఏలూరులోదాసకవీంద్రులు పండితులతో ముచ్చటింపుచుండ నొకపండితుఁడు "అయ్యా! పోతనామాత్యుని భాగవతమందు దోషము లెందు కున్న?" వని ప్రశ్నించెను. అందులకు దాసకవీంద్రుడు "గ్రుడ్డివానికి-లోకమంతయుఁ గ్రుడ్డి గానుండు" నని మఱల నతనికి మనసు బాధపడకుండ "అయ్యా! యట్లైన్నడు మహాకవి వ్రాయఁడు. ఒకవేళ పొరపాటు వలన జారిన వనుకొందము. చంద్రునకుమచ్చవలన వచ్చిన దేమి? ధనవంతుఁడు దాల్చిన చొక్కా దేన్నికైనఁ బట్టి చినిఁగిన దానిఁ జూచి యతఁడు నిర్ధనుఁ డని తలంచు వాఁడెట్లు రసజ్ఞుఁడగు?నని పలికెను. అందులకా పండితుఁడు నోట వెలగకాయ పడినట్టు మాటాడకుండెను.

దాస కవీంద్రు లొకపరి శ్రీకాకుళములో నొక సంపన్న గృహస్థుని గృహమునందు హరికథాగానప్రదర్శమును జేయుచుండఁ బెండ్లివారిలో నేదోవివాదము గలిగి యచ్చటనేవాదింపుకొను చుండిరి. అప్పుడు వారి ప్రసంగముల నాపుటకు బెండ్లివేళలో నిది కూడ నొకనలవాటని చెప్పుచు వీనిమాన్పుట చాలఁగష్టమనిచెప్పుచు "నొకబస్సు కండెక్టరుగారు అన్నగారి కుమార్తె వివాహమునకు నప్పుడే డ్యూటీదిగి చేరెను. అప్పటికి వివాహమై మిక్కిలి ప్రొద్దు వోయెను. భోజనాలకుఁ బెండ్లి వారు కూర్చుండిరి. అన్నగారు తమ్ముని్ఁ జూచి "నాయనా! యిప్పటికిఁ జాలఁ బ్రొద్దు వోయినది. నీవుకూడ నేదైనఁ దీసికొని వడ్డించినచోఁ ద్వరగాఁ బూర్తియయి భోజనంబుఁగు"నని పలుక నా కండెక్టరుగా సూపపాత్రను

గై కొని పంక్తులలో నటునిటుఁ దిరుగుచు "రాజమంద్రి- అమలాపురము" అని తిరుగుచుండెను. అందఱాశ్చర్య పడుచుండ నొకడందులో "ఏమండీ త్వరగా వడ్డించండి"యనెను. అందుల కప్పటికతఁడు స్పృహలోనికి రాలేక యెుక్కడే సీటుంది" అనెను అచ్చట వారెల్లరు నవ్వినారని చమత్కరించి, చెప్పినంతట వారు ప్రేక్షకులు గడుపుబ్బ నవ్వుచుఁ గథాశ్రవణాసక్తులయిరి.

దాసకవీంద్రు. లొకపరి ఏలూరులోఁ గథ చెప్పు చుండ నొక ప్రభుత్వోద్యోగి కూడ వచ్చి ప్రక్క యుద్యోగితో కచ్చేరి వ్యవహారములు మాట్లాడు చుండెను. దాసకవీంద్రులు సందర్భమునుజూచి యలవాటులనుగూర్చి "ఒక ప్రభుత్వోద్యోగికిఁ బుట్టింటనున్న భార్యలేఖవ్రాసి చివర "ఒక్కసారి తప్పక యిచ్చటకు వచ్చి చూచి పోవలసినది". అనిరెండు సారులు వ్రాసిముగించి పోస్టులో వేసెను.

మఱునాఁడాయుద్యోగి కచ్చేరికి సంబంధించిన లేఖలను జూచుచు వానికిఁ దగిన యుత్తర్వులను వేయుచు భార్య వ్రాసిన యుత్తరమును గూడఁ జదివి యందుఁ జివరవ్రాసిన పంక్తులు "మీరు దప్పక యిచ్చటకు వచ్చి చూచి పోవలసినది" యను దానిక్రింద గీత వైచి తనక్రింది అధికారికిఁ బంపుచు దీనివిషయము పైఁ జర్యను దీసికొనవలయునని వ్రాసిపంపెను. అది క్రింది యధికారి చూచి నవ్వుచు వారికి భార్య రమ్మని ఉత్తరము వ్రాసిననన్నుఁ బోయి చర్యను దీసికొను మని యనుట చాల నాశ్చర్య



ముగ నున్నదని తలంచి వారి కావిషయమును జెప్పియాలేఖను చూపెను. అప్పుడా యధికారి దానినిఁగొని చదువు కొని సిగ్గుపడెను" అనిచమత్కరించి చెప్పఁగనే ప్రేక్షకులు గొల్లుమని నవ్విరి. అంతటితో నాయధికారి లజ్జపడి కథాశ్రవణాసక్తుఁ డయ్యెను

---

ధరణిం జీకటి వేళ దవ్వు వెలుఁగుందర్శించు కందోయికి
న్మతి యేవస్తువు లైనఁ దోచఁనటు నిన్ ధ్యానించు నవ్వానిక
ద్దిర యీలోకవికారము ల్మది రవంతేనిన్ గనన్ రావుగా
నరయంగాఁ దనజీవితంబున మహాత్మా! సూర్యనారాయణా

"పాముం జావదు, కఱ్ఱయున్ విరుగఁ దన్వార్తాను సారంబుగా
సామర్థ్యంబున వస్తుశోధనయెడన్ శంకాసమాధానముల్
ల్రీమం బొందవు గాన జ్ఞానమునఁ దుష్టింజెంద రాదెందునన్
స్వామీ! నీపరభక్తి యోగమునఁ దప్పన్ సూర్యనారాయణా.

## ఉపసంహారము

ఆదిభట్ల నారాయణదాసమహాకవి - యాంధ్రహరికథాపితామహుఁడై - యాంధ్రభూమిన - నచంచల పాండిత్యప్రభావములను - నాచంద్రతారార్కముగా - స్థాపించి - యాధ్యాత్మికశక్తినిఁ బెంపొందించుకొని శిష్యులకుఁ బ్రశిష్యులకు మూలస్తంభమై ప్రజల హృదయములను జూఱఁగొని సత్యవాఙ్నియమవంతుఁడై నిర్భయుఁడై యేకసంధాగ్రాహియై మహామేధావియై గణితశాస్త్ర ప్రజ్ఞావంతుఁడై సర్వతంత్ర స్వతంత్ర ప్రవృత్తియుక్తుఁడై స్థితప్రజ్ఞుఁడై - భారతదేశ హరికథా కవితా సామ్రాజ్యమునకు మకుటము లేని చక్రవర్తియై బహుభాషాప్రజ్ఞావంతుడై దేశవిదేశీయుల గౌరవాభిమానములను సంపాదించి గజారోహణాది మహాసత్కారపరంపరలంది మహావ్యక్తి - మహామనీషి - మహాకవి యయ్యెను. వర్షము నందుఁ దడువనివాఁడు దాస మహాకవీంద్రుని హరికథామృత మాస్వాదింపని వాఁడానాఁడు లేఁడు. ఉండఁడు. గ్రంథములను లెక్కకు మీరి రచియించి కృతకృత్యుఁడయ్యెను. దాదా పఱువదిసంవత్సరముల నేకధాటిగా నిరాటంకముగా మహాభాగవత శిరోమణిగాఁ జరించి తరించి - యెనలేనికీర్తిని - వరించి - మనజాలని వ్యక్తిత్వమును ధరించి జీవిత పరమార్థమును భరించి సాధించి సంపాదించి - మహానుభావుఁడయ్యెను.

ఇట్లుండ విజయనగరపురవాసులు ప్రభుత్వోద్యోగులు కలసి వారి యాదేశమున హరికథాషష్టిపూర్తి మహోత్సవమును గావింపఁ బ్రయత్నము లొనరింపు చుండిరి.



ఇట్లుండ దాసకవీంద్రుని దౌహిత్రునకు మఱచిక జాడ్యము దగిలి నెలదినములు బాధించెను. ఆరోగ మమిత గాఢముగా నున్నదినమున దాసకవీంద్రుఁడు మిక్కిలి చింతించి "నాయనా! యీవ్యాధి నాకుఁ బ్రాప్తమైన బాగుండెడి" దని మిక్కిలి వాపోయెను. దాసకవీంద్రుని యాధ్యాత్మిక వేదన మూలముగా నాథ యంకరవ్యాధి నానాటికిఁ దగ్గి యతఁడు ప్రశాంత చిత్తుఁడయ్యెను. అప్పుడు వారియానంద వారిధికిఁ దీరము గనఁబడ కుండెను.

"విధిర్నానమసంహార్యః ప్రాణినాం" అన్నట్లు దాసకవీంద్రుల కానాఁడే జ్వరము గలిగెను. నాఁడు మొదలు దాసకవీంద్రులు మంచము మీఁద శాలువ గప్పికొని శయించి యీలోకముతో నాకు నిమిత్తము లేదని 'హరేరామ' మంత్రమును స్మరింపుచు భ్రాతృమూర్తి పేరన్నగారినిఁ గాని యంతేవాసులను గాని బిలువ నంపకుండెను. దాసకవీంద్రుఁడు దన పుత్రికారత్నమగు సావిత్రీదేవిగారు మంచము కడకుఁ జనుదెంచి కన్నీళ్లఁ బెట్టుట గాంచి "అమ్మా! సావిత్రీ! కన్నీరు మున్నీరుగా నింపకుము. నాకు స్వచ్ఛంద మరణము గలదు. కాన నీవు కలఁత జెంది నలఁత పడకు" మని ధైర్యమును జెప్పెను. ఆనాఁటి రాత్రి దాసకవీంద్రులు హరికథా కాశమునకుఁ గారుమబ్బులు గలియఁగ కవితాప్రపంచ దిగంతములకుఁ జిమ్మచీఁకట్లు గ్రమ్మఁగా నాప్తబంధుజనముల హృదయాంతర్నాళముల - నెన్నోకొండలు - కరఁగిపోవఁగా - నెట్టి యాయాసము లేకుండగఁ జిత్తప్రశాంతితో నిష్కామయోగ హృదయముతో ననితరదై వస్మరణతో "అనాయాసేనమరణం

వినాద్వైన్యేనజీవనం" అన్నట్టు- లస్తమించెను. "దినిజకవివరుల్ గుండియల్ దిగ్గురనగ - దరలినాఁడు నారాయణదాసు దివికి" ఆకాశమునందలి తారకలు మిలమిల మెఱయుచుఁ దమతోటి జేరనున్న వెలుఁగునకు ద్విగుణీకృతోత్సాహపరంపర లొందినవి. అంతటితోటి హరికథాషష్ఠిపూర్తి సన్మానయత్నములు రాహుకబళితచంద్రుఁడయ్యెను.

మఱినాఁ డీవార్త దేశమంతయు నాకాశము గ్రమ్ము మేఘమువలె వ్యాపించి యెల్లర మనస్సుఁ గలంచి వైచినది. ఎన్నోసానుభూతి కార్యక్రమములు జరిగినవి. అట్టి మహావ్యక్తి మఱల జన్మించుటకు నెన్నివేల సంవత్సరములు కావలయునో యని యాంధ్రమాత వేచియున్నది.

స్వస్తి! ఓమ్ తత్సత్.

— సంపూర్ణము —